సాధన గ్రంథ మండలి 75.

# దేవపూజా రహస్యము




రచయిత:

శ్రీ క్రియానందనాథుఁడు

ఈశ్వర సత్యనారాయణశర్మ, శ్రీకాకుళము.





ప్రకాశకులు

సాధన గ్రంథ మండలి, తెనాలి,


 1959 [వెల రు. 1-12-0

శ్రీ శర్మగారి గ్రంథములను ముద్రణా యోగ్యముగా వ్రాసియిచ్చిన శ్రీవారి ప్రియశిష్య పుత్రికా నిర్విశేషాదృత, పుణ్యవతి చి॥ సౌ॥ రావలూరి సరోజమ్మగారు పాఠకలోకాశీర్వాద పాత్రురాలు.



జానకీరాం ప్రెస్, తెనాలి.

# ఆ ము ఖ ము

"జలే విష్ణుః స్థలే విష్ణుః విష్ణుః పర్వతమస్తకే,
జ్వాలామాలాకులే విష్ణుః సర్వం విష్ణుమయం జగత్ ॥"

అను భావమును జీర్ణించుకొని జాగతికులయ్యు సర్వజగదభివ్యాప్తమైన భగవత్తత్త్వము నారాధించి నిశ్శ్రేయసానందమును జూరఁగొనిన మహనీయులు భారతీయఋషిపుంగవులు. వారు వేదేతిహాసములయం దీ యారాధనాక్రమము నభివర్ణించి యజ్ఞలోకమునకై యీ యానంద ద్వారములను దెఱచియుంచిరి. శ్రీమద్భాగవతపురాణోక్తములగు శ్రవణాది నవవిధభక్తులు నా యారాధనాక్రమములోనివే. నిశ్శ్రేయసానందము నొందుటకు ఏ మార్గాభివర్ణనమే అలంపర్యాయమయ్యు అజ్ఞలోకము ఐహికవిషయాలంపటమై, అద్వితీయానందదాయకమగు ఆ పరతత్త్వమును విస్మరించుచునే యున్నది. మనోవాక్కాయములచే నేకార్యమందు నిమగ్నుడై యున్నను మనుజుని దృష్టి భగవచ్చరణారవింద సంలగ్నమై యుండుటకై దూరదర్శు లిన్ని మార్గములఁ బ్రస్తావించిరి.

అర్చామార్గ మా మార్గములం దొకటి. ఈ మార్గమును విభూతిమంత మొనరించుటకే వివిధ దేవతా విగ్రహములను, వివిధ మాంత్రిక తాంత్రిక రీతులను, వివిధ పూజావిధానములను వారేర్పఱచిరి. కాని లోకము పాశ్చాత్యసభ్యతావ్యామోహితమై ఋజువిశ్వాస శూన్యమై "నిర్గుణుఁడగు నీశ్వరునకు రూపకల్పనయా! పాషాణ విగ్రహారాధనమున బరతత్త్వము లభించుటయా!" అని శంకాకులితహృదయమై

యున్నందున నీ మార్గము ననుసరించియు యభీష్ట లాభసిద్ధి నందుట లేదు.

ఈయవిశ్వాసమువలననే యనూచానముగాఁ బూజింపఁబడుచు, నిలవేల్పులై యుండు సాలగ్రామములన్నియు గంగా గోదావరుల కర్పితములై పోయినవి. ప్రాతఃకాలమున భగవత్పూజామహితుఁడై చెన్నొందవలసిన బ్రాహ్మణుఁడు స్నాన సంధ్యా రహితుఁడై కార్యాంతరవ్యగ్రుఁ డగుచున్నాఁడు. ఇతరులఁగూర్చి చెప్పనదేమి? ఇంతటి యవిశ్వాసము, శ్రద్ధా విహీనత పెనుకొనియుండఁగా భగవత్పూజనమున నీప్సితసిద్ధి యెట్లుకలుగును? ఇట్లయ్యుఁ గ్వాచిత్కముగ అలివేలుమంగా పతినో, అన్నవర గిరీంద్రనిలయునో యాపదయందు అనన్య గతికుఁడై వేడుకొని యభీష్టసిద్ధి నందుచు నేయున్నాఁడు. ఈ సాఫల్యతచేఁ జిత్తమునందలి యవిశ్వాసపుజాడలు తాత్కాలికముగాఁ బ్రక్కకుఁదొలఁగినను మరలఁ గమ్ముకొనిపోవుచునే యున్నవి. అద్వైతమతాచార్యులగు శ్రీ శంకరభగవత్పాదులే

"అంతః శాక్తో బహిశ్శైవః సభాయాం వైష్ణవోత్తమః
వ్యాఖ్యానకాలే చా ద్వైతీ........"

అయి వరలి యుండిరనుచో లోకమునకు భగవత్పూజా విషయమునఁ గల యవిశ్వాసము లన్నియు నిర్మూలములని చెప్పనక్కఱలేదు.

పరదేవతాపాదారవింద పూజామహితులు శ్రీ శ్రియానందనాథాపరనామధేయులునగు బ్ర. శ్రీ ఈశ్వరసత్యనారాయణ శర్మగారు తమ యీ ప్రస్తుతగ్రంథమున దేవపూజామర్మము

లను దేటతెల్లము గావించుటయేగాక వర్తమానలోకమున రేకెత్తియున్న సర్వవిధములైన శంకలకు శాస్త్రీయ వైజ్ఞానిక రీతుల సముచితసమాధానముల నిచ్చియున్నారు. శ్రీశర్మ గారి వైదుష్యము, అర్చావిషయిక పరిజ్ఞానము నెంత స్తుత్యమైనవో అంతకు వేయిమడుంగుల గొండాడందగినది వారి భాషావిషయిక పరిజ్ఞానము. అందుచే ధారావాహికమగు శైలితో నలరారుచు గ్రంథము స్వతః ప్రకాశమైయున్నది. సారవిహీనమైనంగదా పరతః ప్రకాశాపేక్ష.

శ్రీ శర్మగారి గ్రంథమునకు పరిచయ వాక్యములు వ్రాయుటకు నేను సర్వవిధముల నసమర్థుండను. కాని శ్రీశర్మగారికి నాయందుగల వాత్సల్యముచే ఆశీఃపురస్సరముగ వారి యాజ్ఞ నాకు అనుల్లంఘనీయమైనది.

తుదిపల్కుగా ఆంధ్రలోక మీ గ్రంథము నాదరించి యర్చావిషయికమైన యవిశ్వాసమునుదొలంగి, భగవత్పూజా మహితమై తేజరిల్లంగలదని విశ్వసించుచు మరల నొకసారి —

"నలినకదంబకుందముఖ నవ్యసుమాంజలితోడ నంబ! నీ
సులలిత రత్నకాంతి పరిశోభితనూపురధాళధళ్యతా
కలితమనోహరంబులగు కంజపదంబుల నిష్టసిద్ధికై
కొలిచెడి భక్తకోటికిని గొంగున బంగరు కావె శాంకరీ!"

అనుమాట సత్యదూరముకాదని చెప్పుచున్నాను.

ఇతిశమ్

— విద్వాన్, బులుసు సూర్యప్రకాశశాస్త్రి

# ఒక మాట

మండలికి యిది పదమూడవ వత్సరము. కాగితపుధర విపరీతముగాఁ బెరుగుటచే గ్రంథముద్రణ మెంతకష్టసాధ్యమో పాఠకులే తెలిసికొందురు. బ్ర. శ్రీ ఈశ్వర సత్యనారాయణశర్మ గారు మా మండలియెడ వారికిఁ గల ఆదరాభిమానములతో తామురచించిన 'దేవపూజారహస్యము' మండలిలో ప్రకటించుటకు అనుగ్రహించుటయే కాక గ్రంథముద్రణ విషయమున సంపూర్ణమగు ఆర్థికసహాయముకూడఁ జేసిరి. వారికి మా కృతజ్ఞతాపూర్వక నమస్కృతంబు లర్పించుచు పాఠకుల కరకమలములం దీగ్రంథము నుంచుచుంటిని. మండలి పోషకవర్గము యథాప్రకారముగ మండలికృషికి సంపూర్ణ సహకారమిచ్చి తోడ్పడుదురుగాక!

వికారి చైత్రము<br>30-4-1959

సంపాదకుడు<br>సాధన గ్రంథ మండలి



# అభిప్రాయము

ఆత్మానందకవి, శతావధాని

శ్రీ ఉప్మాక నారాయణమూర్తి, B. A.

వకీలు, పార్వతీపురము.

శ్రీ వే॥ బ్రహ్మశ్రీ "శ్రీ శ్రియానందనాథ" దీక్షా నామములు ఈశ్వర సత్యనారాయణ శర్మగారు నా బాల్య మిత్రులు. వారు వ్రాసిన "దేవపూజారహస్య" మనెడి పుస్తకము నుదరముట్టఁ జదివితిని. గ్రంథముల నాధ్యాత్మికోపాసనా రహస్యములను లోకమున కందిచ్చువాని ననేకములను వ్రాసిరి. స్వానుభూతిరహస్యప్రకాశనమే వీరి రచనములందు ముఖ్య లక్ష్యమని తలఁచుదును. ఆంధ్రాస్తికలోకమున కనేకముల నందిచ్చిరి గాన, నేనిపుడు విశేషించి వ్రాయఁబనిలేదు.

ఏదోవిధముగాఁ బూజ చేయని మానవుఁడే లేఁడు. దానిని ఋష్యుద్దిష్టభావముతో జరుపునప్పు డది యుపాసనము పేరఁ బరగును. శ్రీ శర్మగారు ఆ ఋషిభావములను బూజాంగములందు యోజ్యములగువానిని జక్కఁగా బయల్పెట్టిరి.

"గౌరవితప్రీతిహేతుక్రియాపూజా" యని ఆ గౌరవిత వస్తు వాత్మయొక్కటే యని తెలియఁజెప్పి, పూజాంగక్రమ రహస్యముల కడకుఁ బాఠకులను గొంపోయిరి. ఆచమన క్రియారహస్యముతో నారంభించి మంత్రరహస్యము, మూర్తి రహస్యము, మూర్త్యావాహన రహస్యము, కతిపయ మూర్తి కరగత పరికర రహస్యము మున్నగు వెన్నిటినో హృదయా కర్షకములుగ వెల్లడించిరి.

ఉపాసక సాధక హితార్థమయిన మూర్తిపూజా కాలాదిక నిర్ణయ మెటులయ్యెనో, యార్ష మతమును వెల్లడించిరి. సంకల్పవాక్యములందలి కాలసంకీర్తన రహస్యవివరణము, హృదయంగమము. 'పరమేశ్వరప్రీత్యర్థం, శ్రీదుర్గాప్రీత్యర్థం' మున్నగు మాటలందు షష్ఠీవిభక్తికంటె సప్తమీవిభక్తియే సమంజసమనుట యెంతో యుక్తియుక్తము, గ్రాహ్యము. మన కాత్మవస్తువునందలి కృతజ్ఞతకు వెలిగుఱుతే పూజ యని వ్రాసిన భాగము బహు తృప్తికరము. కొన్ని మూర్తివిశేష తత్త్వములు మనలో ననేకులు వినియుండనివని నా యభిప్రాయము.

ఆయాయి రహస్యముల నెఱింగికొనుటకై తమ యుపాస్యదేవతను శ్రీమాత నెంత కష్టపెట్టిరో, ఎంత యనుభూతి నొందిరో పాఠకులే తెలియఁగలరు.

జాతి మత లింగ విచక్షణ లేక, చదువరుల కెల్లరకు మహోపకారమగు నీ గ్రంథమే వీరి ప్రజ్ఞావిశిష్టతను ప్రతిభను మనీషులకుఁ దెలియఁజెప్పఁగలదు.

గ్రంథభాష సారస్వతమున కలంకారమనుటయు నతిశయోక్తి కాదు. "శ్రీ సత్యనారాయణశర్మసాధనము, శ్రీ దేవీసూక్త పరమార్థము, శ్రీసూక్తరహస్యార్థము" మున్నగు రచనములన్నియు సాధకలోక సమాదరణీయములే.

శ్రీ శర్మగారు నా కంటెను వయోజ్ఞానవృద్ధులు సగుట వారికిని, వారి రచనములకును నతిశతము నర్పించుచున్నాను.

శివమ్.



గ్రంథకర్త:

శ్రీ ప్రియానందనాథాపరనామధేయ

ఈశ్వర సత్యనారాయణశర్మ

# విషయ సూచిక

శ్రీమాత్రే నమః

# సమర్పణము

ఏ పరదేవత మహర్షి హృదయములందు మేధాదేవిగ నవతరించి, పూజ్యపూజక పూజారూపమునఁ ద్రిధావిభక్తమైన యేకైకమహస్సు తనదేయని తెలిపి, యాచమనక్రియాది ప్రణామాంతమగు దేవపూజలందలి భావరహస్యములను బోధించి, సమగ్రపూజాంగక్రియలను యథార్థభావయుతముగఁ జేయించి, సంకల్పవాక్యకాల సంకీర్తనాదులు సాధనమార్గ ప్రగతిప్రమాణమును దెలుపునవి యని నచ్చఁబలికి, బహిరంతర ప్రకృతిసంబంధమును బోధించి, మంత్రరహస్య, మూర్తి, వాహన రహస్యాదులను బూర్తిగ వెలిఁగించి, సిద్ధిదాత్రియై, యా ఋషిబృందమందు నిర్మాణచిత్రరూపమున వెలసి, లోకానుగ్రహదీక్షగాఁ బ్రకాశించి, తన నెయ్యపుం బిడ్డలైన జీవులను దనయొడికిఁ జేర్చుకొను వెఱవులను దానే తెల్పి, స్వస్వరూపానంద లీల నెఱపు దేవికి, జీవకారుణ్యమూర్తికి, దుర్గాకాళీ రాజరాజేశ్వరీత్యాది స్త్రీలింగ నామరూపగాను, శివ గణేశ కృష్ణాది పుంలింగరూపగాను దానే నిల్చి పూజలందు బహుభావరూపకు, ఆ జగన్మాతకు, మహామాయకు ఆత్మార్పణక్రియారూప ప్రణామములతో, మనోమంత్రపుష్పములతో నీకృతిని సమర్పించువాఁడు

శ్రీ శ్రీయానందనాథుఁడు

ఈశ్వర సత్యనారాయణశర్మ.

శ్రీ మాత్రేనమః

ఓం ఈం నమః.

# అవతారిక

మన భారతభూమియందే కాదు, విశ్వమందంతటను రాచనగరులందు మొదలు పేదవాని గుడిసెయందు వఱకును పుణ్యచరిత్రులైన మహాపురుషులు మొదలు తామసికులైన దొంగలు వేటకాండ్ర పర్యంతము నెల్లరును నేదో యొక రూపమునఁ బూజలుచేయుచు నేయున్నారు. కోరికతోనే కానీ, కోరిక లేకే కానీ, దాని ప్రకారమేదేని గానీ, మానవజీవన మందిది యొక యంగముగా నున్నది.

ఈ పుణ్యభూమియైన భారతమందలి మనీషులు దీనిని మాటికిం బ్రశంసించిరి. తామాచరించి, యపూర్వాదర్శమును మనయెదుటఁ బెట్టిరి. దీనివలన జగత్తు పూజ్యమైనది. ఈ పూజ యాధునికము కాదు, వైదిక కాలము నుండియు. అంతే కాదు; సృష్ట్యారంభమునుండియు సాగివచ్చుచునే యున్నది. వేదములయందలి యుపాసనా కాండము కర్మకాండమందలి పూజారూపమే. దేవతలు, ఋషులు పూజలుచేయుచుండినట్లు పురాణములు ఘోషించుచున్నవి. ధర్మార్థ కామ మోక్షము లనెడి నాల్గు పురుషార్థము లిచ్చు నుపాయము లివి కాకున్న బూర్వులు చేసియుండరు. మనకుఁ జెప్పరు. పూర్వర్షుల లక్ష్యము జగత్కల్యాణమే. అది భగవంతుని లక్ష్యమే.

కావున భగవంతుండే గీతయందు "పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి" యనెను. చండీపాఠ (దుర్గాసప్తశతి) మందు "ఏవం స్తుతా సురైర్దివ్యైః కుసుమైర్నందనోద్భవైః। అర్చితా జగతాం ధాత్రీ తథా గంధానులేపనైః। భక్త్యా సమస్తైస్త్రిదశైర్దివ్యైర్ధూపైస్తు ధూపితా" ఈ విధముగా స్మృతి సంహితా పురాణాదులం దెల్లెడం బూజా విధానము పలువిధములుగా వర్ణింపంబడినది. తంత్రములం దీపూజావిధానములు విశేషించి విపులముగాం జెప్పంబడెను. ఉద్ధవుండు శ్రీకృష్ణభగవానుని "నిన్నెట్లు పూజించుట?" యని తెలియంగోరినపుడు, విధానములను జెప్పుచు "వైదికైస్తాన్త్రికైశ్చైవ మంత్రైర్మామర్చయేత్సుధీః" అని బోధించి వైదిక తాంత్రిక పూజావిధానములను సమముగానే గౌరవించెను. భారతభూమియందలి పుణ్యతీర్థములును, దేవమందిరములును, అంతేకాదు ప్రత్యేకగృహమును దీనికి మహోజ్జ్వల ప్రమాణములై యున్నవి. పూజాగృహమనుచునో, దేవుని పట్టనుచునో యొక పేరుతో నొక పవిత్రభాగము లేని యిల్లు లేదు. ఇంటివాండు దేశాంతరీయ వేషముగ్ధుండై నిజకులోచితాచారముల కన్నింటికిని మంగళము పాడినవాండే కానీ, యిల్లాలు మాత్రము ఇష్టమైన దేవ దేవీపూజను మానదు. కొన్ని కులములందు నిత్యార్చనమునకు నిల్లు కార్చినను, ఏడాదికొకనాండైనను గులదేవతారాధనమును బాంధవావళి తోంగూడి చేయుదురు. పెద్దపెద్ద యజ్ఞహోమాదులన్నియుం బూజాంగవిశేషములే.

కాని, అకటా! ఈ యవిశ్వాసియుగమందు, నాలుగు వైపులను మిథ్యాసామ్రాజ్యము స్థాపింపంబడి యున్నది. ఇది

మన చిరాచరిత పూజావిధానమునకు సైతము కలంకమును దెచ్చిపెట్టినది. ఇప్పటికిని నీ దేశమందలి నరనారులు కోటికోటి సంఖ్యలు పూజలు చేయుచునే యున్నారు. ఆపూజలన్నియు నిష్ఫలములే యగుచున్నవనను. అనేకులు దీర్ఘకాలము పూజలు చేసియు విశేషలాభోన్నతుల నొందుచున్నారని యంగీకరించుటకును వీలులేదు. కారణమేమి? ప్రతిదినకర్తవ్యములను బాలించుట యనెడిది యింతకంటెను జేయుచున్నారు. ఇంక ధనాదిలోభముతోనే పూజలు చేయువారి మాట చెప్ప నేమున్నది?

ఎందుల కిటులగుచున్నది? నిత్యము పూజలు చేసియు జ్ఞాన భక్తిలాభము నొందజాలకున్నారేమి? యనుదానియెడ నైనను లక్ష్యముంచకున్నారు. ఇది పరిచయాభావము. ఎవరి పూజ చేయబడుచున్నదో, వారి పరిచయము వీరికి లేదు. వారెవ్వరో వీరెఱుగరు. వారెట్టి భావముతో నున్నారో యదియుం దెలియకయే పూజలు సాగించుచున్నారు. ఎల్లరు పూజలు చేయుచున్నారు. అదియుం దమ యలవాటు చెడకుండుటకే చేయుచున్నారు. మన పూజ యాశానురూప ఫలము నీయకున్నదే యను నిట్టి భావమును దలచుగా నెల్లర యందు నుండును.

ఈ దేశమందగుచున్న నిత్యక్రియలు, సంధ్యావందనాదులు, పూజాహోమాదులునైన కర్మకాండ మంతయుం బ్రాణహీనానుష్ఠానముగానే సమాప్తమై పోవుచున్నది. మన ధర్మ జగత్తున కీదుర్దశ పట్టినప్పటినుండియుం బహువిధములైన యభ్యాస్తులు నోరు తెఱచి మ్రింగివేయ వెన్నాడుచున్నవి. మ్రింగి

వేయుచున్నవి. మనుష్యుఁడు మనుష్యఘాతకుఁడై పోయినాఁడు. కామ క్రోధ లోభ మోహాహార్యాదులు వివస్త్రములై నాట్యము చేయుచున్నవి. ఈపుణ్యభూమి నిశాచరుల తాండవ నృత్యమునకు రంగమంచమైయున్నది.

దీనివలన రక్షింపఁబడుటకు నిది యొక్కటే యుపాయము. మఱల నీదేశమందు జరుగు కర్మకాండము ఉజ్వల జ్ఞాన పరాభక్తులపై నెలకొల్పఁబడి, సజీవమై లేచినపుడే, దేశమను గ్రమ్మిన యాహాకారములు, ఈ యుత్పీడనము, ఈ లేమి తొలఁగఁగలదు. ఒక్కసారి లోకము సత్యధర్మముల రసము నాస్వాదించునేని, మఱి ధర్మహీనము కాఁజాలదు. రాజకీయపుఁ జట్టములు దీనిని దెచ్చిపెట్టఁజాలవు. లోకము ధర్మహీనము కానిచో, సుఖములన్నియు మనుష్యులకు సహజలభ్యము లగును. విశేషించి దీనిని దెచ్చిపెట్టుపని బ్రాహ్మణులపైనే నిర్భరంపడియున్నది. ఏమన, వారే ప్రత్యక్షముగాను బరోక్షముగాను గర్మకాండమును నడుపువారై యున్నారు. వారే ప్రాణహీనమై, యెముకలగూడుగానైన యీ కర్మకాండమును బ్రాణమయముగాను సఫలతామయముగాను జేసి లేవదీయఁగలవారు. కేవల వ్యవసాయ భూములుగాఁగాక, వారే యాదర్శభూములై నిల్వవలయును. జగత్తునందెల్లరును సోదరులని యాదరించి తమ యొడికిం బిల్చుకొనవలయును. శ్రీశంకరాచార్యులు, చైతన్యప్రభువు, జ్ఞానేశ్వరుఁడు, సమర్థరామదాసు, ఆధునికులలో లోకమాన్యతిలక్ మున్నగువారట్లే చేసిరి. ఆదర్శప్రతిష్ఠ చేయఁబడినపుడు, ఎల్లరును ధర్మమయులగుదురు. కర్మమయు లగుదురు. సమస్తము ధర్మజ్ఞానమయమై లేచును. జ్ఞానపరాభక్తుల సుస్నిగ్ధ

ధారలచే మధుమయమగును. ఈవిశ్వరాజ్యము ధర్మరాజ్యముగా మాఱును. అసత్యము తొలఁగి సత్యప్రతిష్ఠయగును.

ఏవిధముగాఁ బూజింపగల్గినచో విశ్వాధిష్ఠాత్రియు, బ్రహ్మమయియునైన మహాశక్తి — సర్వధర్మ రక్షకుఁడైన భగవంతుఁడు ప్రసన్నుఁడగునో, ఆతడు భక్తిహీనమును, జ్ఞానహీనమును, శ్రద్ధాహీనమును, దుర్బలమునైన అవిశ్వాసియునైన సంతానము చేయు పూజలను, మ్రొక్కులను శిరసావహించి రములో నందుకొనునో ఈయవిశ్వాసియుగమందును నాతఁడు వెలసి (యావిర్భవించి) యభయమిచ్చి సంతానము నెటు లాదరించునో, యదియంతయు నీ చిన్నిపొత్తమందుఁ జదువరులు చూడఁగలరు. పూజ యెందులకై చేయబడుచున్నదో, యెవరి పూజ చేయఁబడుచున్నదో, కలశస్థాపన మెందులకో, ప్రతిమయందుఁ బ్రాణప్రతిష్ఠ యెట్లుగునో, మృణ్మయాది ప్రతిమలు చిన్మయము లెట్లగునో, జప కీర్తన స్తవాదు లెటుల చేసినచో నవి సార్థకములగునో, మంత్రచైతన్య మెటులగునో, ఆసనశుద్ధి, యాచమనము నన఼గా నేమో, వానివలనఁగలుగు లాభ మేమో, సంకల్పము కాలసంకీర్తనము ననువాని ప్రయోజన మేమో అను నిట్టివాని రహస్యములు సులభభాషలోఁ దెలుపఁబడినవి. పూజాసాధన మెంత జటిలమును గష్టసాధ్యము ననుకొనుచున్నారో యంత కఠోరము కాదు. ఎల్లరును జరుపుకొని బ్రతుకులు ధన్యము లొనర్చుకొనఁగలరు.

ఇది భాషాఝుంకారము కాదు. ఆసపెట్టు మాటలు కావు. పూజ్యపాదులును, సత్యదర్శులునైన ఋషులు చూపిన దారులందుఁ గల్పనములకు దావు లేదు. కొంచె మనుశీలింప

నోపికపట్టవలయును. భగవంతుడు దుర్లభుఁడు కాఁడు ఆతని యందు విశ్వాసమే దుర్లభము. దాని పూర్వాయోజనమే పూజ. పూజ చేయఁగాఁజేయఁగా బుద్ధి నిర్మలమగును. అది యెంత నిర్మలమగుచుండునో యంత ప్రత్యక్షత గలుగుచుం డును. జీవనము మధురతమమగును.

ఆహారనిద్ర లుండునంతదాక, అనుకూల ప్రతికూల వేదనముండునంతదాఁక, గురు లఘు జ్ఞాన ముండునంతదాఁక పూజజరుగుచునేయుండును. పూవులు పత్రి దట్టముగా నెక్కించి యూపిరాడనట్టు ధూపములు వేసినంతనే పూజాపరిత్యాగము కాదు. పూర్ణముఁ దెలియకున్నచో నపూర్ణము నెఱుంగు నుపాయము లేదు, కావునఁ బాఠకజీవులారా! రండు, మనము మంత్రహీనులమును, క్రియాహీనులమును, భక్తిహీనులము నైనను సనాతనధర్మగోప్తయైనవాని నుభయాంఘ్రులంబుఁ బట్టుదుము. ఆతఁడు నిశ్చయముగాఁ బ్రసన్నుఁడగును. అంద అమును జేరి,

ప్రసీద, దేవేశ! జగన్నివాస!
ప్రసీద, విశ్వేశ్వర! విశ్వరూప!

అని చేతులు జోడించి వేడికొందము.

— గ్రంథకర్త.

—•—

# దేవపూజా రహస్యము

## పూజా ప్రయోజనము

మనము తొలుత నెంతో కాలము శిలాది జడపదార్థము గానే యుండి, తరువాత నొక పేడపురుగువంటి కీటాణువుగా నయి, యుత్కర్షణచేఁ గ్రమముగా సర్వేంద్రియజ్ఞాన వికాసముతోడి యీ శరీరము నొందుటకై జన్మమృత్యుప్రవాహమం దీదియీది యెడపెడదెబ్బల కోర్చి యోర్చి, యీ మానవత్వమును సంపాదించుకొన్నాము.

మనుష్యత్వమునొందుటవలని లాభమును మనుష్యుఁడే వాంఛింపవలయును. ప్రతి మనుష్యుఁడును దెలిసియో తెలియకో తనలోపలనున్న యొక యవ్యక్తశక్తి ప్రేరణముచేత, నీ మనుష్యత్వమువైపు – పూర్ణత్వమువైపు ముందడుగు పెట్టుచున్నాఁడు. మనుష్యత్వమనఁగా నేమి? యను ప్రశ్నమునకు సమాధానముగా వేర్వేఱుదేశములవారు వేర్వేఱు సంప్రదాయముల ననుసరించు బుద్ధిశాలురు వేర్వేఱుగాఁ దమ యభిమతములను వెల్లడింతురు. సర్వవిధ జాగతికసుఖములు, శారీరక సామర్థ్యము, మానసికశక్తి, పరోపకారము. దేశసేవ, శిల్పవిజ్ఞానోన్నతి, శాస్త్రజ్ఞానము, ధర్మార్జనము, అలౌకికశక్తి, విషయవైరాగ్యము మున్నగు శ్రేష్ఠగుణములలో నొకటో రెండో యంతకధికముగానో యార్జింపఁగలుగునపుడే మనుష్యుఁడు మనుష్యత్వలాభమునొంది ధన్యుఁడగునందురు. తుది కిప్పటి జనములలో విద్యార్థి మొదలు ప్రవీణుఁడైన వయో

వంతుఁడైన వ్యక్తి వఱకు నిట్టి ధారణ (అభిప్రాయము) తోనే తన జీవితలక్ష్యమును నియమించుకొని ప్రయత్నించుచున్నాఁడు. కాని మన భారతీయ ఋషిసంతానము ఈ మనుష్యత్వ స్వరూపసందర్శమునఁ దాను తెలిసికొన్నది సర్వకాలము లందును, సర్వదేశములందును సర్వసంప్రదాయములందును భ్రాంతిలేని సత్యము — అదే యాత్మజ్ఞానము. ఆత్మజ్ఞానమే యథార్థ మనుష్యత్వమన్నది.

"నే నెవరు? నా యథార్థస్వరూప మేమి?" అను నిది చక్కగా నెఱుంగుటచేతనే మనుష్యుఁడు యథార్థ మనుష్యత్వము నొంది కృతార్థుఁడగును. తన స్వరూపము నేయెఱుంగని మనుష్యునకు మనుష్యత్వ మెక్కడిది? మనుత్వ మెట్లబ్బును? బ్రహ్మత్వ మెట్లబ్బును?

సాధారణముగా మనుష్యుఁడు — "నేను సుఖదుఃఖము లచే నిలుకడ లేకున్నాను. మృత్యుక్లేశముల నొప్పని యొక జీవ మాత్రుఁడను; అల్పాయుష్కుఁడను; అల్పజ్ఞానిని; దుఃఖమిశ్రిత మైన యానందమే నాస్వరూపము." అని యనుకొనుట వినుచున్నాము. కాని వాస్తవముగా నటుల కాదు. దీనినిబట్టి చూడఁగా "నేను"నకు మఱియొక యున్నతతరమైన స్వరూపము కలదు. దాని సత్త యఖండము; దాని జ్ఞానము పూర్ణము; దాని యానందము తెంపులేనిది. అలుప్తము; అది నా (నేను యొక్క) యథార్థస్వరూపము.

మన మిక్కడ ఏ 'నేను' అనెడి పేరితోఁ గూడు చున్నామో, ఆ యీ 'నేను' యథార్థమైన నేనుకాదు. ఆ 'నేను' యథార్థమైన నేను, అనుమాట చక్కఁగాఁ దెలిసి

కొని, యా నిత్యసత్యస్వరూపము నొందుటే, యనఁగా నాత్మ పరిచయలాభము నొందుటే యథార్థమనుష్యత్వము.

ఇంతకుమున్ను జెప్పిన జాగతిక సుఖములు, పరార్థ పరత్వము మున్నగునవి, మనుష్యత్వ విషయమున సద్గుణములుగాఁ జెప్పఁబడిన వన్నియు ఆత్మజ్ఞానములోఁ జేరిపోయినవే. అవేకాదు, పార్థివములు అపార్థివములు నైన గుణములు, సుఖములు నెన్నికలవో, యన్నియు నీ యాత్మస్వరూప జ్ఞానమనెడి యుదార మనుష్యత్వ లక్షణమందు ఇమిడియున్నవే. శ్రుతియు "ఆత్మనివా అరే విజ్ఞాతే సర్వమిదం విజ్ఞాతం భవతి" అన్నది. ఆత్మజ్ఞాన మొక్కటి లభించినంతనే సర్వము యొక్క పరిపూర్ణజ్ఞానము లభించును. ఆత్మజ్ఞానమే మనుష్యత్వముయొక్క అసలు స్వరూపమనెడి చోట నెవ్వరికిని నెట్టి సందియము నుండఁజాలదు. మనుష్యుని దృష్టి యాత్మజ్ఞానమనెడి మనుష్యత్వముయొక్క సర్వోన్నత లక్ష్యముపైకి, మెల్ల మెల్లఁగా నాకర్షింపఁబడుట యారంభమైనపుడే మనుష్యుఁడు కొంచెకొంచెముగాఁ దనను మహత్త్వముతో నలంకరించుకొను ప్రయత్న మారంభించును. తన మాలిన్యమును దౌర్బల్యమును దొలఁగించుకొని, గుణసమూహముతోఁ దానును మున్నాబగుటకుఁ బ్రయత్నించును. ఆ ప్రయత్నముయొక్క బాహ్యలక్షణమే - మహాత్మ్యపూజ _ అనఁగా నొక సమున్నతవ్యక్తిని గౌరవాదరములతో సన్మానించుట.

సమున్నత పురుషుల చరిత్రములు చదువుట, యందలి వారి మహత్త్వము, వారు చేసిన గొప్పపనులు మున్నగునాని ప్రణాళిని గ్రహించుట మున్నగునవి చేయుటచేతనే మనుజుఁడు తానును సమున్నత స్థితికి రాఁగలఁడు, వచ్చును.

జగత్తునందు మును జెప్పిన మనుష్యత్వలాభము - ఆత్మ జ్ఞానలాభము - నొందిన కృతార్థులైన వారిని, మనుష్యత్వ లాభమందు దారిని వడివడిగ ముందంజ వేయువారిని, స్మరించుట యందు మెలఁకువగల జనసామాన్యమున కెన్నో మేళ్లు గలుగును. ఈ యుద్దేశ్యముతోనే సభాసదులచే శ్రీ శంకర జయంత్యుత్సవములు, త్యాగరాజోత్సవములు నూన్నగు పేళ్లతో మహాత్మ్యపూజలు సాగుచున్నవి. ఈ యుత్సవ నిర్వాహకులు, ఉత్సవద్రష్టలును ఆమహాత్ములెట్టి యున్నతులు వెలసినందున నిపుడును బూజింపబడుచున్నారో యెట్టి యమరులై యున్నారో యది ముఖ్యముగా గ్రహింపకపోయినపుడు, ఆ మహాత్మ్యలాభమునకై ప్రయత్నింపకపోయిన శ్రమయు మాత్రమే మిగులును. ఆమహాపురుషుల యాదర్శజీవిత మనుసరించుటచే మనుజునందు దాగియున్నలేని యున్నతి సద్గుణములు క్రమక్రమముగా నభివృద్ధిపొందుచు వచ్చును. ఈవిధముగానే మనుష్యుఁడు యథార్థ మనుష్యత్వలాభమందుఁ జురుకుగా ముందంజ వేయఁగల్గును.

తొలుదొల్త "మాతృదేవోభవ, పితృదేవోభవ, ఆచార్యదేవోభవ" యనెడి శ్రుతినిబట్టి, మాతా పితృ గురు జనుల సేవలును, క్రమముగా దేశ సేవ, లోకసేవ కును సంబంధించిన ఘనులును శ్రేష్ఠులైన వారియెడ నిష్కపటముగా సమ్మానము చూపుట యనెడి పూజలు చేయుటయవసరము. ఇట్టి పూజలు ఘనముగా జరుపుచుండిన వారి సద్గుణములు పూజించువారు సంపూర్ణముగా సంగ్రహించు నధికారము గలుగును. ఇట్టులే మనుష్యుఁడు మహాత్మ్యపూజలు చేసి పూజనీయుఁడగును, ఉన్నతుఁడగును.

ఇపుడొక ప్రశ్నము వేయవచ్చును — "మహాత్మపూజ చేయుటచే మనుష్యుఁడెట్లు ఉన్నతినొందును?" అని. సరే, దీనికి సంక్షేప సమాధాన మేమనఁగా — చూడు, నీవొక సమున్నతపురుషునికో, నీకంటె ఉత్తమునకో యథార్థప్రణామము చేసితివనుకో; అప్పుడు. ఆప్రణామ్యుని యెడ నొకవిధమైన పూజనీయ భావము హృదయంగమమగును. అంతేకాదు; నీ యప కర్షత్వము (లఘుత్వము) సైతము బయలగును. కార్యతః అగునా యేమి? చూడు, ఒకవంక నీలోపలనే మహద్భావము (గొప్పతనము) నింద నారంభించును. రెండవవంక నీమిథ్యాహంభావమును అంతగా నొరగి పోవును. అనఁగా నీకు మహాత్ముల యెడఁ బూజ్యభావము పెరుగుచున్నకొలఁది నీ యహంకార మణఁగి పోవును. బాగుగా సూక్ష్మదృష్టితోఁ జూచితివేని, ఇట్టి ప్రణామము చేయుటచే నీవే లాభ మొందుచున్నావని చక్కఁగాఁ దెలిసికొనఁగలవు. ఇటులే యంతట ననుకొమ్ము. మహాత్సంగము, మహాత్మపూజ చేయుటచేతనే చిత్తము మహద్భావములతోఁ బొంగి పొరలును. అయినను బలు తావుల మనము చూచుచున్నది — బహుకాలము మహాత్ములతో సాంగత్యము, మహాత్ముల పూజలు చేయుచున్నను, విశేషోన్నతి యేవిధముగాను నబ్బకున్నది. దానికొక్కటే కారణము — యథార్థభావముతో నమ్మహాత్సంగపూజలు జరుగలేదు ఆ పూజాసేవా సంగములు అహంబోధమును విడిచి చేయబడనపుడు — ఆ మహాత్ముల సమున్నతభావములు చిత్తము నందుఁ జక్కఁగా సంక్రమింపవు, గనుక నెట్టి పనులు చేసినచో మనసులోపల మహత్త్వము నిండుకొనును, మన యహంకార మణఁగుటయు నగునో యట్టి కార్యములే

యెంత యధికముగాఁ జేయఁగల్గిన నంతగా మనము మహాత్త్వము వంక, అనఁగా మనుజత్వమువంక నగ్రేసరుల మగుదుము. మహాత్మపూజా మాత్రముననే మనుజుఁడు కొలఁది నాళ్లలోఁ గొలఁది శ్రమముతో మనుష్యత్వముయొక్క చరమలక్ష్యమును జేరఁగలఁడు.

కొంచము ధీరముగా నాలోచించినచో మనకు బాగుగా తెలియగలదు. ఏమనఁగా, పూర్వపు మన గురువుల వలనను, దేశమందును, లోకమందునుగల మహిమాన్వితులవలనను మన కెంతో లాభము గలిగెను. శాస్త్రకారులు పురాణకారులు కావ్యకర్తలు మున్నగువారు మనకు గురుజనులే. వారు చేసిన యపూర్వజ్ఞానోపదేశము మన సర్వవిధ సుఖలాభోపాయముగా నున్నది. వారు మనకుఁ జేసిన మేలునకు బదులుగా నీయఁదగిన వస్తువే జగత్తునఁ గానరాదు. వారివలన మన మెంతో యుపకారము నొందితిమో యంతకంటె నధికముగానే వారికి ఋణపడి యున్నామనెడి మాటయొక్కటే మాటిమాటికి దలంచుటచే, హృదయము కృతజ్ఞతతో నిండి తలంపోఁ గూడియే వంగి పోవును. అట్టి యపుడు, వారియెడ నోపినంతగా సన్మానము జూపుటకై మనసునం దొకవిధమైన యుద్వేగము (పొంగు) స్వభావముగానే పుట్టును. ఆ యుద్వేగమే బాహ్యమందు మహాత్మపూజగాఁ బ్రకటమగును. ఈవిధముగా మహాత్మపూజ చేసి మనమే మహాత్త్వపదవిఁ జేరుదుము.

సాధారణదృష్టికి మనముచేయు పూజచేత నమ్మహాత్ముల గౌరవము పెంపొందుటే యగునని పొడకట్టును. గాని, వాస్తవముగా నదిగాదు. పూజించి మనమే గౌరవము నొందుచున్నాము. "యాదృశీ భావనా యత్ర సిద్ధిర్భవతి

తాదృశీ" యనెడు శాస్త్రకారుల యమోఘవాక్యసార్థక్యము మనదేశమందంతటఁ గానఁబడును. ఎవఁడెట్టి చింతతో నాచరించునో, వానికిఁ దద్రూపమగు సఫలతయే యగును. కనుక మనుష్యుఁడు మహత్త్వమునకై పాటుపడి, మనుష్యత్వలాభమునొందఁ లాలసుఁ డగునపుడు, వాడు తప్పక మహత్పూజ చేయును; చేయవలయును. మనుష్యుఁడు పూజనీయుఁడగుటకై పూజచేసియే పూజత్వము నొందవలయును. మానవప్రకృతి కడు విచిత్ర మగుటచేత మహత్త్వాదర్శము భిన్నభిన్నముగా నుండును. అనఁగా మహత్త్వ మనేకవిధములుగా గానఁబడును, గాని యీ సర్వవిధముల మహత్త్వములు, సర్వవిధముల యాదర్శములు, నెచ్చోటఁ బూర్ణీభవించి యున్నవో యా పరమేశ్వరుని పూజావిషయముననే మనమిప్పు డాలోచింతము. పరమేశ్వరపూజయే యీ యుపన్యాసమందుఁ బ్రతిపాదింపఁబడు విషయము.

మనుష్యులు మహత్పూజ చేసియే మహేశ్వరపూజయందధికారులగుదురు. ఎక్కడ (ఎవనియందు) మహత్త్వము పరిసమాప్తమో, ఎవనికంటె మహత్తరుడు మఱిలేఁడో, ఎవ్వఁడు సమస్తగుణముల కాటపట్టో, ఎవ్వఁడు సర్వకల్యాణనిదానమో, ఎవ్వఁడనంత బ్రహ్మాండముల కద్వితీయాధీశ్వరుఁడో, అఖండసత్తయు పూర్ణజ్ఞానమును నిరవచ్ఛిన్నానందమును నెవ్వని స్వరూపమో, ఎవ్వఁడు నిత్యతృప్తుఁడో, ఎవ్వఁడు సర్వస్వతంత్రుఁడో, ఎవ్వఁడు సర్వజ్ఞుఁడో, ఎవ్వఁడలుప్తశక్తిమంతుఁడో, ఎవ్వనినుండి మన జన్మమో, ఎవ్వని యొడియందే యున్నారమో, ఎవ్వఁడు మన యేకాంతాశ్రయమో యాతని పూజచేయగల్గుటచే, అతని నిస్సీమ

కరుణను స్మరించి భక్తి వినమ్రచిత్తములతోఁ గృతజ్ఞతా పుష్పాంజలి నర్పింపఁగలుగుటచే, ఆతని యు[illegible] శరణాగతులము కాఁగల్గుటచే, మిథ్యాభి[illegible] యొక్క నికృష్టతల నాతని నిత్యమంగళకర పాద[illegible]ల యందు [illegible] గల్గుటచే మనుష్యుఁడు నిశ్చయముగా మహాత్త్వ[illegible] డగును. ఈశ్వరీయ గుణములచే (విభూతులచే) విభూషితుఁ డగును. ఆత్మస్వరూపజ్ఞానము నొంది, యథార్థ మనుష్యత్వ లాభముచే ధన్యుఁడగును. ఇతనిని గూర్చి యింకేమి చెప్పఁ గలము? మహాత్పూజ చేసి మనుష్యుఁడు మహాత్త్వ మొందఁ గల్గినపుడు, "మహతో మహీయాన్" అయిన వానిని బూజించి యాతఁడు మహత్తరుని గుణగరిమములతో నేల కలంకరింపఁబడఁడు? మహచ్చింత చేయఁగా జేయఁగా (గొప్ప వారి గొప్పను ధ్యానింపగా ధ్యానింపగా) మనుష్యుఁడు మహా త్త్వలాభము నొందఁగల్గునేని, ఈశ్వరునే ధ్యానింపఁగా ధ్యానింపఁగా, పూజింపఁగా బూజింపఁగా మనుష్యుఁ డీశ్వరత్వ లాభము నెందుకుఁ బొందఁజాలఁడు?

కనుక యథార్థ మనుష్యత్వ లాభమునకై యుబలాట పడువాని విషయమునఁ బూజ తప్పదు. మహాత్పూజయే కానిమ్ము, మహేశ్వరపూజయే కానిమ్ము. మనుష్యత్వమునకై పాటుపడు మానవుఁడు ఏదో యొకవిధమునఁ బూజించుటకును; పూజింపవలయును.

దేశభేదముచేతను, సంప్రదాయ భేదముచేతను, ఆచార భేదముచేతను బూజాప్రణాళిక లనేకవిధములుగాఁ గలవనుట నిజము. ఇట్లుండుటయు నుచితమే. [illegible] వచ్చిపోయెడి దేమియు లేదు. మనుష్యత్వమును లక్షించి

యెవ్వారి జీవనము అగ్రగసరముగుచున్నదో వారెల్లరును దెలిసియో తెలియకో యేదోవిధముగఁ బూజ చేసెడివారే యనుట యెల్లరకుఁ బ్రత్యక్షమైన సత్యము.

## పూజకు అధికారి.

మనుష్యుఁడు వివిధదుఃఖములచే మిక్కిలిఁ బీడింపఁబడి, మఱి యా దుఃఖముల వలనఁ దప్పించుకొనుటకు లౌకికములైన యుపాయములన్నియు వ్యర్థమై, అనఁగా నన్నివిధముల పురుష ప్రయత్నములు చేసినను వానికా దుఃఖము వలనఁ బరిత్రాణము లేనపుడు శాంతుఁడై యేదేనొక యలౌకిక శక్తికి శరణాగతుఁడగును. ఇది సాధారణముగాఁ జూచుచునే యున్నాము. అది మొదలు మనుష్యుఁడు భగవంతుని బూజించుటకు నాంది వేయును. సాంసారికమైన లేమియో, రోగశోకములు మున్నగునవియో పీడించునపుడు వానినుండి తప్పించుకొని సుఖముగా స్వాధీనతతో గడుపుకొను కోరికతోనో, పారలౌకికములైన స్వర్గాదిసుఖములను గోరియో మనుష్యుఁడు సాధారణముగా నీశ్వరపూజయం దాసక్తుఁడగుచుండును. ఇట్టి పూజయే సకామపూజ, ఆర్తపూజ యనఁబడును. ఈసకామపూజయును నిష్ఫలము కాదు. సరళబుద్ధితోఁ జెదరని నమ్మకముతోఁ జేయఁబడునేని యిట్టి పూజలు సార్థకములై ఫలప్రదము లగుచుండుటయుఁ గనుచున్నాము. పూజించుచున్నప్పుడు తాను బూజించుచున్న దాని యస్తిత్వమంగీకరించును, సర్వశక్తిమత్త్వమును నమ్మును, దాని యపార దయాళుత్వమందును గట్టినమ్మకముండును. అన్నిటికంటెను నావశ్యకము. దారిద్ర్యము ఆపదలు తొలంగుటకో, మఱేవేని కోర్కెలు

తీరుటకో, మనుజుఁడు చేయు ప్రార్థనములు సైతము బిచ్చగాండ్రు బిచ్చమునకై చేయు ప్రార్థనములవలె నుపేక్షాదూషితములై, యాన్త్రికములై యుండరాదు. ఏలన — పరమేశ్వరుని పూర్ణజ్ఞానమందును అతని యీశ్వరత్వమందును, అతని మహిమాదులయందును మనకుఁ బూర్ణమైన హార్దికగలదు. మన మతని బిడ్డలము, అతని సంతానము; అను నిట్టి దృఢమైన విశ్వాసము నిల్వవలయును. ఒకవైపు — భగవంతుఁడున్నాఁడు; అతఁడు సర్వశక్తిమంతుఁడు అనెడు విశ్వాసమును, రెండవవైపు — అతఁడు కృపతో వెయ్యముతో నిచ్చునది పుచ్చుకొనుటకుఁ దగు నధికారమునందుఁ దన నిఃసంశయప్రతిష్ఠఁ దులదూగుచున్న యెడల, సకామపూజయు సార్థకమగును.

ఇక్కాలమందు సకామపూజలు తఱుచుగా విఫలములై పోవుచుండుటకుఁ గారణము ఇపుడు చెప్పఁబడిన విశ్వాసమును, సంశయగ్రస్తతయే. తొలుత నెన్నో జాగ్రత్త ప్రయత్నములు చేసి భగవంతునిసాయమును గోరినపుడును, క్షుద్రబుద్ధిమనుజుఁడు "అన్నియుం జేసితిమి, ఇదియుం జూతము" అని పూర్ణవిశ్వాసరాహిత్యము, సంశయము ననెడు చిత్తదౌర్బల్యముతోనే యుపక్రమించును. అదే విఫలతకుఁ గారణము. కొన్నికొన్ని చోట్ల సకామపూజలందును సఫలత కానవచ్చుచున్నది. కాని యది బిచ్చగాని ముష్టిభిక్షాలాభమువలెనే అత్యల్పము, తుచ్ఛము నగుచున్నది. ఏదియెట్లున్నను నేఁటి మనుజసమాజము చేయు పూజానుష్ఠానములు సకామములు, ఆర్తికృతములు అనఁగా దుఃఖములు తొలఁగుటకో, కోర్కులు తీఱుటకో యగుచున్నవే.

యథార్థముగా నార్తులైనవారును, బరమేశ్వరుఁ డొక్కఁడే సర్వశక్తిమంతుఁడును, సర్వసంతాపహారకుఁడు, సర్వాభీష్ట ఫలప్రదానదక్షుఁడు, ఆర్తత్రాణపరాయణుఁడు నని నిఃసంశయముగా గుండెకు నాటించుకొన్నవారే యీ సకామ పూజకు యోగ్యాధికారులు. తగు నధికారము నొందియే పూజాదుల ననుష్ఠించునపుడు నిశ్చయముగాఁ దా నాశించిన ఫలము నిచ్చును. దర్శనశాస్త్రకారులుకూడ మూఁడువిధముల తాపముల నివృత్తికొఱకే పరమేశ్వరునకు శరణాపన్నులగుట నుపదేశించిరి. కార్యాంతమున "శాన్తిః శాన్తిః శాన్తిః" అనెడి త్రిరావృత్తి యభిప్రాయ మిదే.

ఇదియొక విధము. మఱియొక విధమున్నది. అదే మనుష్యప్రకృతికి విశేషోపయోగి. స్థిరఫలదాయకము. అపరిమితానందహేతువు. ఆ పూజయే కృతజ్ఞతాపూజ. మనుజునికిఁ గేవల స్వాభావికము. చూడు — మనుజుని హృదయమందుఁ గృతజ్ఞత యనెడి శ్రేష్ఠధర్మము పొడమునపుడు, అతఁడు ఈశ్వరపూజా నిరతుఁడు కాకుండఁజాలఁడు. ఒక మనుష్యమాత్రుఁడు మఱియొక మనుష్యమాత్రున కుపకారము చేసెనేని, వాని నాతఁడు బ్రతికియున్నంతకాలము మఱవక కృతజ్ఞుఁడై యుండుటే స్వాభావికధర్మమైనపుడు మన యీశ్వరుఁడై, మన సర్వస్వమునై మనము నిత్యముండుటకు దన యొడిని దావిచ్చిన స్నేహమయుని యెడఁ గృతజ్ఞులమై యుంట కేవల మస్వాభావికము కాదా? ఇచట — "రోగ శోక దారిద్ర్యాదులచే మిగులఁ బీడనొందువాఁడు, మనము సర్వదా భగవానుని స్నేహమయాంకమం దున్నామని యెట్లు తలంపఁగలఁడు? అంతేకాదు, నియతదుఃఖమైనవాఁడు భగ

వంతునెడ నెట్లు కృతజ్ఞుఁడు కాఁగలఁడు ?" అని మీరడుగ వచ్చును ? ఆ మాటకు బదులిది — ఈ లోకమందు మనుజుఁ డెంత దుఃఖియైనను, భగవంతుని సర్వశ్రేష్ఠ స్నేహదానము నందుకొనకుండ లేడు. ఆ దానమే ప్రాణము. ఏదియుండుటచే నీ వున్నావో — దుఃఖమందే కానీ, శోకమందే కానీ ఈ జగత్తు, ఈ సూర్యచంద్రులు, ఈ విచిత్ర సౌందర్యఖచిత విశ్వప్రకృతి యను నీ సర్వమును దేని ప్రసాదముచే భోగించుచున్నావో యది మఱేమియుంగాదు, ప్రాణమే. ఈ క్షణమందు నీప్రాణము నీ గుండెనుండి వెలువడిపోయెనేని, యిపుడే నిన్నెల్లరు మృత దేహమని విసిచివేయుదురు. ఏదియున్నదని నీ వున్నావో, ఏది లేకున్న నీ వుండవో యదే (ప్రాణమే) యతని దానము. అట్టి దానము చేసినవానియెడ నీవు కృతజ్ఞుఁడవు కాక యుండఁ గలవా ? మనుష్యుఁడవైనందులకుఁ గృతజ్ఞతను దెలిపుచ్చుటే నీ ధర్మము; నీ స్వభావము.

సరే, విచారించిచూడు; ఎవ్వనికేని ప్రాణదానము చేయువాఁడు వాని నెంతగాఁ బ్రేమించునో చెప్పుము. నీవు నీసంతానమునకు నెంతవఱకు ప్రాణదానముచేసితివి ? ఏమియు లేదన్నం దప్పేమియు లేదు. అతిసామాన్య ప్రాణాంశదానము చేసితివో లేదో, నీవు నీ సంతానమునకు ముగ్ధుడవై పోదువే; నీ సంతాన క్షేమమునకై నానావిధకష్టముల నశ్రమముగా నోర్చుకొందువే ఇపుడాలోచించుకో — నీకుఁ బూర్ణ ప్రాణ దానము చేసినవాఁడు, నీయెడనైన నియ్యమముతో నొరులు మఱచి నిన్నుఁ బ్రేమించునా, ప్రేమింపఁడా ? ఆ ప్రేమాను రాగములను గొలువఁగలవా ? సంతూచిక నేయఁగలవా ? దానికి సాటియున్నదా ? నీ వెంత దుఃఖమందున్నను, బరమ

ప్రేమమయుని యయాచితదానముచే నా పూర్ణత వంచింపఁ బడలేదు. (అయాచితముగాఁ గోఱలేక యిచ్చుచున్నాఁడు.)

ఏది యున్నదనుచు నీవున్నావో, సుఖమునో దుఃఖమునో సంసారమందలి మఱిదేనినో, దేని ప్రసాదముచే నీవు భోగించుచున్నావో, ఏది లేకున్న "నీవు, నీది" యనున దేదియు నుండదో, యట్టి యమూల్యవస్తువును స్నేహమును దానము గొన్నావు. భగవంతుని యీ స్నేహదానమునకు నీవు కృతజ్ఞుఁడ వగుట చాల దూరపుమాట. ఈ సాటిలేని దానమును ఏ యనాదికాలమునుండి పొందితివో, పొందుచున్నావో నిష్కపట ప్రాణముతో యోజించి, యంగీకరింపఁగల్గితివా ? మనుష్యుఁడు యోగ్యాధికారి కానంతదాఁక, అనఁగా మనుజుని హృదయమందుఁ గృతజ్ఞతను వెల్లడించుట యనెడి యపూర్వ ధర్మము చక్కఁగా వెలయనంతదాఁక, మనుష్యత్వ మనెడి హిరణ్మయమందిరద్వారము బిగిసియేయుండును. బహుదుఃఖముతోఁ గడు నొచ్చుకొని కోపించి భగవంతుఁడును నొకనాఁ డర్జునునితో "అవజానంతి మాం మూఢా మానుషీం తనుమాశ్రితమ్" మనుష్య శరీరము నాశ్రయించిన (జీవాత్మ చైతన్యరూపముతో) మనుజునియందున్న నన్ను మూఢులు కడు నవమానించుచున్నారు. దేవతలు సర్వదా భగవత్సత్తా జ్ఞానము గలవారు. కాన, దేవక్షేత్రమం దీ యవజ్ఞ లేనే లేదు. పశువులయందు జ్ఞానవికాసము లేదు; అవి నిర్దోషులు. ఇదిగో ఈమనుష్యక్షేత్రమందు మాత్రమే యీయవజ్ఞ. భగవత్సత్తయందు సమ్మానము లేకుంటయు విశేషించి కానవచ్చుచున్నది. కనుకనే మనుష్యునకును మనుష్యత్వ లాభము

గల్గుటకు ముందుగా గృతజ్ఞుఁడు కావలయును. ఈనికృష్టమైన స్వామిద్రోహబుద్ధిని విడువవలయును.

కృతజ్ఞతను దెలుపవలయు ననెడి యపూర్వప్రవృత్తి హృదయమందు వికసించినవాఁడు ఏదోయొక విధముగఁ బరమేశ్వరునిఁ బూజింపకుండ లేఁడు. పూజయే లోపలి కృతజ్ఞతకు వెలిగుఱుతు. ఇట్టి పూజయే నిష్కామపూజ; పరాపూజ యనఁబడినది. మును జెప్పిన సకామపూజ చేయఁగాఁ జేయఁగాఁ మనుష్యుఁడు నిష్కామ పరా పూజాధికారి యగును.

ఇచ్చట — "అనంత బ్రహ్మాండాధీశ్వరుఁ . సంపూర్ణుఁడు, ఎన్నడును మాఱుమేలు ప్రతిదానము కోరని ప్రభువు, ఎల్లప్పుడు జీవసంతానము లేములు నగచాట్లును దెలియుటయే తొలఁగించు దయాళుఁడునైన యాతనియెడ క్షుద్రకీటకమువును బోలిన మనుజుఁడు ఏవిధముననైనఁ గృతజ్ఞతను జూపఁ బ్రయత్నించుట యవమానమును, ధృష్టతయు దెలుపదా?" యని యొకశంక పొడమవచ్చును. మఱొకమాట — కృతజ్ఞతను వెల్లడించుట యేవిధముగాను సంభవింపదు. ఇట్టి చోట నీవిధముగ జ్ఞానహీన శిశువువలెఁ గృతజ్ఞతను దెలుపు ప్రయత్నము వెక్కిరింత గాదా? అనియు ననవచ్చును. సమాధానమిది —

"కాదెన్నఁడునుగాదు. పరమేశ్వరుని యెడఁ గృతజ్ఞతను వెల్లడించుట యేనాఁడును నేవిధముగాను సఫలమగుట సంభవింపదు" అనుదానిని బాగుగా తెలియగల్గునప్పుడే మనుష్యుఁడు, మనుష్యత్వ లాభమున కధికారియగును.

కృతజ్ఞతను దెలుపుటకైన తన ప్రయత్నమందు మాటి మాటికి విఫలతయు నసంపూర్ణతయుఁ గానవచ్చుటచేతనే జీవుని మిథ్యాభిమాన మనెడి అహం జ్ఞానము తొలఁగదు. అహంకారము తొలఁగినంతనే — అదిగో, యథార్థమైన 'అహమ్' యొక్క — ఆ పరమేశ్వరుని యొక్క స్వరూప ముద్భాసించును. (బుద్ధికి గోచరించు చుండును.) అప్పుడే మనుష్యుఁ డాత్మజ్ఞాన లాభముతోఁ గృతార్థుఁడగును.

కృతజ్ఞతను వెల్లడించుటవలని చరమఫలము తెలినది. ఇఁక సకలప్రాణముతోఁ గృతజ్ఞతను వెల్లడింప నుద్దేశించి భగవంతునిఁ బూజింపఁ గడఁగువారి చిత్తము నంటిన మాలిన్యములు నానాటికి వడివడిగాఁ దొలఁగుటారంభమగును. ఒక స్వర్గీయశాన్తి, అపూర్వానందము వారి చిత్తమందు మెల్ల మెల్లఁగా నిండును. ఇది ఎంతవరకు సత్యమనునది వ్యావహారిక జగత్తునందుఁ గృతజ్ఞులై మెలఁగువారియెడఁ జూపు సారించినచో సులభముగానే తెలియును. ఒక యుపకారక వ్యక్తికి, ఏయించుకంత యుపకారము చేయుభాగ్యమబ్బినను, అతఁడెంతయూనందించునో, దానిని బట్టిచూడఁ గృతజ్ఞవ్యక్తి యొక్క హృదయము వేయిరెట్లానందిత మగును. వ్యావహారిక జగత్తునందే యిట్లుండఁ, బూర్ణజ్ఞానమునకు, నపారానందము నకు నెలవైన వానియెడఁ గృతజ్ఞతను జూపు వానికెట్టి లాభ మగునో యది నోటిమాటలతో వెల్లడించుటెట్లు? ఎల్లరును దీని సఫలతను దమలోఁదాము పరీక్షించుకొనవలసినదే.

మనము విచారించుచుఁ గూర్చుండఁ దగదు. తుచ్ఛమైన లేములు గ్రమ్మిన ట్లుండఁగూడదు. మనచేత నేమి

పట్టుకొని ఆయనంత బ్రహ్మాండాధీశ్వరుని యెటులికిఁ బూజింపఁబోవుట ? యనుకొని హతాశులమై విషణ్ణులు కాఁబనిలేదు. భగవంతుని యీవాక్యములు జూడుఁడు. ఏమన్నాఁడు ?

"పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి
తదహం భక్త్యుపహృత మశ్నామి ప్రయతాత్మనః.

విశేషించి నన్నుఁ బూజింప శక్తిలేనపుడు ఆకో, పూవో, పండో, యింత నీరో నాకర్పింపుము. నిష్కపట చిత్తముతో భక్తితో నర్పింపుము. భక్తితో నీవిచ్చు వస్తువు ఎంతతుచ్ఛమైనను నేను దాని నాదరముతో నందుకొందును. అనుభవింతును. ఉపవసించిన వ్యక్తి యాహారవస్తువుల నాదరముతో నందుకొనునటులే, నేనును భక్తితో నీవిచ్చు పూజాద్రవ్యముల నంత యాదరముతో నందుకొందును. మఱేమి యిచ్చుటకును నోపనివాఁడు నాసత్తయందు (అస్తిత్వమందు) దృఢవిశ్వాసముంచి కృతజ్ఞహృదయముతో, నిష్కపటప్రాణముతో నొక్కసారి ప్రణామము చేయనీ చాలు. ఇటులు ప్రణమిల్లఁ గల్గినపుడే ననుఁ బూజించుట యగును. నేను బూజింపఁబడునపుడే నీవు నాస్వరూపము నెఱుంగఁగలవు. నేను సచ్చిదానందస్వరూపుఁడనని, నే ననంత బ్రహ్మాండాధిపతినని, నేనే నీ కేవల ప్రియతమాత్మనని తెలిసికొనగల్గుదువేని, నీవు నాలోఁ జేరిపోవుదువు. మనుష్యత్వముయొక్క చరమలక్ష్యమునందు నిల్చి నీ జీవనము ధన్యమగును.

ఏమయినను నింత యాలోచనము సల్పిన పిమ్మట తేలినది—పూజ రెండు విధములని; ఒకటి సకామపూజ. అదే

యార్తపూజ. రెండవది నిష్కామమైన ప్రేమపూజ. భగవత్పూజాధికారులు రెండు తెగలు. ఒకఁ డార్తుఁడు; ఒకఁడు కృతజ్ఞుఁడు. ఇటుల పూజలు చేయుచున్నను మనుజుఁడు తాను సాధకశ్రేణిలోఁ జేరితి ననుకొనలేఁడు. అపుడే యతఁడు సత్యమునందును బ్రాణమునందును బ్రతిష్ఠితుఁ డగును. అతఁడుచ్చరించు మంత్రము చైతన్యమయ మగును. మంత్రోచ్చారణముతోనె బుద్ధియందుఁ బరివర్తనము (మార్పు) ఆరంభమగును. అపుడే పరమేశ్వర పూజాఫలమును యథార్థమగు నాత్మతృప్తి రూపముగా నొంది కృతార్థుఁ డగును. ఇమ్మాటలింకను స్పష్టముగాఁ దెలుపఁబడును.

## పూ జా స్వ రూ ప ము.

"గౌరవిత ప్రీతి హేతుక్రియా పూజా" గౌరవింపఁబడు వారికిఁ బ్రీతిగల్గించుటకై చేయఁబడు సర్వకర్మములకును సాధారణ నామము 'పూజ'. ఇట్టి పూజాక్రియ సర్వదేశము లందును, సర్వసంప్రదాయము లందును నేదోయొక విధముగా సాగుచునే యున్నది. మన భారతదేశమందు నడుచుచున్న పూజావిషయమే యిప్పుడు మనమాలోచింపఁదగినది.

ఏదేనొక విషయమందు శ్రేష్ఠత నొందిన వారే గౌరవితులు. వారి ప్రీతికై చేయఁబడు పనియే పూజాశబ్ద వాచ్యము. ఏవిధముగాఁ జూచినను భగవంతుఁడే గౌరవిత వస్తువు. ఆతని ప్రీతికై చేయఁబడు సర్వకర్మములు మన దేశమందు 'పూజ' యను పేరఁ బరఁగును. ఇది ప్రథమాధి కారి మాట. మనము — పరమేశ్వరుని నిత్యప్రీతుని గాను, నిత్యతృప్తునిగాను, నిరపేక్షునిగాను, అహైతుక కరుణా

సముద్రునిగాను గనుచున్నాము. అతనికి మనకువలె ప్రీతి, అప్రీతి యనునవి గాన్పించు పనిలేదు. కనుక మనము 'గౌరవిత ప్రీతిహేతుక్రియా పూజా' అను దానియర్థమును నిట్లొక విధముగా నూహింతము. 'గౌరవితప్రీతి' శబ్దమును షష్ఠీ సమాసమునకు బదులుగా సప్తమీ తత్పురుషముగాఁ జెప్పికొన్నచో మనము కోరిన యర్థము వచ్చును. అప్పుడు గౌరవితునియందుఁ బ్రీతి యను నర్థమగును. అనఁగా, ఏ కార్యము లాచరించినచో గౌరవితునెడ మనకుఁ బ్రీతి (ఆసక్తి నిష్కపట ప్రేమ) గల్గునో, యట్టి కార్యములు చేయుటే యథార్థపూజాపద వాచ్యము. (యథార్థపూజ యనఁదగును.) ఇమ్మాట లింకను బాగుగాఁ దెలియఁ జూడుము — విష్ణుప్రీతికామనతో నీవేదేనొకటి పూజాదికము చేయుచున్నావనుకో, దానియందు నీకార్యఫలముగా విష్ణువు యొక్క ప్రీతి (సంతుష్టి) సాధితమగునని తలఁపరాదు. విష్ణువునందు నీకుఁ బ్రీతికలుగవలయుననెడి కోరికతో నీవు పూజింపుచుండుము. అనఁగా, నీస్వాభావిక విషయప్రీతి (విషయాసక్తి) నశ్వరమైన విషయములనుండి లాగికొని వచ్చి, (తెచ్చి) శ్రీవిష్ణునం దర్పితము కావలయుననెడి యుద్దేశ్యముతో నీవు పూజచేయుచుండుము. అనురాగమనెడి పేరఁ బరఁగునదేదో యది, జాగతికమైన యనిత్యవస్తువుల నుండి మెల్లమెల్లఁగా మఱల్పఁబడి, కేవల నిత్యగౌరవిత వస్తువైన పరమేశ్వరునకు దర్పింపుము. అందులకే సర్వవిధ కర్మానుష్ఠానము.

గౌరవిత వ్యక్తి యెవరు? ఆత్మ యొక్కటే యథార్థ గౌరవితము. ఆత్మగౌరవము నెఱుంగుటకే వ్యావహారిక జగత్తునందు గౌరవితులైనవారియెడ శ్రద్ధాభక్తుల నెఱపు

చున్నాము. ఆత్మసంధానము దొరకనంత కాలము దాని గౌరవ మెంత గొప్పదైనను, గౌరవ మాత్మదే యైనను అది యెట్లునుం దలకెక్కదు; ఆత్మ మనకుఁ బట్టువడదు; తెలియఁబడదు. దాని మహిమము, ఆనందమయత్వము, ప్రేమమయత్వము మన మనుభవింపఁజాలము. ఇందు చేతనే ఆత్మప్రతీకములైన వ్యావహారిక గురుజనములను, భిన్నభిన్న దేవ దేవీమూర్తులను నవలంబించి పూజాదులు చేయు చున్నాము. ఇతరులను గౌరవించుటచేఁ గ్రమముగా ఆత్మను గౌరవింపఁగల సామర్థ్యము గలుగును. గీతలలో భగవంతుఁడు, "అన్య దేవతలను బూజించువారు సైతము, అవిధిపూర్వకముగా ఆత్మనైన నన్నే పూజించుచున్నారు" అనెను. ఆత్మయొక్కటే సర్వరూపములతో విశ్వరూపముతో వెలయు చున్నదని వారెఱుఁగరు. మనము తెలిసియో, తెలియకో యాత్మనే పూజించుచున్నాము. జ్ఞానము వికసింపనన్నాళ్ళు మనమేదో యితరమైన గౌరవితవస్తువునో, వ్యక్తినో పూజించు చున్నా మని యే తలంతుము. ఇతరుల గౌరవమునే వృద్ధిచేయుచున్నా మనుకొందుము. కాని, తెలివికన్ను విడినంతనే "నేను, తలిదండ్రులు, గురుజనులు, శివుఁడు, విష్ణుఁడు, కాలీ, దుర్గా మున్నగు వారిని బూజించి సర్వదా సర్వత్ర గౌరవితులైన వారి గౌరవమును వృద్ధిచేయలేదు. నేను మఱే యితరుల పూజ చేయలేదు. నాకు నిత్యసన్నిహితము, ఏకాంత గౌర వితము నైన దాని గౌరవమునే యనుభవించుచున్నాను" అని కనుగొనును. "ఆత్మకంటెను వ్యతిరిక్త వస్తువేదియును నెక్కడను లేదు" అనెడి తత్త్వము నెఱుంగఁగల్గినవాఁడు, సర్వరూపములతో నాత్మ యొక్కటే విరాజిల్లుచున్నదని

తెలిసికొని యనుభవించి, యథార్థ గౌరవితవస్తు సంధానము నొందఁగలఁడు. అతఁడుచేయు పూజ సార్థకము, పరమానంద దాయకము నగును.

ఇపుడు మనము ప్రీతి విషయము నాలోచింతము. ఆత్మప్రీతి లాభమును గలిగించునట్టియు, పరమ పురుషుని పరమప్రీతితోఁ గడుపు నిండించునట్టియు, కార్యముల ననుష్ఠించుటే 'గౌరవిత ప్రీతిహేతు క్రియ' యనఁబడును. ఆత్మ నిత్యప్రీతి మయము. పరమానందమయము. దాని యందుఁ బ్రీతి వెల్తి యేనాఁడు నుండదు. కేవలము మన యజ్ఞానముచేతనే దానియందుఁ బ్రీతి వెల్తిని గల్పించు చున్నాము. మనము కేవల జాగతిక వస్తుప్రీతి రోగగ్రస్తులము; కామ కాంచనాదులయందే ముగ్ధులము. మన యీ విషయప్రీతి ఆత్మప్రీతియొక్క బాహ్యవిలాసమే యని మనంత మనము తెలిసికొనఁజాలము. ఒకరు చెప్పినను దెలియ నొల్లము. అయినను బూజాదికములను జేసి విలుప్తప్రాయమైన యాత్మప్రీతిని బునరుద్ధరింపఁ బ్రయాస పడుచుందుము. మనము ఆలుబిడ్డలను బ్రేమించుచున్నాము. యశస్సును ధనమును బ్రేమించుచున్నాము. అది యాత్మప్రీతియొక్క బాహ్యలక్షణమే. ఒక్క యాత్మప్రీతి సంపాదనము కొఱకే మన మనాదికాలము నుండియు నీ సంసార చక్రమునందుఁ బరిభ్రమించుచున్నాము. ఇది యేవిధముగాను దెలియ లేకున్నాము. మనము తక్క నన్నింటినిబట్టి చూడఁగా, ఆత్మనే యధికముగాఁ బ్రేమించుచున్నాము. ఆత్మయే మనకుఁ బరమప్రియతమ వస్తువు. పరమ ప్రేమాస్పదము. అదియే మన యనంత జనన మరణములను నడుపుచున్న

సారథి. అదియే మన సర్వానురాగముల యద్వితీయ కేంద్రము అను నిమ్మాట నెట్లో యెఱుంగఁజాలక, యెఱుఁగఁ గోరక పోయినప్పుడే మన పూజలు గౌరవిత వస్తువునెడఁ బ్రీతి కామనతోఁ, బత్రపుష్పాదు లర్పించుటతో ముగిసి పోవును.

ఇదిగో, యీ యంతర్నిహితమైన యాత్మప్రీతి నుద్ధరించుట కొఱకే సత్యదర్శులైన ప్రాచీనమహర్షులు, ప్రాచీనాచార్యులుగూడ మన దేశమందుఁ బలువిధములైన పూజార్చనముల విధానములను జేసిరి. కావుననే సంకల్పవాక్యములందు "పరమేశ్వర ప్రీత్యర్థం" "శ్రీవిష్ణుప్రీతికామః" "శివప్రీతి కామః" "దుర్గాప్రీతికామః" పూజయేత్ అనెడి విధానము కానవచ్చుచున్నది. ఈ శివవిష్ణుదుర్గాదులు ఆత్మప్రతీకములుగానే వెలయుచున్నవి. కావున నేకాన్త గౌరవితవస్తువు నెడ మనకుఁ బ్రీతిగల్గుటకుఁ జేయునదియేపూజ

ఇచ్చట నొక శంక కలుగవచ్చును—మును నిర్దేశింపఁ బడిన పూజాలక్షణమును బట్టి సకామపూజ - పూజాలక్షణములలో నిమిడిపోయినది కాదు. ఏమన - సకామపూజాలక్షణము గౌరవిత ప్రీతి కాదు. పుత్త్రవిత్తాదికమో, స్వర్గాదికమో యందువేని, శంకకు సమాధాన మిది — సకామ పూజయు పరంపరా సంబంధమందు గౌరవిత (ఆత్మ) ప్రీతిని లక్షించియే చేయఁబడుచున్నది. పలుసారులు కామనాపూర్తి యగుచుండుటచే, ఆ కామనాపూర్తి చేయుచున్న దానిపైనే మనుష్యుని లక్ష్యము తప్పక పడును. తాను గానరాకయే మన సర్వాశలను బూరించుచు, మన లేములను అగచాట్లను దొలఁగించుచున్నవాని, నొక్కసారి చూచుకోరిక మనుజు

నకుఁ గల్గుట స్వాభావికము. ఒక్కసారి చూచుటచే వాని యందుఁ బ్రీతిపుట్టును. మనుజుఁడు మఱి యాతనిఁ బ్రేమింప కుండలేఁడు. ఏలన - ప్రీతి యనఁగా, అనురాగము. అనురాగమే యతని స్వరూపము. అదె మన యాత్మ. అదె మన సర్వస్వము అను నిట్టిభావముతోనే సకామపూజయొక్క శేషము ఆత్మప్రీతిగానే పరిణమించును గనుక సకామ పూజయును గౌరవిత ప్రీతిహేతుక్రియ యనెడి పూజయొక్క లక్షణమునం దిమిడిపోయినదే.

గౌరవితప్రీతిహేతువు ఒక క్రియయో, ఒక యనుష్ఠానమో యనఁబడినను, దీని విషయమున మనదేశమందు గీతోక్తమైన ద్రవ్యయజ్ఞమునే అనఁగాఁ బత్రపుష్పాద్యర్పణమునే పూజగా గ్రహించుచున్నారు. ఈభారతదేశమందు జరుగు పూజ, అనఁగా శాస్త్రవిహితకర్మకాండము నాలుగు విభాగములుగా సాగుచున్నది. 1. నిత్యము 2. కామ్యము 3. నైమిత్తికము 4. నిత్యకామ్యము. ఏ వైధకర్మములు జరుపకున్నఁ బ్రత్యవాయమగునో యవి నిత్యకర్మములందలివి. విశేషఫల లాభమందలి యాశతోఁ జేయఁబడునవి కామ్యములు. ఆగంతుక కారణవశమునఁ జేయఁబడు కర్మములు నైమిత్తికములు. ఏపూజాదికానుష్ఠానములను జేయకున్నఁ బ్రత్యవాయమగునో, వాని ననుష్ఠించుటచే విశేషఫలలాభమును నగునో యవి నిత్యకామ్యములు.

మనుజుఁడు యథార్థమనుష్యత్వమునొందఁ బ్రయాసపడునపుడు, అవి దేశకాల పాత్రానుసారముగా, యథాసంభవముగా, యథా యోగ్యముగా నీచతుర్విధ వైధకర్మములందే యుండి, నియమిత భావముతో జరుగుచునేయున్నవి. ఇక్కా

లపు శిక్షాప్రణాళి దీనికి విపరీతముగానే నడుచుచున్నది. దాని ఫలముగానే మనుజుఁడు నానాఁటికి, నానావిధములైన యుపద్రవములను అత్యాచారములను సైఁపవలసి వచ్చుచున్నది. దేశమున వ్యాపించు రోగములు, దుఃఖములు, లేములు, అకాలమృత్యువులు మున్నగువాని కారణమును నిర్ణయింపఁ బోవునపుడు, మఱేదోయొక యితరమైన సర్వప్రధానకారణముఁ జూపి నిర్దేశింపఁ గల్గుచున్నారు.

అతిప్రాచీనకాలమునుండియు మన దేశమునందు ధర్మ, అర్థ, కామ, మోక్షముల నెడి చతుర్వర్గమే పురుషార్థముగా నెన్నఁబడుచున్నది. ఇక్కాలమున దనేకులు అర్థకామములకైన సేవయందే నిత్యనిరతులై యున్న ఫలముగానే, మనుష్యత్వము నొందు శ్రేష్ఠమార్గమునుండి జాఱిపోవుచున్నారు. అన్నిటికంటెఁ దొల్త మనుష్యునకేకాంత వాంఛనీయము ధర్మము. మనుష్యుఁడే సుఖమును వెదకికొనువాఁడు. తెలిసియో తెలియకో యెల్లరును సుఖమును గోరువారే. ఈసుఖము ధర్మముపైనే యాధారపడి యున్నది. అధార్మికవ్యక్తి యేవాఁడు నేనాఁడును సుఖి కాలేఁడు; కాఁడు. అంతేకాదు, ధర్మమే మనుష్యునకును బశువునకును గల భేదమును దెలుపుచుండును. ఆహార నిద్రా భయ మైథునములు మనుజులందును బశువులందును సమానములే. కాని, ధర్మమొక్కటే మనుజుఁడు పొందఁదగిన వస్తువు. కనుకనే శాస్త్రకారులు "ధర్మేణ హీనాః పశుభిస్సమానాః" అనిరి. అధార్మికవ్యక్తి కేవల పశుతుల్యుఁడని యర్థము. అదికాదు; దాని యభిప్రాయ మేమనఁగా — అధార్మిక జీవనము కేవల దుఃఖమయము, నశాంతిమయమునని భావము. లాభమార్గ మాతని

యెడ నరికట్టఁబడి యుండును. కనుక నే మన దేశపు ఋషి జనులు మనుష్యలాభమున కొక్క-ధర్మమునే మొదటిమెట్టుగా నిర్ధారించిరి.

ప్రసంగవశమున మనమిపుడు ధర్మస్వరూపము నాలోచింతము. అనేకులు సంధ్యాహ్నికములు. జపము, పూజ, హోమము, వ్రతము. దానము మున్నగువానినే ధర్మమను కొందరు. వాస్తవముగాఁగాదు. ఇవన్నియు ధర్మమునొందుట కగు నుపాయమాత్రములే. వీని నన్నిఁటి నవలంబించియే మనుష్యుఁడు ధర్మలాభమును బొందును. ధర్మము సర్వదేశములందును సర్వకాలములందును నభిన్నమే. భగవంతుఁడు మనువు — ధృతి, క్షమ, దమము, అస్తేయము, శౌచము, ఇంద్రియ నిగ్రహము, ధీ, విద్య, సత్యము, అక్రోధము అను నీ పదియే ధర్మలక్షణములనెను సంగ్రహముగాఁ జెప్పుచో, దేనివలన నభ్యుదయము, నిఃశ్రేయసము, (మోక్షము) లభించునో యదే ధర్మము. పైని జెప్పిన పదింటిని వివరించినచో, నభ్యుదయ నిఃశ్రేయసలాభము చక్కఁగా బోధపడును.

(1) ధృతి— సర్వకాల సర్వావస్థలందును జిత్తము యొక్క సంతోషభావమే ధృతి శబ్దార్థము.

(2) క్షమ— బదులుసేతకు సామర్థ్యమున్నను, దన కితరులు చేయు నపరాధము నోర్చుకొను శక్తియే క్షమ.

(3) దమము— బహిరింద్రియ నిగ్రహము. అనఁగాఁ జక్షుః కరపాదాది బాహ్యేంద్రియములు కట్టుబాటు లేక విషయగ్రహణమునే చేయు చాంచల్యము నడ్డగించుటే దమము.

(4) అస్తేయము— ఇతరుల ద్రవ్యమును లాగికొను నభిలాషము లేకుండుటయే అస్తేయము.

(5) శౌచము— దేహము, వస్త్రములు, ఆహారము మున్నగు బాహ్యముల పవిత్రతయే శౌచము.

(6) ఇంద్రియనిగ్రహము— మనోబుద్ధి చిత్తాహంకారములనే యంతఃకరణములందురు. వానినిర్మలతయే యింద్రియ నిగ్రహము. రజస్తమోగుణములను ద్రొక్కి పెట్టుటచే సత్త్వము ప్రకాశించును. సత్త్వగుణోత్కర్షముచేఁ జిత్తశుద్ధి—అనఁగా, అంతఃకరణ నిర్మలత కలుగును. నిర్మలచిత్తమే యాత్మస్వరూపము నవధరింప సమర్థమగును. ఆత్మస్వరూపవిషయకమైన జ్ఞానము నొందుటకుఁ జిత్తశుద్ధియే ముఖ్యావశ్యకము. విషయ కలుషితమై యవిశుద్ధమైన యంతఃకరణ మెన్నడును నాత్మ స్వరూప జ్ఞానము నొందుట యసంభవము. కావున నింద్రియ నిగ్రహ శబ్దార్థము చిత్తశుద్ధి.

(7) ధీ— ఆత్మవిషయిణీ ప్రజ్ఞ. అనఁగా నిత్యానిత్య వస్తువివేకము.

(8) విద్య— దేని ప్రభావముచే బ్రహ్మము ఆత్మ యొక్కటే యను నెడి విజ్ఞానము లభించునో, అజ్ఞానాంధకారము పూర్తిగాఁ దొలఁగిపోవునో యది విద్య.

(9) సత్యము— కాలత్రయమందును నాశనము లేని—అవినశ్వర పరమాత్మ స్వరూపమందే యెల్లప్పుడు నిల్వఁగల్గు సామర్థ్యమే సత్యశబ్దార్థము.

(10) అక్రోధము— క్రోధము లేకుండుట. పైనిజెప్పిన తొమ్మిది గుణముల నార్జించినపైని సర్వభూతములందు సమ

దృష్టి (ఆత్మదృష్టి) గలుగును. భేదజ్ఞానము నశించును. ఆ స్థితియే యక్రోధము.

ఈ పది ధర్మలక్షణములందు విశేషత్వ మేమనఁగా— వీనిలో మొదటిది యెంత పరిమాణముతో నారంభమగునో, దాని తరువాతిదియు నంత పరిమాణముతోనే వెలయుచుండును. ఇన్ని లక్షణములకై వేర్వేఱుగాఁ బ్రయాస మక్కఱ లేదు.

ఇపుడు పాఠకులకు ధర్మలాభమగుటచే, అనఁగా నీ చెప్పిన ధృతి క్షమాదిగుణము లబ్బుటచే మనుష్యుఁడు నిశ్చయముగా సుఖశాంతులతో నుండఁగలఁడనుట యెవ్వరుం గాదనలేరని చక్కఁగా సులభముగాఁ దెలియఁగలదు. ఇక్కాలమున ధర్మహీనములైన యర్థకామములను సేవించుటచేతనే మానవగణము అల్పాయుష్కమై నిత్యము క్రొత్తక్రొత్త పలువిధములైన యసుఖమును నశాంతినే యనుభవించుచున్నది. సుఖమెచ్చటనున్నదో యెఱుంగక, కేవల బాహ్య వస్తువులందే సుఖమును వెదకికొనుచుఁ బోవుటచేతనే యధికాంశ జనగణము బ్రతికి యున్నంతకాలమును దుఃఖాశాన్తి దుర్దశలనే భోగించుచున్నది. యథార్థసుఖమును గోరువాఁడు ధర్మార్జనమునే చేయవలయును. ధర్మార్జనరతుఁ డయినచో, మును జెప్పిన నిత్యకామ్యాదులైన చతుర్విధ వైధకర్మములతోనే తన జీవనమును గడుపుచుండును. కోరినంతమాత్రమున ధృతి క్షమాది గుణములు రావు. ధర్మలాభముకాదు. సర్వవిధ సిద్ధులును సాధనసాపేక్షములే. సాధనచేయక యీ జాగతిక ధన విత్తాదులే లభింపవుగదా; అలౌకిక గుణము లబ్బుటకు సాధన విధిగాఁ జేయవలయునని వేఱే చెప్పనేల?

హైందవ శాస్త్రములను మన్నింపనివాఁడు ధర్మలాభమును మనుష్యత్వలాభమును నెన్నఁడును బొందజాఁడా? యనఁగలవు. సమాధానము విను — సర్వదేశముల ధర్మశాస్త్రములును ప్రాయికముగా నొక్కమాటనే చెప్పినవి. వేర్వేఱు దేశములందలి వేర్వేఱు సంప్రదాయములవలన నంగీకరింపఁబడిన ధర్మశాస్త్రముల ననుసరించియే యా యా దేశములవారు జీవనములను గడుపుకొనుచున్నారు. వానిని బరిశీలించినచో నవి యన్నియు మును జెప్పిన కామాద్యాది చతుర్విధములంటే చేరిపోవును. దీనికి ముందు చెప్పిన ధృతి క్షమాది ధర్మలక్షణము లెట్టి సంప్రదాయము నేని బాధించునవి కావు. ఏలన సర్వదేశముల శాస్త్రములును వానిని ధర్మములుగా నంగీకరించినవియే. ఏ ధర్మశాస్త్రమేని, ధృతిక్షమాదులకు విరుద్ధములైన యసంతుష్టి ప్రతిహింసా నిర్దయతా మిథ్యాభాషణాదులను ధర్మములుగా నిర్దేశింపలేదు. కొందఱు విభిన్న దేశముల ధర్మశాస్త్రములు విభిన్నములనియు, అవి ధర్మము యొక్క బాహ్యావరణమును మాత్రమే చూచి భేదబుద్ధి కల్పనము చేయుచున్న వనియు నందురు. అది భ్రాంతిజాల బద్ధుల మాట. వేదము, ఖురాన్, బైబిల్ మున్నగు ధర్మశాస్త్రములెల్ల నొక్క పరమాత్మ వస్తువునే ధృతిక్షమాది ధర్మలక్షణములనే వెల్లడించినవి. అప్పుడును నవి యేకేశ్వరవాదమునే చేసినవి. తత్త్వదృష్టితోఁ జూచినచో నొక శాస్త్రముతో నొకదానికి రవ్వంతయు విరోధము లేదు.

చెప్పెడి దేమనఁగా — పైని జెప్పిన గడించుకొను వాసన పలుపురకుంటుట నిజమే కాని, సమయము సుయోగము కాకయో, తాత్కాలిక ప్రతికూలావస్థలను బట్టియో,

చిత్తదౌర్బల్యవశముననో జను లీ గుణములను గడింపఁ జాల కున్నారు. ధర్మ మార్జింపవలయును, సుఖమనుభవింపవలయు ననెడి కోరిక లేనివాఁడెవఁడు? అందఱికిని గలదు గాని, ధర్మ సుఖ లాభములకైన యుపాయములను మాత్ర మవహేళనము చేయుదురు. వానిని దప్పక పొందవలయునని యేదేనొక యుపాయము నవలంబించినచో, నది తప్పక యీ శాస్త్రీయ విధినిషేధములందే వచ్చిపడును. ఏమన నీ విధినిషేధ ప్రతి పాలనమే ధర్మసుఖప్రాప్తి హేతువు.

అనేకులు, విధినిషేధప్రతిపాలనము చేయఁగల్గునపుడే ధర్మలాభ మగునందురు. ప్రతిదిన సంధ్యావందనాది క్రియాను ష్ఠానమే ధర్మమనియు, ఏకాదశినాఁ డన్నము తినకుండుటే ధర్మమనియు నిటులందురు. వాస్తవముగా నదిగాదు. విధి నిషేధ పాలనము ధర్మలాభమునకుఁ బ్రధానోపాయము. అనఁగా విహితకర్మములను జేయుట, నిందితకర్మములను ఫలముగా మనుష్యుని హృదయమందు ధృతిక్షమాది ధర్మ లక్షణములు తమంతనే పొడమును. ఎవ్వఁడేని — "నేను నాజీవితకాలములో నెప్పుడును విధినిషేధములను బాలించుచునే వచ్చుచున్నాను, గాని యీ చెప్పిన ధర్మలక్షణములు వికసింపనేలేదు." అనినయెడల, యథావిధిగా శాస్త్రీయవిధినిషేధ ములు పాలింపఁబడలేదనియు, నేవో ప్రాణహీనకర్మములను మాత్రమాతఁడు చేసెననియు ననవలసినదే. మృతకర్మాను ష్ఠానము బ్రతికి యున్నంతకాలము చేసినను, ఆశానురూప ఫలము గలుగదు. కర్మియుఁగాఁడు, సుఖియుంగాఁడు.

ఈ ప్రసంగమున మఱొక్క మాట— ధర్మ మేనాఁడును విభిన్నముకాదు; ధర్మము భేదకవిశేషణములు లేని యొక

వస్తువు. సాధారణముగా మనము హిందుధర్మము, బౌద్ధ ధర్మము, ముసల్మాన్ ధర్మము, క్రైస్తవధర్మము మున్నగు మాటలు ప్రయోగించుచు, ధర్మములలోఁ జాల విభిన్నత యున్నదనుచుఁ గూడ చెందుదుము. నిజముగా లేదు. ఈ విష యమున ధర్మ శబ్దార్థము సంప్రదాయమనియే తలంచు చున్నారు. బాహ్యాచార వ్యవహారరూపమైన ధర్మ లాభో పాయముల యందలి విభిన్నతనే చూపుదురు. దీనివలన యథార్థమైన ధర్మమందు విభిన్నత యేనాఁడును గాఁజాలదు. వారు ధర్మభేదము లనునవి. యథార్థ ధర్మముయొక్క బాహ్యావరణములు. ఈ యావరణములందు భేదముఁ (క్రమో చ్ఛక్రమ నీ చస్తరములు) ఉండక తప్పదు. మును జెప్పిన ధృతిక్షమాదమాస్తేయాది గుణములు ఎన్నఁడును మార్పు లేనివే. సర్వసంప్రదాయములందును ధర్మము - అవిసంవాది.

## పూజా సంకల్పము - కాలము.

పూజాది విధ్యుక్త కార్యము లారంభింపఁబడునపుడు సంకల్ప వాక్యములు చెప్పఁబడును. "సంకల్పః కర్మ మాన సమ్" మానసికకర్మము పేరే సంకల్పము. ఈ కర్మమువలన నీయిష్టఫలము గలుగును, గనుక నీ కర్మము చేయవలయును అనుచుఁ గర్మ విషయమున నిష్టసాధనత్వజ్ఞానము (ఇక్కర్మము నా యభీష్టమును సాధించున నెడి జ్ఞానమే) సంకల్ప వాక్యము యొక్క పూర్వరూపము శాస్త్రమందు "మనసా సంకల్ప యతి, వాచా అభిలషతి, కర్మణాచోత్పాదయతి" మనసుతోఁ దలంచుకొనుట, వాక్కుతో ననుట, కర్మానుష్ఠానము చేత సంకల్పసిద్ధి; యిది క్రమము. సంకల్పము విశుద్ధముగా నుంచు

టకే (చేయుటకే) వైఖరీ వాగ్రూపముగా దానినుచ్చరించు విధానము. ఈ సంకల్పవాక్యము నుచ్చరించునపుడు, వలసిన విషయములను సైతము శాస్త్రముపదేశించినది. అవన్నియు వ్రాయనక్కఱలేదు, గాని ముఖ్యవిషయములు కొన్ని తెల్పినం జాలును. సంకల్పవాక్యములందు మాసపక్షతిథులు, నియత నిమిత్తాదులు (గ్రహణ సంక్రాన్తులు మున్నగునవి) విచారింతము ఇవన్నియుఁ బూజాది విధ్యుక్తకర్మముల కాలమును నిర్దేశించునవి. ఏమాసమందు, ఏపక్షమందు, ఏతిథియందు, ఏకాలమందు, ఏనియత నిమిత్తాదులు వడునో, వానికై శాస్త్రమేకర్మములను నిర్ణయించినదో, వాని నాచరించువాఁడు ఆ మాసము, ఆ పక్షము, ఆ తిథి యనువాని విశిష్టత గలవాఁడగునేని, ఆపూజవిధిగా నిర్వికారముగా నగును.

ఒక దృష్టాంతముచే నీకు సులభముగాఁ దెలియ వచ్చును — "ఆశ్వినమాసే, శుక్లపక్షే, మహాష్టమ్యాం, తిథౌ, అముకగోత్రః, అముక నామాహమ్, శ్రీ దుర్గాప్రీతి కామో, యథాశక్తి శ్రీ దుర్గాపూజాం కరిష్యే," నీవనిన యీ వాక్యములకు — "ఆశ్వినమాస శుక్లపక్ష మహాష్టమీ తిథి విశిష్టుఁడైన, ఈగోత్రపువాఁడైన, ఈ పేరుగల నేను, శ్రీ దుర్గాదేవియెడఁ బ్రీతి కలుగుటకై యథాశక్తిగా శ్రీ దుర్గాపూజను జేయుదును" ఇటులు సంకల్పవాక్యములలో "మాసే, పక్షే, తిథౌ" అని సప్తమీ విభక్తి ప్రయోగ మున్నది. అదిచూచి సాధారణముగా ననేకులు, అధికరణ మందే యీ ప్రయోగమనుకొందురు. ఇట్టి యాశంకను దొలఁగించుటకే స్మృతిశాస్త్రము ఈ సందర్భమున మిగుల విచారించి, 'కాదిచట నధికరణసప్తమి కాదు.' "శరది పుష్పన్తి

సప్తచ్ఛదాః'' మున్నగు వానివలెనే. విశేషణములను దెలుపు సప్తమి, యని సిద్ధాన్తించినది. అనఁగా శరత్కాల విశిష్టము లైన సప్తచ్ఛదవృక్షములు (ఏడాకుల యనఁటులు) పూచును'' ఇచట 'శరది' యనునది సప్తచ్ఛద వృక్షవిశేషణము అయి నటులే, మాస పక్ష తిథ్యాదులు పూజకుని విశేషణములు. ప్రస్తావిత స్థలమందు అధికరణ సప్తమిని జెప్పక వీనిని విశేషణ సప్తములుగాఁ జెప్పుటయే విశేషోద్దేశ్యము. పూజకుఁ... అట్టి మాస పక్ష తిథి విశిష్టుఁడు కానంతదాఁక వానికిఁ బూజాధి కారము కలుగదు. మాసపక్షతిథి విశిష్టుఁడగుట యన్నను, విరాడ్విశ్వప్రకృతితోఁ బూజకునకుఁగల నిత్యసంబంధము నను స్మరించుట — అనుభవించుట యన్నను నొక్కటే.

ఇంకను వివరింతము — పూజకుఁడు ఏదేనొక విశిష్ట పూజాదికమును జేయఁబూనువేళఁ దాఁ జూచుకొన వలసి నది—అపుడు విశ్వప్రకృతి యవస్థ యెట్టిది? సూర్యచంద్రాదు లెచ్చట నేభావముతోనున్నారు? అఖండము, నిత్యము, స్థిరము నైన కాలసత్తయొక్క కల్పితప్రవాహము ఇప్పుడేవిధముగా నడుచుచున్నది? ఇపుడు నేనెట్టి కాలప్రవాహము నడుమ నున్నాను? ఈమున్నగు వానిని స్మరించుకొని విశిష్టభావముతోఁ బూజింపవలయును. సాధారణముగా మనము జగత్తునం దేయవస్థలో విచరించుచున్నారమో దానివలనఁ దెలియఁబడు నది — విశ్వప్రకృతితో మనకేమైన సంబంధము కలదా? లేదా? మనము విశ్వప్రకృతి రూపిణియైన, యమ్మ యొడిగ్గో నెడసిన యవస్థయందున్నామా? ఈ విచ్యుతిదశ, మన యజ్ఞా నమున, మఱపువలన నైనదా? యను దానిని దెలిసికొని, పూజాది విధ్యుక్తకర్మములు చేయువేళ నొక్కంత సేపయి

నను, ఆ యజ్ఞాన విస్మృతులను దొలఁగించుకొని సత్యస్మృతిని జేయు విధానమిది కనుక సంకల్పకాలమందు స్మరించుకొన వలయును. అనుభవింపవలయును. పూజ మొదలిడునపుడు పలుకునట్టి సంకల్పవాక్యములు గూఢరహస్యార్థ మిది. పూజ కుఁడు పూజకుఁ గడంగునపుడు, "నేను జగత్తేంద్రదమువైపు ముందడుగు వేయుచున్నాను. అనగా జగదుత్పత్తి స్థితి లయము లెందగునో యా పరమేశ్వరుని సమీపించుచున్నాను. ఈ బాహ్యజగత్తుతో నాకెట్టి సంబంధమును లేదు." అని తలంపవలయును. ఆ యనుస్మరణమునకు ముఖ్య ప్రయోజన మిదే. జగదీశ్వరుని సమీపించుటకు జగత్తు నమనుండియే యగ్రసరుఁడు కావలయును.

రహస్య మేమనగా — ఎవ్వఁడెవ్వనిని బూజించునో వాఁడా సమయమందు ఆంశికముగా, అప్పుడే తత్సాయూజ్య లాభము నొందవలయును. "దేవోభూత్వా దేవాన్ యజేత్" తాను దేవతయై యపుడు దేవతను బూజింపవలయును. "నే నెవనిని బూజించుచున్నానో యతఁడొక్కఁడే యీ జగత్తున కధీశ్వరుఁడు. ఈ విశ్వ మతని యొడియందే యున్నది. నేనును యథాసంభవముగా నీశ్వరభావముతో భావుకుఁడను గావలయును. కాకున్నచో యథార్థపూజ కాఁజాలదు" అని తలంపవలయును. కనుకనే శాస్త్రకారులు పూజాదియందే సంకల్పవాక్యవిధానము నొనర్చిరి. పూజకుఁ డీశ్వరభావముతో నుద్బుద్ధుఁడగుటకు మంచి యోగమును గల్పించిరి. పూజకుని పక్షమున సంకల్పవాక్యమే యీశ్వర సాయూజ్యభావ మందుటకు మొదటిమెట్టు. "నేను పూజింపఁ గూర్చుండి సంకల్పము చేయునపుడు, ఈ మాస పక్ష తిథ్యాదులు నా శరీరమందే

నాలోనే విశేషణములుగా నున్నవి. 'నేను' మూడున్నర మూరలు కొలఁదిగల మాంసపిండమయమైన యొక శరీరమను గాను. నేను విరాట్టు; నేను మహత్; నేను వ్యాపకుఁడను; నేను విజ్ఞానమయుఁడను. ఈ యాశ్వీనమాసమనెడి కల్పిత కాలప్రవాహము నా యంగమందే యున్నది. విరాడ్రాశి చక్రము (మేషాది ద్వాదశరాసులు) నా యంగము నలంకారమే. కన్యారాశియందున్న యీ సూర్యుఁడు నా యంగమందున్నవాఁడే. ఇతఁడు నా యంగమందే యున్న చంద్రుని సప్తమకళల నతిక్రమించి, యష్టమకళాపూర్ణుఁడై యున్నాఁడు. నేనిపుడు ఆశ్వీనమాసమయుఁడను, శుక్లపక్షమయుఁడను, అష్టమీతిథిమయుఁడనై శ్రీదుర్గాదేవిని, దుర్గతిహారిణిని, జగదీశ్వరిని, అమ్మను బూజింపఁగడఁగితిని." అని యీ విధముగా సత్యభావన చేయుటే పూర్వోక్త సంకల్పవాక్యము యొక్క ప్రధానోద్దేశ్యము.

పూజకుని సంకల్ప మెంతగా సత్యమందుఁ బ్రతిష్ఠిత మగునో, యతని సంకల్పమును నంత వడిగా ఫలదాయక మగును. కలికాలములో సంకల్పములు సఫలములు కావనెడు వారి మాటయు నొకవిధముగా సత్యమే. అవును. సత్యమందుఁ బ్రతిష్ఠితుఁడుగాక, సత్యభావనము నలవాటులేక, సత్యయోగి యుఁడు గాక యున్న జీవుని సంకల్పము సిద్ధించు టెటులు? సంకల్పించువేళ నేదో యొక సంశయమో, విపర్యయ జ్ఞానకళయో వచ్చిపడి సంకల్పవిశుద్ధిని బాధచేయుచున్నచో సంకల్పితము తప్పక ఫలింపకుండును; ఇక్కాలమందు వైధకర్మములు ఫలింపకుండుటకు హేతువొక్కటే - సంశయము, విపర్యయ జ్ఞానము. ఈ రెంటికే వికల్పమని పేరు. సంకల్పము వికల్పము

చేత దూషితముకాదేని, అదే శుద్ధ (సత్య) సంకల్పము. శుద్ధ సంకల్ప మేనాఁడును విఫలము కాదు. సంకల్పవేళ — "ఈ కర్మమువలన నిట్టిఫలము గలుగునా ? కలుగదా ? యనిగాని, ఈ కార్యమువలన నిట్టి ఫలము గలుగుట యసంభవమనెడి విపర్యయజ్ఞానముగాని చిత్తమందుదయించువారికి ఆ వికల్ప దూషిత సంకల్ప మేనాఁడును ఆశానురూపఫలము నీయఁ జాలదు. గురువాక్యములందును శాస్త్రవాక్యములందును జలింపని విశ్వాసమనెడి శ్రద్ధ నెలకొనకుండుటకు మున్ను చెప్పిన చిత్తదౌర్బల్యమే కారణము. ఎడతెగక జీవుఁడు చేయు సత్యప్రతిష్ఠయే యీ దుర్బలతను దొలఁగింపఁగలది. అది యుండనీ.

ఇంచుమించుగాఁ బారకులెల్లరు సంకల్ప వాక్యము లందుఁ గానఁబడు సప్తమీ విభక్త్యంతములను బూజకవిశేష ణములుగాఁ గైకొను సార్థకత యేమని తలంపగలరు ? మాస పక్ష తిథ్యాదులు పూజకునకు అధికరణములే యగుచోఁ బూజకుఁడు వాని కాధేయమే (వానిపై నాధారపడవలసిన వాఁడే) కావలసివచ్చును. అపుడు పూజకుఁడు మాంసపిండ మయమే యాత్మ యనుకొను క్షుద్రజీవుఁడేకాని, మఱేదియుఁ గాఁడు. అట్టి పూజకుఁడు ఈశ్వరపూజయం దధికారియే కాఁడు. ఈశ్వరుని బూజించుటకై పూజకుఁడు సైతమెటులో (అతికష్టముతో) యీశ్వరభావముతో భావుకుఁడు కావలయు నని కారణము మున్నే చెప్పితిమి. తాను 'మహాన్' కాని వాఁడు, 'మహతో మహీయాన్' అయినవాని పూజ యెట్లు చేయఁగలఁడు ? మాస పక్ష తిథ్యాదులను అధికరణమందే యనుస్మరించునపుడు పూజకునందు మహద్భావము స్ఫురిం

పడు. మఱి యివన్నియుఁ దన విశేషణములుగానే యనుధ్యానింపఁగల్గినచో, మహాద్భావము సంఘటనము సులభముగానే యగును. ఒక్క-నాఁడే పూజకుఁడెవ్వఁడేని యీగంభీరరహస్యమును మన్నించినంతమాత్రాన సంకల్పానురూపఫలలాభమొందఁగలనని యాశింపరాదు. ఏమన, నిది యనుశీలనసాపేక్షము. అనఁగాఁ దఱచుగా నభ్యసింపఁదగినది. అప్పుడు భగవత్కృపచేఁ గొలఁదినాళ్లనుశీలించిన యెడల సంకల్పమునందయిన యీ రహస్యోపలబ్ధియయి, సత్యసంకల్పుఁడై, శ్రద్ధావంతుఁడైన పూజకుని విషయమున నిది దురూహము కాదు.

ఇపుడు మనము పూజాకాల విషయమునఁ గొంత యాలోచింతము — ఇప్పటికి మాస పక్ష తిథ్యాదులు పూజక విశేషణములని తెలియఁగల్గితిమి. పూజాదికర్మములను బ్రతిపాదించు విధ్యుక్తవాక్యములయందుఁ గాలనిర్ణయము చేయఁబడినది. ఏమాసమున, ఏపక్షమున, ఏతిథియందు, ఏసమయమున, ఏపూజావిధానము శాస్త్రములం దుపదేశింపఁబడినదో యట్టి కాలముయొక్క ప్రకటావిర్భావానుభవమును దనలోను, వెలిని జేయఁగల్గునపుడే యా పూజ కధికారి యగును. కాలము — అఖండము, ఏకము, నిత్యస్థిరవస్తువైనను అద క్రియచేతఁ బరిచ్ఛిన్నతనొందినది. సూర్యచంద్రులే కాలముయొక్క మొదటి పరిచ్ఛేదకులు. అఖండమైన కాలము సూర్యచంద్రులచేతనే ఖండితమైనట్లు తోఁచును. వారము, తిథి, పక్షము, మాసము, ఋతువు, అయనము, సంవత్సరము మున్నగుమాటలు పరిచ్ఛిన్నమైన యీ కాలమును దెల్పునవియే. వెలుపలి సూర్యచంద్రులే లోపలి ప్రాణ మనోరూపముగా నెలయుచున్నారు. ఉపనిషత్తులలో నియ్యది స్ఫుట

"ప్రాణ, రయి" శబ్దములతోఁ బిలిచితులగుచున్నారు. మఱి కొన్నిచోట్ల నీయిరువురే క్రమముగా "పితృశక్తి, మాతృశక్తి" యని వర్ణింపఁబడిరి. సముదయప్రాణులు కేవల ప్రాణులే యననేల – స్థావర జంగమాత్మకమైనది సకలమును నేతదుభయాత్మకమే (అనఁగా నీ రెండిటి స్వరూపమే). తేలినదేమనఁగా_ మనుష్యక్షేత్రమందే (దేహమందే) యీ యిరువురి ప్రకటన ప్రకాశము గానఁబడుచున్నదన్న మాట.

ఈ పితృ మాతృశక్తులు పరస్పరము అభిభావ్య – అభిభావకధర్మము గలవి. అనఁగా నొకటి రెండవదానిని దిరస్కరింపనే యెల్లపుడు ప్రయత్నించుచుండును. కాఁబట్టి యొకదాని ప్రభావ మధికమైనపుడు రెండవదాని ప్రభావము తగ్గుచుండును. ఋతు విశేషమందును, మాస విశేషమందును సూర్యునియొక్క (ప్రాణముయొక్క – పితృశక్తియొక్క) ప్రభావము ప్రకృతివిశేషముచేతనే హెచ్చును. ఆ సమయమందే చంద్రుని (రయి – మనస్సు – మాతృశక్తియొక్క) ప్రభావము తగ్గును. మఱియు ఋతు విశేషమందు, మాసవిశేషమందు, తిథివిశేషమునందును సరిగా దీని విపరీతభావము కాననగును. అనఁగా ఆ సమయమందు మనఃప్రభావ మధికమును, ప్రాణ ప్రభావము హ్రస్వమును నగుచుండును. సాధారణముగా మనము — ఉత్తరాయణమందు (ప్రాణ) సూర్యుని ప్రభావ మధికమగుటయు, దక్షిణాయనమందు హ్రస్వమగుటయుఁ గాంచుచున్నాము. శుక్లపక్షమందుఁ జంద్రముని ప్రభావ మధికమగుటయుఁ గృష్ణపక్షమందుఁ దఱుగుటయుఁ గనుచున్నాము. తిథులయందును గృష్ణాష్టమి మొదలు శుక్లాష్టమి పర్యంతము చంద్రుఁడు క్షీణుఁడై యుండును. గాఁపున మనః

శక్తియును దానిని బట్టిచూడ క్షీణమైపోవును. ఈవిధము కేవల మాసపక్షతిథులందే కాదు, ప్రత్యేకము అహోరాత్రములందును సామయికముగా నొకశక్తి తఱుగుటయు రెండవది పెఱుగుటయు నగుచుండును. ఏలన నిరువదినాలుగు గంటలలో, ఆఱుఋతువుల ధర్మములు వెలయుచుండును. ప్రాతరాదిగా వసంతాది ధర్మములు క్రమముగా వఱలుచుండును, మఱియు స్వరోదయశాస్త్రము నెఱింగినవారు శ్వాసప్రశ్వాసక్రియ యీ శక్తులతోఁ రెండున్నరగంటల కొకసారి మాఱుచుండుట గనుగొందురు. ఇడానాడియందు (చంద్రనాడియందు) శ్వాసము ప్రవహించునపుడు మనఃశక్తి (రయి - మాతృశక్తి) ప్రభావ మధికముగాను, ఇటులే పింగళానాడియందుఁ (సూర్యనాడియందు) శ్వాసప్రవాహ మున్నపుడు ప్రాణ (పితృశక్తి) ప్రభావ మధికముగాను నుండుట తెలియును. ప్రతియామార్థమందును (అరజాములో) లో, వెలిని మాత్మముగా నిట్టి పరివర్తనము కానఁబడుచుండగా మాసవిశేషమందును, తిథివిశేషమందును నొక విశేష పరివర్తనమగుచుండునని వేఱుగాఁ జెప్పనేల?

బాహ్యప్రకృతి పరివర్తనముతోనే మనయంతఃప్రకృతి పరివర్తనము సైతము వ్యక్తిభేదమును బట్టి కొలఁదిగానో గొప్పగానో యగుచుండును. కొంత యనుభవముండి యనుసంధానించు వారలే యీ పరివర్తన లక్షణమును గుర్తింపఁగలరు. అమావాస్యా పూర్ణిమలందును వానికి సమీపతిథులందును సంతఃప్రకృతియందు నింతో యంతో పరివర్తనము నెల్లరును గుర్తించుచు సేయుచుందురు. ఈపరివర్తనము కారణముగానే యీ తిథులయందుఁ గొందఱి మానసిక శారీరక

వ్యాధులు విశేషించుటయుఁ గందుము. తత్త్వముల వైపు చూచుచుఁ బోయినను గ్రీష్మకాలమందుఁ దేజస్తత్త్వము యొక్కయు, వానకాలమందు జలతత్త్వము యొక్కయు, శరత్కాలమందు క్షితితత్త్వము యొక్కయు, వసంతకాలమందు మహాత్తత్త్వముయొక్కయు ప్రభావము వృద్ధినొందుచుండునని చక్కఁగాఁ దెలియును. (కార్తికమాసము శరదృతువు లోనిది. మార్గశీర్షము శీతర్తువులోనిది. కనుక హేమంతర్తు పధకము వ్రాయలేదు.)

ఏమాసమున, నేపక్షమున, నేతిథియందు, నెట్టివేళ, వెలిని లోనఁ బ్రకృతియందు స్వాభావికములైన యెట్టిపరివర్తనములు వచ్చునో, వానియందు విశేషలక్ష్యము నుంచియే పూజ్యపాదులైన మన మహర్షులు పూజాది వైధకార్యముల విధానముల నుపదేశించిరను మాటను బూర్తిగా విశ్వసింపనం జాలును. జీవనయాత్రయం దగ్రసరులై సుఖింతురు. మనః ప్రాణముల స్వాభావిక పరివర్తనముల యనుకూలతను గుర్తించి నడుచుచున్నచో, మన యాధ్యాత్మిక మార్గమునం దగ్రగతి సంపన్నులగుదుము. దాని విశేషవిచారముఁ జేసియే మనఋషులు విధినిషేధాదులను బ్రవర్తింపఁజేసిరి. ఒక సాధారణ దృష్టాంతమందు లక్ష్యముంచినచో దీని సత్యత బోధపడగలదు. మన దేశమందు వైశాఖమాసమున జలదానము, చందనయాత్ర, పుష్పడోలికా నియమసేవ, శివనారాయణ విగ్రహముల జలధారా స్థాపనము, అశ్వత్థ తులసీవృక్షములకు జలదానము మున్నగునవెన్నో జరుగుచున్నవి. ప్రాణదేవతలామయమందు గ్రీష్మతాప సంతప్తులగుటను జక్కగా ననుభవించియే సర్వవిధముల స్నిగ్ధోపచారములతో నభీష్టదేవతా సేవా

పూజాగులను విధిగాఁ జేయుట. ఇటులే నిత్యనైమిత్తికకర్మములం టన్నింటను శాస్త్రప్రకృతిని లక్షించియే వానిని బ్రవర్తింపఁ జేసిరి. మన స్థూలశరీర స్వాస్థ్యము దేనిచేత సురక్షితమగుచున్నదో, మన మనోమయ శరీరము దేనివలన ననుకూలాహారము నొంది పరిపుష్టమగునో, మన ప్రాణమయ శరీరము దేని సత్త్వగుణాత్మక శక్తిచే సంజీవితమగునో, మన విజ్ఞానమయ శరీరము ఏపూజాది వైదికకర్మములచే విశుద్ధజ్ఞానము నాడి యాహారమును గొనగలునో, మన యానందమయ శరీరము ఏ సాత్త్వికానందముతో నెల్లప్పుడు నుత్ఫుల్లమగునో యవి యన్నియు బాగుగాలక్షించియే మన దేశమం దేడాదిపొడుగు నను వివిధ విశేష పూజావిధానముల నడుపుచు వచ్చిరి. ఇంచుకంత ధీరచిత్తముతో గుర్తించినపుడు, ఏమాసమందు నేపక్షమందు, నేతిథియందు నెట్టివేళఁ బూజాదులను జేయుటచే మన దేహ మనఃప్రాణములు స్వస్థములును, సబలములును నై యుండునో, మన జడత్వాభిమానము క్రమముగా సడలిపోవునో, యజ్ఞానము క్రమముగాక్షీణించునో ఆయా యాయి ఋతు మాస పక్ష తిథులయందు నట్టి పూజాదులనే పూర్వులు ప్రవర్తిల్లఁ జేసిరి. వేయేల; ప్రత్యేకవిషయమును సూక్ష్మాతి సూక్ష్మముగా విమర్శించి సత్యద్రష్టలైన ఋషులు ప్రవర్తింపఁ జేసిన విధానములకుఁ దలయొగ్గి తదనుసారముగాఁ గర్మముల నాచరింపఁబూనినపుడు వీని ప్రత్యక్షఫలము నెల్లరు నొందఁ గలరు. మన దేశమందు జరుపఁబడు పూజాది వైదికకర్మములు భ్రమప్రమాద దూషితములైన యల్పజ్ఞమస్తిష్కములనుండి పుట్టిన ఫలములు కావు. అవి సర్వజ్ఞులును, సత్యదర్శులు నైన యార్యఋషులు జగత్కల్యాణార్థమై చేసిన విధానములు.

శాస్త్రీయ విధినిషేధములు ప్రత్యక్షవైజ్ఞానికయుక్తిసిద్ధములై సత్యమందే ప్రవర్తితములును, సత్యమందే ప్రతిష్ఠితములు నై యున్నవి.

పరమేశ్వరుఁ డొక్కఁడే. అతనిని వేర్వేరు సమయము లందు వేర్వేరు రూపములతో దర్శించుచున్నాము. కారణ మేమనఁగా బరివర్తనప్రియత్వమే (మార్పు నందలి యిష్టమే) జీవనము యొక్క ప్రధాన లక్షణము. మనము జీవులము. తెలిసియో తెలియకో యెల్లప్పుడును మార్పులే కోరుచుం దుము. దాని ఫలముగానే మన యాంతర బాహ్య ప్రకృతి యెల్లప్పుడునుఁ బరివర్తితమగును. కనుక మన ప్రియతమ ప్రాణదేవత యెల్లప్పుడును ఏకరూపుఁడేయయ్యును, మన ప్రీతికొఱకు నతఁడు వేర్వేఱు సమయములందు వేర్వేఱుభావ ములతో నాత్మస్వరూపమును వెలయించుచుండును. దీనివలన లోపలనేకానీ, వెలుపలకానీ ఏదో నొకవిధమైన విశేష పరి వర్తన మగునపుడే యేదో యొక విధమైన పూజాదివైధకర్మ విధానము ప్రవర్తిల్లునని కనుగొనుచున్నాము.

తిథులలో నుభయ పక్షములందలి యష్టమినాడును తత్సమీపవర్తి తిథులయందును విశేషించి పరివర్తనసూచన మగును. మఱియుఁ బూర్ణిమ, అమావాస్యలందునుఁ దత్సమీప తిథులందును విశేషపరివర్తనముల పరిసమాప్తి యగును. కావుననే యధికాంశ పూజాదులు ఈతిథులయందే విహితము లైనవి. పరమేశ్వరుని యైశ్వర్యమయత్వము, ఆనంద మయత్వము మున్నగు సగుణ భావోపలబ్ధికొఱకుఁ బూజ లన్నియు విహితములైనవి. వానిలో నధికభాగము శుక్లపక్ష ముఁ బగటివేళను, బూర్ణిమాష్టములయందును, దత్సమీప

తిథులయందును జేయఁబడును. ఇఁక నిర్గుణ స్వరూపము వంక నగ్రసరులగు నుపాయములైన పూజాదులం దధిక భాగము కృష్ణపక్షమందు అమావాస్యాష్టముల యందును దత్సమీప తిథులయందును రాత్రివేళఁ జేయఁబడును. ఈసమయములందు మనస్సు స్వాభావిక నియమవశమున క్షీణతనొందును. చంద్రుని క్షీణతతోనే మనస్సు క్షీణించుట తప్పదు. మనస్సు క్షీణమగుటచేతనె విషయలాలస క్షీణించును. ఇఁక పగటి భాగమును బట్టి చూడఁగా రాత్రి భాగమునం దింద్రియములు సహజముగానే యంతర్ముఖత్వము నందును. కనుకఁ బైని జెప్పిన కాలము నిర్గుణ సత్త్వోపలబ్ధి విషయమున విశేషసహకారి యగునని చెప్పనక్కర లేదు. ఇటులే యంతటను వెలుంగునది. మున్ముందుగా మన దేశమున జరుపుచున్న కొన్ని ప్రధాన పూజల విశేష వివరణములగూర్చి యాలోచించుటకు మున్ను మూర్తిరహస్యము, మంత్రరహస్యము, ఆచమనము, ఆసన శుద్ధి, ప్రాణప్రతిష్ఠ మున్నగువాని తత్త్వజ్ఞాన వివరణ మావశ్యకము.

# మూర్తి రహస్యము.

శాస్త్రమందు—

"చిన్మయస్యాద్వితీయస్య నిష్కలస్య శరీరిణః
ఉపాసకానాం కార్యార్థం బ్రహ్మణో రూపకల్పనా
సాధకానాం హితార్థాయ బ్రహ్మణో రూపకల్పనా॥"

యనియుఁ జెప్పఁబడినది. చిన్మయుఁడును, అద్వితీయుఁడును దనయందు సజాతీయ విజాతీయ స్వగత భేదములు లేనివాఁడును,

నిష్కలుండును, బాల్యాద్యవస్థా భేదములు లేనివాండును, నిరవయవుండును అశరీరియునైన పరమాత్మ పేరే బ్రహ్మము. వేర్వేఱు దేవదేవీరూపములతోఁ దనను బరికల్పితునిఁగాఁ జేసికొనును. ఎందులకిట్టి పరికల్పనమగునో? యెందులకు నామరూపములు లేని బ్రహ్మము, వేర్వేఱు నామరూపములతో విశిష్ట దేవదేవీమూర్తులతోఁ బ్రకాశితుండగును? ఇట్టి ప్రశ్నమునకు బదులిచ్చుచు, మన ఋషులు "ఉపాసకానాం కార్యార్థం"—ఉపాసకుల కార్యసిద్ధి కొఱకు "సాధకానాం హితార్థాయ" సాధకుల మేలుకొఱకు — ఇట్టి రూపపరికల్పనము జరుగుచుండు ననిరి. ఉపాసకులైనవారు, అనఁగా ఈశ్వరుని సమీపమున నాసన లాభయోగ్యత నొందినవారు, ఆ యుపాసనము వెడి కార్యమును సుసంపన్నము చేయుటకే, అమూర్తమునకు మూర్తి కల్పనమగుచున్నది. యథార్థముగా సాధన రాజ్యమందుఁ బ్రవేశింప సమర్థులైనవారి మేలుకొఱకే, అరూప బ్రహ్మమునకు విభిన్న దేవదేవీరూపములతో వెలయుటగుచుండును. శాస్త్రకారులు మున్ను జెప్పఁబడిన స్థలములందు "ఉపాసక, సాధక" అను రెండు మాటలను బ్రయోగించి మూర్తి రహస్యము తెలుంగు నధికారమును సూచించిరి. అనఁగా ఉపాసకులును, సాధకులును గానివారికై మూర్తి కల్పనమువలన నెట్టి ప్రయోజనమును లేదు. ఏమనఁగా, అమూర్తమైనది మూర్తి పరిగ్రహణము చేయుటయందేమి రహస్యమున్నదో దాని యవధారణమే వారు చేయలేరు. కావున నన్నిఁటికంటె ముందు సాధకులు నుపాసకులునైన వారి కొఱకే వేర్వేఱు దేవదేవీమూర్తుల యావిర్భావమగుచుండునని చెప్పఁబడినది.

సాధారణముగాఁ గల్పనము చేయుటచే, మనకుఁ దెలిసినంతవఱకుఁ దఱచుగా నదియొక విధమైన మానసిక భావము మాత్రమే. కాని, యిచట సరిగా నదేకాదు. ఈ మూర్తి కల్పనము బ్రహ్మముదే. సత్య సంకల్పుఁడైన యెవని కల్పన యెన్నఁడును వ్యర్థముకాదో, యతఁడే వేర్వేఱు నామరూప విశేషములుగల దేవదేవీమూర్తులతోఁ దన్ను బయల్పెట్టుకొనును. ఈ జగత్తు బ్రహ్మము వల్లనే పుట్టి బ్రహ్మమునందే యుండి బ్రహ్మమునందే విలయమగునట్లే, విభిన్న దేవదేవీమూర్తులను, బ్రహ్మమువల్లనే పుట్టి, బ్రహ్మమందే యుండి, బ్రహ్మమందే విలీనమగుచుండును. బ్రహ్మమే యీ పరిదృశ్యమాన జీవజగత్తునకు నిమిత్త కారణమును, ఉపాదానకారణమును నై యున్నది. బ్రహ్మమును మీఱి మఱియొకటియును లేదు.

సర్వధర్మములకతీతుఁడును, సర్వమహిమములకతీతుఁడును, సర్వగుణములకతీతుఁడును, సర్వవిధనామములకతీతుఁడును, దన సత్తా చైతన్యములచేతనే సర్వసత్తల సత్తయుఁ బ్రకాశమునగుచున్నవాఁడును, దన సత్తాస్ఫూర్తి ప్రదానము లేకున్నచో, ధర్మము మహిమము నామరూపాదికము నేదియు నుండదో యట్టివాని వేర్వేఱు మహిమములతోఁ గూడిన వేర్వేఱుశక్తుల స్వరూపము తెలియుటకే భ్రమ ప్రమాదములు లేని సత్యద్రష్టలైన ఋషుల ప్రయత్నము. ఆప్రయత్న ఫలస్వరూపముగా వారి నిర్మలబుద్ధియందు ఏశక్తియొక్క ఏ విశిష్టస్వరూప మాభాసించినదో, యది యాశక్తియొక్క ఘనీభూతవిగ్రహమే, అనఁగా నదే విభిన్న దేవదేవీ మూర్తులు. దృష్టాంతమును చూతము — కాలశక్తియొక్క యథార్థస్వరూ

పము నెఱుంగుటకై ఋషులకు సహజాహితావస్థ యను నొక చేష్ట యైనది. ఆ చేష్టయొక్క ఫలముగా వారి సమాధిస్థమైన నిర్మల బుద్ధిక్షేత్రమందు ఏమూర్తి సంభివ్యక్తమైనదో, యదే కాళీ మూర్తి. అదే శిష్యపరంపరాక్రమముచే నుపదేశింపఁబడుచు క్రమముగా సంతతము నెలసినది. ఎవఁడేని కాలస్వరూపము నెఱుంగఁగోరినచో, అనగా — కాలాతీత సత్తయందుఁ బ్రవేశింపఁగోరినచో నీ కాళీమూర్తి నవలంబించి యథారూప సాధన చేయుటచే ననాయాసముగా నతని కోరిక సిద్ధింపఁగలదు. తక్కిన దేవదేవీమూర్తుల సంబంధమందును నిట్టులే యెఱుంగునది.

ప్రత్యేక దేవదేవీమూర్తియు ననంతశక్తిసంపన్నమైన పరబ్రహ్మముయొక్క విశిష్టశక్తుల ఘనీభూతవికాసమే. ఎవఁడేని యీ విశిష్టశక్తి కేంద్రమును అనఁగా వేర్వేఱు దేవమూర్తుల నవలంబించి పూర్ణబ్రహ్మము నుపాసింపఁగోరినచో నదియుఁ జక్కగా సార్థకమగును. ఏలన — ఈ సర్వవిశిష్ట దేవమూర్తుల రూపములో నతఁడే యున్నాఁడు. పూర్ణబ్రహ్మరూపముతోను నతఁడే ప్రకాశించుచున్నాఁడు; మఱి సారమైన మాట యేమనఁగా — వ్యష్టిశక్తిగానున్న యేదియైనను సమష్టిశక్తియొక్క వక్షమందే స్ఫురించును. మంచుముక్క పట్టుకొని యెవ్వఁడేని జలస్వరూపము నెఱుంగఁగోరినచో నతని కోరిక నిష్ఫలము కానట్టులే, యీ వేర్వేఱు దేవమూర్తులనెడి ప్రతీకముల నవలంబించి యెవ్వఁడేని బూర్ణత్వస్వరూపము నెఱుంగఁగోరినచో నతని కోరికయు నావిధముగానే నిష్ఫలము కాదు. వాస్తవముగా నిట్టులే వ్యష్టిని బట్టుకొనియే సమష్టియందుఁ జేరుకొనుట యగును.

మూర్తికల్పనము యొక్క మఱియొక ప్రకార మున్నది. అదే మనము విశేషించి గుర్తింపవలసిన విషయము. మాటలకు మనస్సునకు నందరాని కేవల బోధస్వరూపుఁడైనవానిని మన కేదో యొక యంశమందుఁ దనువలెనే స్థూలమువరకుఁ గొనితేక యున్నంతదాఁక మానవులమైన మనకుఁ దృప్తి కలుగదు. మన ప్రాణప్రియుఁడై పరమాత్మయైనవానిని స్థూలమునకుఁ దెచ్చి, స్థూల ద్రవ్యభోగములను జేయించి, రవ్వంత యాదరింతు మనుకొందుము. అంతముదాఁక ఆ యాదరమందు మోసము లేక చేయఁగల్గినచో, మన బ్రతుకు, ఎడతెగని యకృతజ్ఞత యనెడి మహాభారముచే లొంగిపోవు, శుష్కమును మలినముగానే యుండిపోవును. ఎవఁడు 'నేను' అనుదాని మనకిచ్చెనో, యెవని స్నేహమే మన ప్రాణమో, యెవని యాత్మదానముచే జడమైన నేను చేతనామయుఁడను, నాత్మమయుఁడను నైతినో, యెవని సత్తవల్లనే నేను సత్తామయుఁడనైతినో, యతని నొక్కసారి మనుగడయందు తుదకొక్కసారి యైనను, ఆదరపూజలయందు మోసము లేక సేవించినపుడు, మఱి యేముండిపోవును? గీతయం దాతఁడే స్వయముగా, పత్ర పుష్ప ఫల జలములను భక్తితో నర్పింపు మాట చెప్పినాఁడు. మనకొఱకే భోగ్యజగద్రూపముగా వెలయఁగల్గినవాఁడు — మన జీవనరక్షకై అగ్ని జల వాయు గగనాది రూపములతో స్థూలముగాఁ బ్రకాశింపఁగల్గినవాఁడు మఱి మనము భక్తితో నిచ్చు స్థూలద్రవ్యముల నందుకొనుటకై స్థూలమూర్తిగా వెలయుననెడి మాట మనము సంశయము విచారింపు నుండఁగలదా?

ఓయీ! వినుము. సర్వ దేవదేవీమూర్తులును నాత్మ ప్రేమయొక్క ఘనీభూతవికాసములే. ఔరా! మొట్టమొదట నీ సర్వమూర్తుల యవతారణముఁ జేయించుటకు సమర్థులైన వారలే ధన్యులు. శతధన్యులు. ఆహా! వారు తమ ప్రాణ దేవత నెంతగాఁ బ్రేమించిరో! ఎట్టి ప్రేమాకర్షణముచే వారలు ఆ మనోవాగతీత వస్తువును సైతము స్థూలమూర్తి రూపమునఁ బరిణమింపఁజేసి, యాహారవిహారాది వ్యావహారిక జీవనముతోఁ జేర్చివేసిరో! ఇంటింటఁ బ్రతిష్ఠితములై కాన వచ్చు సాలగ్రామశిలలు, తక్క దేవవిగ్రహములు సనాతనవి యజ్ఞాన మూఢతలకు గుర్తులు కావు. ఆత్మప్రేమవిహ్వలు లైన తొల్లింటి యాచార్యుల యాత్మప్రేమయొక్క స్థూల వికాసములే. పితామహులు మున్నగు గురుజనులు గృహ కర్తలుగానుండినటులే గృహస్థాశ్రమసంబంధమైన సర్వకార్య ములను జక్కఁగా నెరవేర్చుటకై పరమపితయొక్క స్థూల మూర్తి నింటింటఁ బ్రతిష్ఠించు వ్యవస్థనుజేసి యార్యఋషులు, ఏవిధముగా దూరదర్శిత్వమును బరిచయము చేసిరో, జ్ఞాన భక్తికర్మములకు నేవిధముగా నపూర్వసమన్వయ మొనర్చిరో యది తలంచుకొన్నంతనే మతిపోయి వింతలో మునిఁగి పోవుదుము.

మూర్తిపూజ (విగ్రహపూజ) అజ్ఞానులకై మాత్రమే చెప్పఁబడినదనెడివారికి మాయిమ్మాట లెట్టులును సరిపడవు. మూర్తిపూజ జ్ఞానుల పక్షమందును నిషిద్ధముకాదని గట్టిగాఁ జెప్పుచున్నాను. జ్ఞాని యెవఁడు? — ఎవని జ్ఞానము సర్వతః ప్రసారితమైనదో (అనఁగా జగత్తత్త్వమందును, జీవత్వమం దును, ఈశ్వరత్వమందును, బ్రహ్మత్వమందును వ్యాపించి

యుండునో) యతఁడే జ్ఞాని పదవాచ్యుఁడగును. ఆ యవస్థయం దేదేనొక వస్తువు నవలంబించి బ్రహ్మసత్త నుద్బోధింపఁ గలఁడు. ఇటులుండ టయే కొంత స్వాభావికము. కేవల జ్ఞానుల పక్షమందును మూర్తిపూజ నిషిద్ధముకాదు.

అపుడు జ్ఞానులం దెవ్వఁడేని జ్ఞానముయొక్క 6–7 వ భూమికలందు, అనఁగాఁ గైవల్యమునందు నిల్చు సామర్థ్యము నొందునేని, వాని పక్షమున మూర్తిపూజ యసంభవము. ఏమనఁగా నట్టివేళ నతనికి స్థూలదేహమును గూర్చిన జ్ఞానమే యుండదు. ఎవ్వఁడే నిట్టి యవస్థయం దెక్కువకాలము నిల్చు సామర్థ్యము నొందునేని, వాని స్థూలదేహ మెక్కువకాల ముండదు. సందేహము లేదు. మనము మఱువరాని దేమనఁగా లింగసన్న్యాస గ్రహణపూర్వకముగానో, మౌనవ్రతమవలం బించియో, యీ కర్మమయ జగత్తునుండి దూరముగా నుండుటే కైవల్యమనబడదు. ప్రారబ్ధకర్మములు పూర్తిగా క్షయింపక నిత్యబ్రహ్మస్వరూపమందుండుట యెన్నఁడును జరుగదు. ఆ యవస్థ కేవలము సుదుర్లభము. ఎన్నాళ్లో కొన్నాళ్లు అల్పముగానో, అధికముగానో స్థూలావలంబన ముండనేయుండదు. అన్నాళ్లును స్థూలమూర్తి నవలంబించి పూజించు ప్రయోజనముండునవెడి మాట నంగీకరింపనివారిని ఆత్మవంచకులనినఁ దప్పేమియు లేదు. మనుష్యులై హృదయ మందుఁ గృతజ్ఞత యనెడి యపూర్వధర్మము వికసించినవాడు కోరియో కోరకో, తెలిసియో తెలియకో, స్వాభావికనియమ ములకుఁ గట్టుపడి యేదో యొకరూపమున స్థూలపూజ చేయు చునే యుందురు. ఏకాలమందును దీని కన్యథాత్వము లేదు.

కాంజాలదు మఱియు సాధారణుల పూజకును, తత్త్వజ్ఞానుల పూజకును గడుంగడు వాసి యున్నది. తత్త్వజ్ఞానులగువారు, ఏవిధమైన ఫలాభిసంధియు నుంచక, అహంకర్తృత్వాభిమానములనుండి తొలంగి పూజింతురు. మఱి సకాములైన వారు, వాసనలు పీడించుటచే బాధ్యులై ఫలాభిసంధితోం బూజింతురు. తత్త్వజ్ఞానుల పూజ కేవల ప్రేమసంబంధమైన పూజ; కావున వారు విషదంతములులేని సర్పములవలె, బంధనదోషము లేని కర్మచక్రమందుం బరిభ్రమించుచున్నను నిత్యస్వస్థులుగానే యుందురు. మఱియు దివ్యప్రేమను భోగించి ధన్యులగుదురు. మఱి కామ్యకర్మములందు నిరతులైన వారలట్టి సౌభాగ్యము లేకయే యుందురు. అద్వైత తత్త్వదర్శి శిఖామణి శ్రీశంకరాచార్యులును సాలగ్రామమందు హరిదర్శనమును, చంద్రమౌళీశ్వర లింగమందు హరదర్శనమును జేయుచుండిరి. గంగాయమునాది నదులందు బ్రహ్మదర్శనము చేయుచుండిరి. మఱియు "భిక్షాం దేహి కృపావలంబనకరీ" యనుచు స్థూలమూర్తి యెదుట నిష్కపటప్రాణముతో నిల్చి జ్ఞానవైరాగ్య భిక్షచేసిరి. వైదిక యుగమందలి ఋషులు సయితము అగ్ని జల వాయు చంద్ర సూర్యాది స్థూలమూర్తుల నవలంబించియే బ్రహ్మసత్తను దర్శించుట యభ్యసించిరి. ఈ సర్వస్థూల ప్రతీకముల యవలంబనమందు బ్రహ్మదర్శనమునకు బాధకలుగదేని, అగ్నిదేవ వరుణదేవ సూర్యదేవ ప్రభృతులైన వేర్వేఱు దేవమూర్తుల నవలంబించి బ్రహ్మస్వరూపోపలబ్ధికై ప్రయత్నించుటయు, లేదా స్వాత్మప్రేమయందు విముగ్ధులై పూజాదులు చేయుటయు అజ్ఞానమూఢుల యనుష్ఠానమై పోవునా? అది తెలిసికొనుటయుం గహనమే.

కొందఱు "బాహ్యపూజాధమాధమా" యందురు. ఈమాట సత్యమే, గాని దీని యథార్థతాత్పర్యము మనసున కెక్కనివారు ఈ వాక్యమును మూర్తిపూజావిరోధి వాక్యముగా నెన్నుదురు నెన్నలేదు. ఏమనఁగా "వాస్తవముగా మూర్తియనునది వెలుపల లేదు. అది సర్వోపాధిముల లోపలనే యున్నది. ఎల్లం యంతరముగా నిత్యము వెలుగుచున్నదే, స్థూలమూర్తిని వెల్బి వెలయుచున్నది" యను నెడి యనుభవము (ప్రత్యక్షోపలబ్ధి) లేనివారి పూజయే బాహ్యపూజ. వారి పూజయే యధమాధమపూజ యగును. చెప్పెడిదేమనఁగా ఈవిధముగా నధమాధమపూజ చేయఁగాఁ జేయఁగా మనుష్యుఁ డొకనాఁ డుత్తమ పూజాధికారి యగును. అనఁగా బ్రహ్మసద్భావమొనరఁగూడిన పూజాక్రియ నొందు సమర్థుఁడగును. "పూజకుని జూడఁగలవాఁడు, సంతోషమందున్నవాఁడు, నానే కాదు; అన్నింటి యందున్నవాఁడు; ఆతఁడే వేర్వేఱు మూర్తులలో నిల్చునాఁడు" అనెడి తెలివిగల పూజకుని పూజ యెన్నఁడును నరస్పష్టము గాదు. కాఁజాలదు. తత్త్వజ్ఞానసంపన్నుఁడైన పూజకుఁడు విశిష్టమూర్తిని జూచినపుడు ప్రియతమ పరమాత్మప్రకాశమునే చూచి ముగ్ధుఁడై పోవుచుండును. అట్టివేళ వాని హృదయమం దాత్మప్రేమ హద్దుమీఱి పోవును. స్థూలమూర్తియం దాత్మవిభూతిని గాంచుటచే నానందపరవశుఁడైన పూజకుఁడు పూజించుచునే, యీస్థూలమూర్తితో నెన్నెన్ని లీలలు జరుపుచు నిష్కపటబుద్ధితో నన్నియు జరుపును. ఇట్టివారి పూజ యెన్నఁడు నధమపూజ కాఁజాలదు. అదియే యుత్తమపూజ యనఁబడును. అదే బ్రహ్మసద్భావముతోడి యథార్థపూజ.

ఇట్టి పూజయందుఁ గొలఁదియో, గొప్పయో విధిని దప్పుట - యనఁగా నియమపరంపరను మఱచుట సంఘటిల్లినను దాని వలన హాని లేదు.

పూజ్యము నుపాస్యమునైన దాని స్వరూపమును గూర్చిన యెట్టి పరిచయమును లేనంతదాఁక, నది పూజ యే కాదు. మఱియుఁ, బూజనీయ దేవతయొక్క యథార్థ పరిచయము లభించినను బూజ సంభవము కాదు. ఏమనఁగాఁ, బూజకుఁడు పూజవేళఁ బూజ్యముయొక్క సారూప్యలాభము నొందును; అనఁగా నాసమయమందు మఱి పూజ్య పూజక భేదముండదు. ఒకప్పుడట్టి యవస్థ యుండును బూజ యసంభవమే యైపోవును; గనుక రెండు పక్షములందును బూజ దుర్ఘటమే యైనను, జెప్పెడిదేమనఁగా — ముందు చెప్పిన రెండవస్థలకు నడుమనుండియే పూజించుట సంఘటితమగును. సారూప్యజ్ఞానముయొక్క యించుకంత వెల్తియుఁ, బరిపూర్ణతయు ననెడి రెండవస్థల నడుమనుండి. యుపచారముల యపూర్ణరూప పూజ సంఘటిత మగుచుండును. అపుడే దేని విధి నుల్లంఘించుట, పూజాంగ క్రమమందు విఘ్నమును సంభవింపఁగలవు. అట్లే కానీ; అదే సార్థకపూజ. పూర్వాచార్యులు ఇట్టి విధ్యుక్తపూజయే సఫలమని ఘోషించిరి.

మఱికొందఱు మన్ను, ఱాయి, సువర్ణాది ధాతువులు, కొయ్య మున్నగు వానిచే నిర్మింపఁబడిన మూర్తి యెన్నఁడును నీశ్వరుఁడు కాఁజాలదు, గాన మూర్తిపూజ నిష్ఫలమందురు. దీనికి బదులుమాట — నిజముగా మృచ్ఛిలాదులతో నైన మూర్తిమాత్రమే యీశ్వరుఁడు కాఁడు, ఈశ్వరుఁడు

దీనికంటె భిన్నుఁడు; ఇంకను విశిష్టుఁడు ఈశ్వరుఁడు సర్వ వ్యాపియు, సర్వశక్తిమంతుఁడును. "కేవలమూర్తి యెన్నఁడును సర్వశక్తిమంతము కాఁజాలదు. ఈశ్వరుఁడై సర్వ వ్యాపియై సర్వశక్తిమంతుఁడైన వాఁడు, మూర్తిగా లేఁడు." అని యేవిధముగాను ననరాదు. ఘటమే మృత్తిక యనఁబడదు, నిజమే కాని మృత్తికయే ఘటము అనుట పూర్తిగా సత్యము. ఘటము నవలంబించియే పూర్తిగా మృత్తికా జ్ఞానము గలుగఁగలదు. దీనిని స్పృశించి యకుంఠితచిత్తముతో నేను మృత్తికాస్పర్శము చేసితి ననఁగలఁడు.

విశిష్టమూర్తినే యీశ్వరుఁడుగాఁ దలఁచి కూర్చున్న వారు కనిష్ఠాధికారులు. ఈశ్వరుని స్వరూపసంబంధము నెఱుఁగని వారు "సర్వవ్యాపియు సర్వశక్తిమంతుఁడు నైన యీశ్వరుఁడే స్థూలమూర్తిగా సైతము విరాజిల్లుచున్నాఁడు. అతఁడు విశిష్ట మూర్తిరూపములో సైతము వెలయఁగలఁడు;" అనెడి నిశ్చయజ్ఞానము లేనంతఁదాక, మనుష్యుఁడు మూర్తి రహస్యము, నున్నదున్నట్లుగా నెఱుంగ సమర్థుఁడు కాఁడు. విశిష్టమూర్తియందు, సర్వవ్యాపిత్వ సర్వశక్తిమత్త్వాదులైన యీశ్వరధర్మముల మహిమను ప్రత్యక్షము కానంతదాఁక మనుష్యుఁడు, ఉపాసక సాధక పదములతోఁ జెల్లఁడు. ఆతని పక్షమున మూర్తిరహస్యము పూర్తిగా నజ్ఞాతముగానే యుండును. ఇట్టి కనిష్ఠాధికారుల యెదుట మృత్తికా శిలాదులతో నిర్మితమైనమూర్తి మూర్తిమాత్రమే. అనఁగా వారికది యాటబొమ్మయే. కాని, సాధకులై యామూర్తిని సర్వశక్తి మత్త్వాదులతోఁ గూడియున్నట్లు దర్శింప నభ్య సించినవారు, ఈ విశిష్టమూర్తి లోపలనుండియే యీశ్వర

స్వరూపము నవధరింప సమర్థులగుదురు. తేటమాటలతోఁ జెప్పెడి దేమనఁగా, మూర్తిని మూర్తిమాత్రముగానే తలంచి కూర్చుండువాఁ డీశ్వరునకు మిగుల దూరముగానే యుండును, మఱి, యీశ్వర స్వరూపమును మహిమ మండితముఁజేసి దర్శించుటచే, నీజడమూర్తియే యీశ్వరరూపముతోఁ నభీష్ట దేవతారూపముతో నాత్మప్రకాశము చేయును. సాధకుల యభీష్టముల నెఱవేర్చును. "యాదృశీ భావనా యస్య సిద్ధిర్భవతి తాదృశీ."

సచ్చిదానందస్వరూపుఁడు నద్వితీయుఁడునైన యీశ్వరుఁడే జగత్తునకు నిమిత్తోపాదన కారణములుగా నున్నాఁడు. నిజముగా మూర్తి రూపముతో వెలయునతఁడు, జ్ఞాననేత్రము గలవారి కీశ్వరునికంటె నితరమేమియుం గాఁడు. మనబుద్ధి జడత్వమోహముచేఁ గప్పఁబడియుండునంతదాఁక నే మన మేవిధముగాను నీసత్యతత్త్వమును జక్కఁగా నెఱుంగఁజాలము. అంతదాఁక మృచ్ఛిలాదులతోఁ జేయఁబడిన మూర్తి మనకు జడపదార్థముగానే కానఁబడును. ఈజడత్వమోహము దొలఁగించుటకే యార్యర్షులు మూర్తిపూజావిధానమును జేసిరి. "ఇపుడీశ్వరుని యభిన్న నిమిత్తోపాదాన కారణ వశమున మూర్తిపూజయందుఁ బరమేశ్వరుని పూజయే నిష్పన్నమగు చున్నయెడల; మఱి విశిష్టమూర్తి కల్పనము చేయు నావశ్యకత యేమి? కొయ్య ఱాయి మన్ను మొదలగు వానితోనైన నొకవస్తువు నవలంబించి పూజించుటచేతఁగూడ నది యీశ్వర పూజ కాఁగలదా?" యని ప్రశ్నింపవచ్చును. దానికి సమాధాన మేమనఁగా—యథార్థముగా నేదే నొకచోట, నేదే నొక వస్తువును బూజించుటచే నది పరమేశ్వరపూజయే

యగుచుండును. ఈవిషయమున శంకించుట కేమియు లేదు, సరిగాదా, యిది యన్నివిధముల నంగీకరింపఁదగినదే. సాలగ్రామ శిల, బాణలింగము, అశ్వత్థవృక్షము, లేదా, మహాపురుషులచేఁ బ్రతిష్ఠింపఁబడిన యేదేనొక తాతిముక్క, మున్నగు వాని నవలంబించి చేయు పరమేశ్వరుని పూజ, నేఁటివఱకు మనదేశమం దెంతగానో సాగుచున్నది. ఇదే సనాతన ధర్మమందలి విశేషత్వము. ఈశ్వరుని సర్వవ్యాపిత్వ విషయకమగు జ్ఞానము, ఈ దేశ జనులకు మజ్జాగత సంస్కారమై పోయినది. ఏదేని గానిమ్ము; కొయ్య తాయి మన్ను మున్నగు నేదేని పదార్థము నవలంబించి పూజించుటచే నది పరమేశ్వరునిపూజగానే పర్యవసించుచున్నను, మూర్తి ఘటనము తప్పక చేయఁదగినది. సాధకులు నుపాసకులు నీకాష్ఠశిలాదివస్తువులనే, కాళ్లుచేతులు మున్నగు నవయవములతో విశిష్టమూర్తి రూపములుగాఁ బరిణమింపఁజేసి పూజించుటచేతను విశేషసార్థకత కలదు, ఆకాశమువలె సర్వవ్యాపియైన యీశ్వరుఁడొక తత్త్వమాత్రమే కాఁడు. ఆకాశమువలె నొక జడవస్తువే కాఁదు, అతఁడు చైతన్యమయుఁడు. అతనియందు సర్వేంద్రియ ధర్మములు నున్నవి. ఆతనికి వ్యక్తిత్వమున్నది. ఆతఁడు నిగ్రహానుగ్రహ సమర్థుఁడు. ఆతఁడు కరుణావరుణాలయుఁడు. అతఁడు సకలకల్యాణ గుణనిధి. అట్టి యతని ననాయాసముగా ననుభవించుటకొఱకే హస్తపాదాదులైన యవయవములతో నావిశిష్టభావముల సముద్దీపించు విగ్రహములు పరికల్పితములగుచుం ను. పరమేశ్వరుని చైతన్యమయత్వము దయామయత్వము మున్నగువాని యుపలబ్ధి విషయముననను, సాధకుల లో, వెలి భేదజ్ఞానమును దొలఁగించువిషయముననను,

నీమూర్తిపూజను బోలిన సహజమైన యప్రయత్నసాధ్యమైన యుపాసన మఱియొకటి కాఁజాలదని తెలియును.

ఇపుడు మనము బహ్వీశ్వరవాదమును, విగ్రహ సంబంధమునుగూర్చి రవ్వంత యాలోచింతము. సచ్చిదానంద స్వరూపబ్రహ్మము శక్తి యనంతము. ఈ దేవదేవీమూర్తులును నసంఖ్యములే. ఒక్కమనుష్యుఁడే వంటవాఁడు, పాఠకుఁడు, గాయనుఁడు, శిక్షకుఁడును గాఁగలుగునటులే యొక్క బ్రహ్మమే - పరమాత్మయే విభిన్నశక్తుల నెడి యుపాధి సహయోగముతో, ననఁగా నుపాధులతోఁగూడి విభిన్న దేవదేవీ మూర్తులతో నభివ్యక్తము కాఁగలదు. వాస్తవముగా నిందు బహ్వీశ్వరుల నంగీకరించుట కాదు. సనాతన ధర్మతత్త్వ సంబంధము నెఱుంగనివారును, వేదాది ధర్మశాస్త్ర రహస్యముల నెఱుంగఁజాలనివారలే సనాతనధర్మ సంప్రదాయమందు బహు దేవదేవీమూర్తుల నుపాసించుట చూచి, సనాతన ధర్మావలంబులను బహ్వీశ్వరవాదులనియు, పౌత్తలికులనియుఁ దలంతురు. అక్కటా! వైదికార్యజాతి తఱచుగా నేఁడాది పోడుగునను వేర్వేఱుమూర్తులనవలంబించి వేర్వేఱుపూజార్చనాదులు చేయుచున్నను ఏకేశ్వరవాదియే. అమ్మహాపురుషులు పొరపాటున నైనను బహ్వీశ్వరకల్పనముఁ జేయఁజాలరని వారెఱుఁగరు. అద్వైతదర్శన మొక్కటే సనాతన ధర్మావలంబుల సొమ్ము. సచ్చిదానందస్వరూపము, నద్వయము నైన బ్రహ్మమే దృశ్యవస్తుమాత్రమునకు నిమిత్తోపాదాన కారణమనెడి మాటను రోమరోమకూపములతో ననుభవించువారు, బహువిగ్రహముల పూజ చేసినను బహ్వీశ్వరవాదులును పౌత్తలికులును గాఁజాలరు.

నాయనా! పుత్తలీపూజచేసి పుత్తలి లోను, వెలిని గేవల చైతన్యసత్తాదర్శనమేయైనపుడు స్వప్రకాశము సర్వవ్యాపియు నైన చిత్సత్తయొక్క యనుభవమేయైనపుడు మఱి పౌత్తలికత కును, బహీశ్వరబోధమునకును దావేదీ? ఈమాటయే మఱింత తెలియఁజెప్పెదను. యథార్థముగా విగ్రహపూజ చేయునివార లీశ్వరుని జగత్తుకంటె వేఱుగాను, జగత్కర్తగానుమాత్రమే కనువారలే యథార్థపౌత్తలికులు. (నిజమైన బొమ్మలాటకాండ్రు) "పరమేశ్వరుడు కేవల జగత్కర్తయేగాడు. జగదుపాదాన కారణముగాను నున్నాడు." అనెడి తత్త్వము నంగీకరించి యనుభవింప శక్తిలేనివారే యీశ్వరుని జగత్తునం దేదోయొక విశిష్టవస్తువుగాను వ్యక్తిగాను ననుభవింపఁజూతురు. ఇంటి యజమానులు ఇంటికంటెను బూర్తిగా వేఱైనట్లు, జగత్కర్తయైన వాఁడును జగత్తుకంటెఁ బూర్తిగా వేఱే యనెడి బాలిశోచితాజ్ఞానము బొత్తిగాఁ దొలఁగనివారే నిజమైన బొమ్మపూజరులు. కారణమేమనఁగా, జగత్తుకంటెఁ బూర్తిగా వేఱయి, తానే జగద్రూపముతోఁ బ్రకాశింపనివాఁడు నైనవానిని నిర్గుణుఁడే యనుము. దయామయుఁడు, ప్రేమమయుఁడు, నవంతశక్తిమయుఁడే యనుము. అతఁడొక విశిష్టపదార్థమే. విశిష్టపదార్థమన్నను విగ్రహమన్నను నొక్కటే. ఏదేనొక విశేషముతోఁ గూడి, యనఁగా ధర్మగుణములతోను మహాత్మ్యగుణములతోను గూడిన యేదేనొకవస్తువును జగత్కర్తమాత్రముగానే యనఁగా జగత్తుకంటె స్వతంత్రరూపముగాఁ గనుటచేఁ, నది బొమ్మను జూచు పనియే. కాని సనాతన ధర్మావలంబుల పక్షమున నిట్టి దోషమున కవకాశము లేదు. ఏమనఁగా, నీ పక్షమున నీశ్వరుఁడు జగదుపాదాన కారణముగానున్న హేతువునను, సర్వ

వ్యాపియు చైతన్యమయుఁడు నైనందునను, సర్వవిశేష ములుగా నయియున్నను, దన నిర్విశేషస్వరూపమున నిల్చి యుండు సామర్థ్య సుయోగము గలదు కావున, విగ్రహారాధ నము చేయకపోవుటచేతనే బొమ్మ పూజరితనమునుండి విడి వడుట కాదు. మఱియు మృత్తికా శిలాదులతో నిర్మింపఁబడిన బహుమూర్తుల పూజలు చేయుచున్నను "ఏకమేవా ద్వితీ యమ్" తత్త్వమును జక్కగా ననుభవించు యోగ్యత గల్గును. సాధారణదృష్టిచేఁ బురాణాదులందు భిన్నభిన్నముగా నీశ్వ రులవర్ణనమును గనుచున్నాము. ఎటులనఁగా — శివపురాణ మందు శివశ్రేష్ఠతయు, దానినిబట్టి తక్కదేవతల న్యూనతయు వర్ణింపఁబడినది. శాక్తోపనిషత్తులందును, దంతశాస్త్రము లందును శక్తిశ్రేష్ఠతయు, శివాదిదేవతల న్యూనతయు వర్ణిం పఁబడినది. విష్ణుపురాణాదులందు విష్ణునియో కృష్ణునియో ప్రాధాన్యమును శక్తియుఁ దక్కిన దేవతల న్యూనతయు వర్ణిం పఁబడినది. ఈవిధముగా సౌరపురాణమందు సూర్యునియు, గణేశపురాణమందు గణేశునియుఁ బ్రాధాన్యమును దక్కిన దేవతల న్యూనతయుఁ బ్రతిపాదింపఁబడినది. ఇట్టి పరస్పర విరోధిశాస్త్ర వాక్యములను జూడఁ బలుతెఱఁగుల సంశయ ములు పుట్టఁగలవు; కాని యించుకంత ధీరముగాఁ బర్యాలో చించినచో నిట్టి సంశయములకుఁ గారణమే లేదు. ఏలన— ఏశాస్త్రమందు ఏదేవతయొక్క ప్రాధాన్యము చెప్పఁబడినదో ఆశాస్త్రమం దా దేవతయే కారణబ్రహ్మముగా గ్రహింపఁ బడినది. సనాతనశాస్త్రములందు విశేషించి గుర్తింపవలసిన విషయమేమనగా, అంతటను గారణబ్రహ్మ మొక్కటే. సర్వ రూపములతో, ఉపాస్య రూపముతో, ఉపేయ రూపముతో

వర్ణింపఁబడెను; పరిగ్రహింపఁబడెను. దానిని బట్టి కార్య బ్రహ్మము న్యూనముగాను అనుపాదేయముగాను వర్ణింపఁ బడినదనెడి తత్త్వమందు స్థిరమైన లక్ష్యము నుంచుటచేతనే భిన్నభిన్న శాస్త్రములందలి పరస్పర విరోధివాక్యముల సమీమాంసయై పోవును. శివుఁడు శ్రేష్ఠుఁడుగాను, దక్క-దేవతలు న్యూనములుగాను వర్ణింపఁబడుట కానఁబడుచోట శివుఁడు కారణబ్రహ్మముగాను నుపాస్యతత్త్వ రూపముగాను బరిగ్రహింపఁబడె ననియు, ఆ తక్కిన దేవతలు కార్యబ్రహ్మ రూపమున — అనుపాదేయ తత్త్వరూపమున వర్ణింపఁబడె ననియు దెలిసికొనవలెను. ఇటులే శక్తి, విష్ణువు, సూర్యుఁడు గణేశుడు మున్నగు దేవతల ప్రాధాన్యా ప్రాధాన్యస్థలములం దును దెలిసికొన వలయును. సరియైన మాట యేమనఁగా, దేనివలన విశ్వము గల్గినదో, దేనియందున్నదో, దేనియందు లీనమైపోవునో అదియే జగత్కారణము. (కారణబ్రహ్మము) అదే ఈశ్వరుడు. అదే యుపాస్యము. అన్నియు దానినుండియే పుట్టినవి; దానియందే యున్నవి; దానియందే లీనమగును. కను కనే శివ విష్ణు శక్తి గణేశాది దేవతలయందు దత్త్వదృష్టిచేత నెట్టికొలఁదులు లేవు. అన్నియు (ఎల్లరును) నొక్క యద్వి తీయ సచ్చిదానందస్వరూప బ్రహ్మముయొక్క విలాసమే. వీరిలో నెవరినో యొకరిని బూర్ణబ్రహ్మస్వరూపముగా గ్రహిం చుటచేతనే తక్కు దేవతాగణము వాని శక్తివిశేషము లగును. అనఁగా న్యూనములగును. ఇందు వాస్తవికమైన హానిరవ్వం తయు లేదు. కారణమేమనఁగా, శివ విష్ణ్వాది నామములును, ఆ విభిన్నరూపములును బ్రహ్మముయొక్క యథార్థస్వరూప ములు కావు. ఈ నామరూపములన్ని బ్రహ్మలాభమునకైన

యుపాయములే. బ్రహ్మస్వరూపము తెలుంగు విషయమున నీ నామరూపము లెల్ల సర్వప్రభావావలంబనములే.

తండ్రి యొక్కఁడే, పలువిధములైన బాల్యాది వ్యవస్థలు మాఱినను, కూర్చుండుట, నిల్చుండుట, పడుకొనుట మొదలగు నవస్థలయందున్నను గడియకొక విధమైన దుస్తులను మార్చుచుండినను నతనిబిడ్డల కాతఁడు ప్రత్యేకావస్థయందును, ప్రత్యేక వేషమందును దమతండ్రి యొక్కఁడే యనెడి స్మృతి కలుగుచుండినటులే, భిన్న భిన్న దేవ దేవులను దర్శించునపుడు సాధకులకు నాయందు బ్రహ్మవస్తు స్మృతియే యగుచుండును. పంచదార యొక్కటే. పండు, చిలుక, గుఱ్ఱము, ఇల్లు మొదలైన యచ్చులలో గరగించి పోయఁబడి వేర్వేఱు రూపములతో, రంగులతోఁ గానఁబడినను నన్నింటియందును బంచదారయే తోఁచుచుండునట్లు, సాధకోపాసకులకు వేర్వేఱు నామరూపములందును బ్రహ్మమే స్ఫురించుచుండును. కావున నే యీ సనాతనజాతి బహు దేవ దేవీపూజలు చేయుచున్నను నేకేశ్వరవాదియే యని చెప్పితిని సనాతన ధర్మము బహ్వీశ్వరకల్పనము నేవాఁడునుం జేయఁజాలఁడు. చిన్నపిల్లలకే పంచదారబొమ్మలు వేర్వేఱుగాఁ గానవచ్చునుగాని, వయోవంతులకట్టి భేదజ్ఞాన ముండఁజాలదు. వారన్నింటినుఁ బంచదారనే చూతురు. ఇక్కాలమందలి శిక్షాదోషముచే ధర్మసంప్రదాయమందుఁ బరస్పర విద్వేషభావములు కానవచ్చుచున్నను, నవి బహ్వీశ్వరవాదమును బోధించు ప్రమాణములు కావు. ఈ విద్వేషభావము అనభిజ్ఞతాఫలమే. సనాతనధర్మముయొక్క యథార్థస్వరూపము ప్రతిభాసించువారియం దిట్టి విద్వేషభావములు రవ్వంతయుఁ గానఁబడవు.

విశేషమేమనగా — ఎన్నాళ్ళు మనము విగ్రహములుగా నుందుమో, ఎన్నాళ్లీ జడదేహమునే యాత్మగా ననుభవించుచుందుమో యన్నాళ్లును నోటితో నెన్ని పెద్ద పెద్ద మాటలాడినను ఈశ్వరుఁడు మనకుం బుత్తలికంటె మఱేదియుం గాఁడు. నిర్గుణుఁడు, సర్వవ్యాపి, సర్వశక్తిమంతుఁడు, అనంతుఁడు, నిరంజనుఁడు మున్నగు మాటల నుచ్చరించుచున్నను, నీశబ్దముల సత్యార్థము హృదయంగమము కాదు. సరిగానున్నది యున్నట్లు పరమాత్మ స్వరూపోపలబ్ధి కానన్నాళ్లు నీ సర్వశబ్దములును నస్ఫుటముగా బుత్తలీ భావమునే పరిచయము చేయుచుండును. ఏదో నొక ప్రతిమ నవలంబించుటచేత నీశ్వరుని మహత్త్వ చింతనము ననుభవమునుం గాఁదగిన యంత సహజ సాధ్యమగుచుండును—కనుకనే పూజ్యపాదులైన ఋషులు ప్రతిమాపూజనుం బ్రవర్తింపఁజేసిరి. ఒక్కసారి స్థిరదృష్టితో లక్షించిన యెడల నీజగత్తునందలి చిన్న పెద్ద పదార్థములెల్లఁ బ్రతిమలే. పుత్తళులే. అనఁగాఁ బ్రతిబింబములే. చిత్ప్రతిబింబమే జగదాకారముతో నాకారితమై యున్నది. ఈ ప్రతిబింబములకు బింబమై, అనగా నీజగత్తునకుఁ గారణమై యున్నదానినిఁ బట్టుకొనుటకు (తెలిసికొనుటకై) ప్రతిబింబము లోపలనే యుండి తెలిసికొన వలెను. దృశ్యరూపముతో, గ్రాహ్య రూపముతో, ఉపాస్యరూపముతోఁ బరమేశ్వర స్వరూపము నెఱుంగుటకు శ్రమపడుచున్నంతదాక, స్థూల సూక్ష్మ ప్రతిమారూపముతోనే ప్రతిభాత మగుచుండును. కారణమేమనఁగా దృశ్య(గ్రాహ్య) వస్తువులెల్ల పుత్తలులకంటె వేఱేమియుం గావు. కనుక సంతతముఁ బూర్వమును హస్తపాదాద్యవయవ విశిష్టములైన ప్రతిమలనుఁ దత్త్వదృష్టితోఁ

జూచుచుఁ బూజింపకుండుటచేతనే పరిత్రాణము కలుగకున్న దంటిని.

జ్ఞానలాభమయ్యేనేని, అనఁగా అమూర్తవస్తు సంధాన మందెనేని, మఱి మూర్తి పూజవలన నెట్టి ప్రయోజనమును నుండదనెడి వారిమాట శిరసావహింపవలసినట్లుండును. వారు దేని నమూర్తస్వరూప మనుకొనుచున్నారో యదియును మానస ప్రతిమ కాదా! మనసునందగు బ్రహ్మాకారవృత్తి హస్త పాదాద్యవయవములతోడి విశిష్టమూర్తి కాకున్నను, మానస ప్రతిమకంటె మఱేమియుంగాదు. ఒకవేళ మానస ప్రతిమయే శ్రేష్ఠమన్నను నది స్థూలమూర్తినింబట్టి చూఁడగా స్థూలమును, సూక్ష్మమును నగునని యొప్పుకొనుచున్నాము. కాని స్థూలసూక్ష్మ భేదజ్ఞాన ముండుసంతవఱకు యథార్థమైన యమూర్త వస్తుస్వరూపము తెలియలేదన్న మాటయే. ఎటులైన నిదియు నంగీకరింపవలసినదే. "బాహ్యప్రతిమకంటె నాంతరప్రతిమ శ్రేష్ఠము" అను నిట్టి జ్ఞానముండుసంతవఱకు నది యజ్ఞానములో నిమిడిపోయినదే. ఔరా! ప్రతిమ యెన్నఁడైనను బాహిరమైనదగునా? కాఁజాలునా? సర్వము నాంతరమే, ఈ విశ్వములోపల నున్నదే. వెలుపల నేమియు లేదు. అంతే కాదు, బాహ్యమను పేరితో నేదియును లేదు. ఈ సత్య జ్ఞానము మనకుఁ గలుగనన్నాళ్లు, ఆంతర బాహిరజ్ఞానముండు నన్నాళ్లు, తెలిసియో తెలియకో యేదేనొకవిధమున బ్రతిమా పూజ చేయుటయే యగును. తొలఁగింపరాని మన యీ యజ్ఞానమును దొలఁగించుటకు సులభోపాయము నున్నచో, నది యీ స్థూల ప్రతిమాపూజయే. ఇది పరీక్షిత సత్యము. ఇది

చిరంతనసత్యము. ప్రతిమాపూజయే సనాతనధర్మముయొక్క విశిష్టత. ఏవిధముగానైన నిది యంగీకరింపక తప్పదు.

కొందఱు—జడములనుఁ బూజించియే, యనఁగా శిలాకాష్ఠ మృత్తికాదులనుఁ బూజించియే యీ విరాట్ సనాతనజాతి జడమును, అలసమును, అకర్మణ్యమునై పోయిన దందురు. అట్టివారి నొకసారి—"అయ్యా! ఏ దేశములవారిని జడులు కారని తలంచుచున్నారో, వారు కేవగళ్లు దేనిని బూజించుచున్నారు? చైతన్యమునా? జడమునా?" అని యడుగవలసి యున్నది. పోనిండు; పరచర్చ మనకేల? ఇక్కాలమున సనాతనజాతియందుఁ గానఁబడు జడత్వము మూర్తి పూజాఫలము కాదు. మూర్తియందుఁ జైతన్య దర్శనము లేని ఫలమే. ఈదేశము—ప్రతిమలు జడపదార్థములే యనియు వానినిఁ బూజించి మనుష్యులు జడత్వము నొందిన దనియు నేనాఁడు విన్నదో, యానాటనుండియే. యీ దేశ జనుల చైతన్యదృష్టిని మెల్లమెల్లగాఁ విప్ప నారంభించినది. మఱి కాలధర్మమునకును నొక ప్రభావముగలదు. ఇది మహా జడత్వముతోఁడి యుగము. ఈ యుగమందలి మనుజులకు జడ దృష్టియే మిగుల బలవతిగానున్నది. ఈజగత్తు ప్రాణమయము చైతన్యమయము. ప్రాణమును, చైతన్యమును మీఱి మఱి యొక వస్తువే లేదు. చైతన్యమే జడరూపముతో ప్రతీయమాన మగుచున్నదనెడి శిక్షను భారతీయులు పలునాళ్ళనుండి కోల్పోవుచున్నారు. కనుకనే యీ జడత్వము, ఆలస్యము, అకర్మణ్యతయు నీ సనాతన జాతిపై నాధిపత్యము విస్తరింపఁ జేసినవి. తొల్లింటి భారతర్షి జనులు ఇక్కాలసవచ్చు అగ్ని, జలము, వాయువు, చంద్రుఁడు, సూర్యుఁడు, ఆకాశము,

వృక్షములు, సముద్రములు, నదులు, పర్వతములు మున్నగు స్థూలపదార్థముల నవలంబించియే పరమేశ్వరు నుపాసించిరి. కాని యా పూజ్యపాదర్షుల నెవ్వరును జడులని, యలసులని, యకర్మణ్యులని తిరస్కరింప సాహసింపలేరైరి. మఱి వర్తమానకాలమందు ఈ స్థూలప్రతీకముల నన్నింటిని, అనగా అగ్న్యాదులకు విశేషమూర్తిని ఘటించి పూజించుచున్నారు. అదియే యిప్పటి జనసమూహమును జడత్వమోహముతో గప్పివేసిన దందురు. ఇది శ్రద్ధ వహింపరాని మాట. అగ్ని కేవల జడాగ్నిగాదు. ఇది ప్రత్యక్షాగ్ని దేవుఁడు. జలము కేవల జడజలము గాదు. ఇది ప్రత్యక్ష వరుణదేవుఁడు. సూర్యుఁడు కేవల జడజ్యోతిస్సమూహము కాదు అతఁడు ప్రత్యక్ష సూర్యదేవుఁడు. సృష్టి స్థితి ప్రళయ శక్తులు కేవల జడశక్తులు కావు. ఇవే ప్రత్యక్ష బ్రహ్మ విష్ణు మహేశ్వరుల నెడి యీ సర్వతత్త్వములను జక్కఁగా నవధరింపఁ జేయుటకే యీ సర్వమూర్తుల ఘటనమైనపుడు వానియందజ్ఞానవిషయము మేమియుండఁగలదు? మనము శిశువులము. మనబుద్ధి వృత్తి పూర్తిగా వికసింపలేదు. కనుక మనము భ్రమ ప్రమాదములు లేని పితృపితామహాదులయు, పూజ్యులైన మహర్షులయు విధానముల సార్థక్యము నెఱుంగలేకున్నాము. కనుక వారి విధానములు మనకు నిందనీయములైనవని మొగమాటము వీడి తిరస్కరింపవలసి వచ్చినది. ఏదియెట్లైనను ఈ దేశము మఱల మేల్కొనును. మఱల జైతన్యదృష్టి సంపన్నము కాఁగలదు. ఈ స్థూలమూర్తులఁ బూజించియే యీ దేశము మఱల నమూర్తసత్తయొక్క యనంతమహిమమును ఘోషింపఁ గలదు.

శాస్త్రకారులు — ఆవుపాలు దాని సర్వాంగములందును వ్యాపించి యున్నను, దాని పొదుగునుండి మాత్రమే పాలు కాఱునట్టులే, ఈశ్వరుఁడు సర్వవ్యాపి యయ్యును కేవల ప్రతిమలలో నుండియే తన విశేషప్రకాశమును బరిలక్షితము చేయుచుండును. మనమెల్లప్పుడును వాయుసముద్రమందే నివసించుచున్నాము. అయినను గ్రీష్మసంతాపము తొలఁగుటకై యీ వాయుసముద్రమందే విసనకఱ్ఱ మున్నగువాని సహాయముతో నొక విశిష్ట వాయుప్రవాహమును బుట్టించుచున్నాము. అటులే యీశ్వరుఁడు సర్వవ్యాపియైనను, దానిని విశిష్టభావముతో భోగించుటకై ప్రతిమాదులైన పెక్కింటి నవలంబించి పూజోపాసనాదులను జేయుట యావశ్యకము. గీతయందు భగవంతుఁడు తానే — "సర్వవ్యాపి జలప్లావనము లభించునంతదాఁక, బావి కోనేరు మున్నగు నీటిపట్టులనుండి జలమును దెచ్చుకొనియే స్నానపానాది కార్యములు నెరవేర్చుకొనుట యగు" ననెను. సరిగా నిట్టులే బ్రహ్మసద్భావమందు, అనఁగాఁ గైవల్యావస్థయందుఁ జేరునంతదాఁక, వేదోక్త కర్మకాండ సహాయముననే, సర్వవ్యాపి పరమేశ్వరుని విశేషాభివ్యక్తి ననుభవించుట కావలయును. (తప్పదు) జ్ఞానులే కానిమ్ము; అజ్ఞానులే కానిమ్ము; నిష్కామముగానో సకామముగానో పూజాది శాస్త్రవిహితకర్మములను దప్పక చేయుటయే స్వాభావికము. ఈమాట చెప్పనేదేమి? ఏమయినను, ఇపుడీ భీషణ జడత్వయుగమందు ఈ ఘనాజ్ఞానయుగమందు సైతము పలువురు ధీమంతులు, చైతన్యమయ మూర్తిపూజ చేసియే, తమ్ముఁ గృతార్థులుగాఁ దలంచుచున్నారు.

మన దేశమునఁ బూజింపఁబడుచున్న కొన్ని విశిష్ట మూర్తుల పరమార్థ రహస్యమును ముఖ్యముగను వివరింతును.

## మంత్ర రహస్యము

వెనుకటి పరిచ్ఛేదమందు, దేవమూర్తులన్నియు సత్యదర్శి ఋషుల ధ్యానమందు లభించిన శక్తివిశేషముల ఘనీభూతవికాసము లేయని చెప్పఁబడినది. బీజమంత్రసమూహము కూడ నావిధముగానే జ్ఞానలబ్ధములైన శక్తి విశేషముల సూక్ష్మతమ శబ్దావయవ వికాసములే. శక్తియు శబ్దమును అవినాభావసంబంధము గలవి. (శక్తియుండుచోట శబ్దమును, శబ్దముండుచోట శక్తియును నుండునన్నమాట) ఏసూక్ష్మతమ శబ్దము నవలంబించి యెట్టి శక్తి యుద్బుద్ధమగునో, యా శబ్దము ఆ శక్తివిశేషముయొక్క బీజమాత్రము. అతిసూక్ష్మమైన వటబీజమునుండి (మఱ్ఱివిత్తునుండి) సువిశాలమైన మఱ్ఱిచెట్టు వెలయునట్టులే సూక్ష్మతమనాదము వల్లనే మహాశక్తి వికాసమగుచుండును. ఆధునిక విజ్ఞానవిధులుకూడ 'శబ్దతరంగము నవలంబించియే శక్తివికాస మగునందురు. అప్పు వారు శక్తిని జడపదార్థముగానే తలంతురు. కావున శక్తి నుద్బోధించు సూక్ష్మనాదము–బీజమంత్ర సమూహము వారికి జడశబ్దమాత్రమే; కాని మనము – శక్తి చిన్మయియనియు, శక్తియే యాత్మ (అమ్మ) యనియు, శక్తియే పరమేశ్వరుఁడనియు నెన్నుదుము. కావున శక్తి నుద్బోధించు బీజమంత్ర సమూహము సైతము చైతన్యమయమే. నాదమొక కొన్ని వర్ణముల సమష్టియే. ఏవర్ణములను గలిపి యుచ్చరించుటచేత నెట్టితరంగములు పుట్టునో, మఱి యెట్టి శక్తియొక్క ప్రాకట్య

అప్పుడా దేవతాస్వరూపము తెలియఁబడును. ఏకోరికయైనను దేవతానికటమందుఁ బూర్ణమై దాని నందికొను సామర్థ్యలాభము గలుగును. ఎటులైనను మంత్రచైతన్యము మున్ను చెప్పినట్లుగానే యగుచుండును. తొలుదొల్త వినునప్పు డివి యెంతో దురూహ్యకార్యములుగానె తోచినను గురూపదిష్టమైన యుపాయముచే ముందడుగు వేయుచుఁ బోఁగా, నది యంత కష్టసాధ్యవిషయము కాదు. మఱియొక సదుపాయ మేమనఁగా, నెవ్వని కేదేని మంత్రము చైతన్యమయ మగుచో వాని విషయమునఁ దలఁచుగా సర్వమంత్రములును జైతన్యమయము లగుచుండును. స్తవము, వందనము, ప్రణామము, మున్నగు మంత్రపాఠమేదేని గానీ, యన్నియుఁ జైతన్యమయము లగును. పూజకుఁడు తాను చైతన్యమయుఁడగునేని, యనఁగా నే చైతన్యసత్తచేఁ దన సత్తయు, జగత్ సత్తయు నగునో యా చైతన్యసత్తానుసంధాన మొనని కగునో వానికి సర్వమంత్రములును జైతన్యమయములే యగును. మఱవరాని విషయము — మన ముచ్చరించు మంత్రములు చైతన్యమయములు కాకయుండునన్నాళ్లును బూజాది విధ్యుక్తకర్మముల వలన ఆశానురూపఫలము నందుట కాదు.

మఱియొక్క మాట చెప్పవలసియున్నది — మంత్రమున కెన్నఁడు ననువాదము తగదు. ఏ భాషయం దే మంత్రము పుట్టినదో ఆ భాషనుండి మఱియొక భాషలోనికది పరివర్తింపఁ బడుటచే మంత్రమునకు మంత్రత్వము మఱియుండదు. అనఁగా మంత్రమునకు యథార్థశక్తి యుండదు. కావున మంత్రము ననువదించి పఠించుటయు, జపించుటయు నిషేధింపఁబడినది. మఱి, యాధునికమైన యేదేనొక మంత్రమును బట్టి చూడఁగా,

ప్రాచీనకాల మంత్రములు సమధిక శక్తిమంతములు. ఏమన, బహుకాలమునుండి యసంఖ్యసిద్ధమహర్షుల నోర నీమంత్రములెల్ల నుచ్చరింపఁబడుచు వచ్చుచున్నవి. వారి నోర నుచ్చరింపఁబడి చైతన్యమయములైన మంత్రముల నుచ్చరించుట వలనఁ బుట్టెడి శబ్దతరంగములు మన దేశమందలి వాయుగగనమండలములందు నిండిపోయినవి. కావున మహర్షులనోర నుచ్చరింపఁబడిన మంత్రసమూహము సమధికశక్తిసంపన్నమును, శీఘ్రఫలప్రదము నగుచుండును. అపుడు చేతనపురుషుల మాటలు స్వతంత్రములు. చేతనపురుషులు ఆధునికులే కానీ; ప్రాచీనులే కానీ; వారి నోర నుచ్చరింపఁబడిన శబ్దమాత్రము చైతన్యమయమును శక్తిమంతము నగుచుండును.

మంత్రోచ్చారణము విషయమునఁ గొంచెము చెప్పవలసియున్నది. ఇచట నాదతత్త్వసంబంధమున సంక్షేపాలోచనము తప్పనట్లు తోఁచుచున్నది. నాదతత్త్వమందు మునుఁగఁగలుగునప్పుడే బ్రహ్మదర్శనము (అమ్మరియొడని గూర్చుండును) యగును. ఇదెట్లు సంభవము? తొలుత నీ జగత్తు బ్రహ్మము కల్పనమే. కల్పనయే మనసువని. శబ్దము లేక కల్పనము కాదు. జగత్తునందు శబ్దమే లేకున్నఁ గల్పనమనుట కేమియునుండదు. మనస్సు కొన్ని శబ్దముల ననుచింతనము చేయుటే కల్పనము. బ్రహ్మము కల్పనము చేయుట పేరే కొన్నిశబ్దములను గల్పించుట శబ్దమయ మానసకల్పనముగానే యీ జగత్తయినది. కనుకనే యీ జగత్తు శబ్దమయము.

జగత్తునందలి వస్తువులకు సాధారణ నామము పదార్థము. పదమునకుఁగల యర్థమే పదార్థము. ప్రత్యేకపదము నొక్కొక్క యర్థమే. ఈ యర్థము ఐశ్వరిక సంకేతికార్థము

ఈ శబ్దముచేత నిట్టి యర్థము ప్రతీతమగును. వేది యొక్క యనాదిసిద్ధ సంకేతము. "వృక్షము" ఒక శబ్దము. కొన్ని వర్ణముల సమష్టి. మనసునందు నొరసునది ధ్వని రూపమున వెలయును. కనుకనే వ్యాకరణమతముచేత నా శబ్దమన్నది కేవల వర్ణముల సమష్టి కాదు. ధ్వని స్వరూపము. వృక్షపదార్థ మొక యనాదిసిద్ధమైన సంకేతము. "వృక్షము" అనినంతనే పత్రశాఖాములతోడి యొక్క వస్తువు ప్రతీతమగును. ఏదే నొక వస్తువు నవలంబించి నెమ్మదిగా నా సమయమందగు మానస వ్యాపారమును లక్షించుటచేత సర్వపదార్థములు నొక శబ్దమయ భావముకంటె వేఱేమియుంగాదని యెల్లరకు దెలియఁగలదు. శ్రుతియు "వాచారంభణం నామధేయం వికారః" అన్నది. ఈజగత్తు కొన్నిశబ్దముల సమష్టిమాత్రమే. వేదాంత మతముచేత నీజగత్తు నామరూపమాత్రమే. నామము వాస్తవముగా శబ్దము (నాదము) తక్క మఱేమియుంగాదు.

ఈ నాదము రెండు తెఱఁగులది. ధ్వన్యాత్మకము, శబ్దాత్మకము. ఘంటా శంఖాదులవలనఁ బుట్టు నాదము ధ్వన్యాత్మకము. దానిచేసైతము జీవులందు సంతోష విషాద కోపాదు లుద్దీపించును. కురుక్షేత్రయుద్ధమునఁ బాండవపక్షమునుండి పుట్టిన శంఖనాదము ధార్తరాష్ట్రుల హృదయములను విదారించినది. జడయంత్రాదులనుండి వెడలు నీ నాదమునకే యిట్టి సామర్థ్యముండఁగా; చేతనయంత్రమునుండి (జీవకంఠమునుండి) వెడలు నాదము శబ్దమయమగుట నది జగత్సృష్ట్యాదులను జేయఁగల్గు నన్నచో విచిత్ర మేమున్నది? దుర్యోధనుఁడు "సూచ్యగ్రే భూర్న దాతవ్యా వినా యుద్ధేన కేశవ" అనెను. ఈ యొక్క వాక్యముచేతనే భారతమందలి రాజు లెందఱో

స్వేచ్ఛాపూర్వకముగా మిడుతలవలె సమరాగ్నియందు ఆత్మాహుతు లిచ్చిరి. ఇట్టి వెన్నో దృష్టాంతములు. శబ్ద మొక్కటే యుచ్చారణభేదముచే వినువారి మనస్సులందు వేర్వేఱు భావములను బుట్టించును. ఇదియు నెల్ల రెఱింగినదే. ఇదే జగత్తునందలి నియమము. కొన్ని శబ్దములవల్లనే యీ జగత్తు రచియింపఁబడినది. కొన్ని శబ్దములవల్లనే నడుచుచున్నది. కొన్ని శబ్దములవల్లనే దీని ప్రలయమగును. ఈ జగత్తు కొన్ని శబ్దములు తక్క మఱేమియునుగాదు.

ప్రత్యేక పరమాణువునకును నొక స్వాభావిక శబ్దమున్నది. దానివల్లనే యీ పరిస్పందనము నెఱవేఱును. స్పందనములు చేరుట యెడయుట యొక్క విచిత్రత కారణముగానే, యీ విచిత్ర జగత్తు వికసించుచున్నది. ఈ స్వాభావిక శబ్దము మన 'అకారము' నందిది. అకార మొక తానముతో నొకస్వరమున దీర్ఘప్లుత భావములతోఁ బలుకఁబడినపుడెట్టులో యట్టులే యీ జగత్తుయొక్క మూల — స్వాభావిక నాదము సైతము నగును. అదే ఆదిమశబ్దము. మఱియు 'అ'కారమే ప్రయత్నస్థానములైన పెదవులు కంఠము దౌడలు మున్నగువాని విన్యాసభేదములను ఇకారోకారాదులైన రూపాంతరముల నొందును. భగవంతుఁడును 'అక్షరాణా మకారోఽస్మి' అక్షరములందు నేను 'అకారము' ననెను. బ్రహ్మయందు జగత్సృష్టి విషయిక కల్పన యుగునపుడా 'అ'కారము విశేష భావనలతో స్పందితము లగును. అపుడది దీర్ఘప్లుతమైన 'ఉ' కారమువలె ధ్వనించును. సృష్టికల్పన పరిసమాప్తమగునపుడు అనఁగా 'బహు స్యామ్' అనెడి సంకల్పము 'స బహు స్యామ్' అయిపోవునపుడు ఆ వ్యక్తమైన స్పందనముకూడ శుద్ధమై

పోవును. అపుడది 'మ్, మ్, మ్' అను నిట్టిశబ్దముగా మాఱి పోవును. ఇదే 'అ-ఉ-మ్'=ఓమ్, సృష్టియొక్క మొట్టమొదటి నాదము. సాధకుఁడు కర్ణవృత్తి నడ్డగించికాని, మఱియొక ప్రక్రియచేతఁగాని యీ నాదము ననాహత కేంద్రమునుండి వినఁగలఁడు. జగద్వ్యాపియగు నా నాదము ఆకర్షణమయము. మఱిపోఁగొట్టి సర్వమును మఱపించు 'ఓమ్' శబ్దమువలన - బ్రహ్మమును, అంగీకారమును, ఆహ్వానమును, స్మరణమును దెలుపు దానివలన అమ్మ యస్తిత్వాంగీకార మొకసారి, స్నేహముగ్ధమైన పిలుపొకసారి, స్వస్వరూపస్మృతి యొకసారి, యిట్టులనేకభావములు లోలోన పొడకట్టును. నిజముగా నా చెవిలోపలి మర్మమందెవ్వరో దూరి నా ప్రాణమును గలఁగించుచున్నారనిపించునంతటి యపూర్వస్వరమది. ఏదేనొక స్వర యంత్రమును వాయించువాని వ్రేళ్లు నడుపు చాతుర్యమువలన మూలస్వరమునుండి యనేకవిధముల స్వరములు పుట్టుచున్నట్టులే, యీ మౌలిక ప్రణవనాదమునుండి మూఁడుగుణము లనెడి మూఁడువ్రేళ్ళ సంయోగ తారతమ్యముచే నీ విభిన్న నాదమయ విచిత్రజగత్తు వెలసినది.

అఖండజ్ఞానవృత్తియందు విరాజిల్లు మహాశక్తియొక్క విభిన్న స్పందనములు రూపరసాదివిషయరూపమునఁ బ్రతీతము లగును. స్పందనము శబ్దమూలకము. అనఁగా నాదమువల్లనే స్పందనము వెల్లడియగును. దీనిఁ బరీక్షించి చూడుఁడు. మన కాలుసేతులు మున్నగు నవయవముల మాంసపేశుల సంకోచ ప్రసారములనెడి స్పందనములును గొన్ని శబ్దముల నాశ్రయించియే పుట్టును. కామక్రోధాది వృత్తు లుదయించుటచే వేర్వేఱవయవములందలి మాంసపేశులు కొన్ని విధముల

నస్వాభావికముగా స్పందితములగును. ఇట్టి స్పందనములకుఁ గారణము — ఆ విధమైన వృత్తుల యుత్తేజనకు మూలమైన నాదమే మనుసునన్నో, నోరనో కామక్రోధాది విషయమైన శబ్దము లుచ్చరింపఁబడినపుడే వేర్వేఱవయవములయందిట్టి బాహ్యాస్పందనములు బయల్పడును. ఇటులే భగవద్భావము నుద్దీపింపఁజేయు శబ్దములు సైతము అనేక సమయములందు సాధకుల యంగముల విక్షేపాదులకు హేతువులగును. మన చింతాతరంగములు భావములు నాదమయములు. ఆ నాదమే మహాతీశక్తి యొక్క విభిన్న స్పందనరూపములతో వెలయును.

తొల్లిటి త్రికాలజ్ఞులైన మహర్షులు ఈ నాదస్పందన తత్త్వవిషయమునఁ గేవల శబ్దసహాయముతోనే వేర్వేఱు శక్తుల స్ఫురణము చేసి యభీష్టసిద్ధి నొందఁగల్గుసంపాటి పారదర్శులైరి. వైదిక తాంత్రికములైన మంత్రములు ఈ నాద స్పందన తత్త్వవిషయక జ్ఞానము నావిష్కరించునవియే. ఈ మంత్రముల సహాయముతో నిట్టి యవిశ్వాసి జ్ఞానహీన యుగమందు సైతము పలువురు అలౌకిక ప్రత్యక్ష ఫలముల నొందుచున్నారు. నేఁటను మన దేశమందు నిరక్షరులైన విషవైద్యులు మంత్రబలమున వింతగా లోకమున కుపకారము చేయుచున్నారు. తాము పూజించు దేవదేవీ స్థూలమూర్తులపైఁ దాము తాకకయే పూవు లెగిరిపడునట్టి సిద్ధి నొందినవారున్నారు. కొన్ని క్షుద్రములే యైనను, తాంత్రిక మంత్ర మహిమకు సాక్ష్యములుగా నున్నవి. మంత్రశక్తి చేత సర్పములను దామున్న చోటికి రావించుకొనువారున్నారు. సర్పదష్టుని మృతునిగాఁ జికిత్సకులు విడుచునపుడు పండ్రెండు గంటల కాలము గడవఁగా శవసంస్కారమునకై శ్మశానమునకుఁ

గొనిపోయిన పిమ్మట, మృతునితోఁ బరిచయముగల యొక వ్యక్తి శ్మశానమునకుఁ బరువెత్తి తన మంత్రశక్తిని రాత్రి యంతయుఁ బ్రయోగింపఁగా, మృతప్రాయుఁడు సజీవుఁడై లేచి యింటికి వచ్చెను. కష్టసాధ్యములైన, అసాధ్యములైన వ్యాధు లెందఱికో మంత్రశక్తివలన నిర్మూలములైనవనుట. కెన్నియో నిదర్శనములున్నవి సరే, అది యట్లుండనిండు.

ఆ మంత్రము నాదమే. ఈ నాదముతో రోగనాశకారోగ్యదాయక విభిన్న శక్తులకుఁ గరిష్ఠసంబంధ మున్నది. చికిత్సా శాస్త్రమునకును మంత్రశాస్త్రమునకును మన మహర్షులెంత చుట్టఱికమును గూర్చిరో యాయుర్వేద క్రమాధ్యయనము చేసినవారే యెఱుంగఁగలరు. ఒక వ్యాధిని నివారించుటకై యుపదేశింపఁబడిన మంత్రమందలి బీజాక్షరములను భౌతికశక్తి విశిష్టములైన మూలాధారాది శక్తి కేంద్రములందు న్యసించుకొనుచు మంత్రదేవత నాత్మాభిన్నముగా ననుభవించుచు జపించునపుడు భౌతిక విశిష్ట శక్తులేయైన వాతాదుల దోషవైషమ్యముల సమతకుదెచ్చి సుఖమిచ్చుట వింతగాదు. ఈ మంత్రనాదమునకు సుఖప్రదాన శక్తి యొక వ్యక్తి విషయమునందేగాదు. సత్యస్వరూపమైన యీ జగత్తునందు గల్గు వైషమ్యములఁ జక్కబెట్టుటకును జాలియున్నది. అది తనకును భూతము కాక యున్నను ప్రభుత్వమునకుఁ బరమాత్మ యస్తిత్వమందు విశ్వాసమును వైదిక తాంత్రిక మంత్రరూప నాదశక్తియందు గౌరవమును హృదయమందుంచుట చేతనే. దేశప్రజాక్షేమమునకై యుపుడపుడు మంత్రశాస్త్ర ప్రతినిధులే, కాదు కాదు మంత్రశాస్త్ర స్వరూపములేయైన రామానుజాది నాదశక్తిపూర్వక గ్రంథ

కాలక్షేపములను, వివిధ దేవదేవీ పూజా స్తోత్రాదులను జేయించుటకై యెంతో ధనము వ్యయపెట్టుట మనమెఱుంగుదుము. ఈ నాదముతో సుఖప్రద శక్తులకుంగల బలమైన సంబంధమును నావిష్కరించిన మహాత్ములే ధన్యులు. వారి జ్ఞాన విజ్ఞానముల వల్లనిదయగు ధన్యము. ఉచ్చాటన, స్తంభన, విద్రావణ, వశీకరణ, విద్వేషణ మారణాదులగు కర్మములను, అభీష్టమూర్తి దర్శనమును గేవల మంత్రశక్తి ప్రభావము వలననే కాఁగలవు. ఈ దినములలో నిట్టి యద్భుత నాదశక్తిని బలువురంగీకరింపరు. కాని, వారిసంఖ్య తక్కువయే పనిపడి నపుడు "నాకిష్టముకాదు. కాని యింటి యాఁడుమూక బాధ పడలేక యంగీకరించితిని" అనుచుం డాఁమును మంత్ర నాద ప్రతిక్రియలను మన్నించి సుఖపడుచునేయున్నారు. వర శుల్కదురాచారము తమకు నచ్చకున్నను స్త్రీలను సంతుష్టి పఱచుటకై మాధ్యస్థులద్వారా రహస్యముగా వరశుల్కముల నంగీకరించు మహాత్ములున్నట్లే, మంత్రనాదశక్తి జనిత ఫలము నొందుచున్నారు. ఒక్కటి సత్యము యథార్థముగా నాదతత్త్వమందుం బ్రవేశించి దానిశక్తిని వశపఱచుకొన్న వారి సంఖ్యమాత్రము లోకమునం దల్పమే

అవ్యక్త ప్రకృతినుండి నేవిధముగా స్థూలజగత్తు వెలసినదో, యటులే యవ్యక్తనాదమునుండియే వ్యక్త స్థూల నాదము వెలసినది. మూఁడుగుణముల సామ్యావస్థపేరే ప్రకృతి. ఆయవస్థ యందును నాదమున్నది. లేకున్నచో నమ్మూడు గుణములందు క్షోభము (విషమస్థితి) కాఁజాలదు. స్పందనమున్నచోట నాదము సిద్ధముగా నుండునని మున్ను చెప్పఁబడినది. కాని యీ నాద మతీంద్రియము కనుక దీనిని

శాస్త్రకారులు 'పరా' యందురు. ప్రకృతికి 'బరా' అను పేరున్నటులే బ్రహ్మమునకు 'పరం' అను పేరున్నటులే యీ యవ్యక్త నాదమునకును 'పరావాక్' అని పేరు ప్రకృతి యొక్క మొదటి పరిణామము 'స్పందనము'—మహత్తత్వము. ఈ సర్వవైషయిక ప్రకాశములకు నది క్షేత్రము. ఇచటి నాదము పేరే 'పశ్యంతీ'. కేవల యోగిజనులు, అనఁగా మహత్తత్వమును ఆత్మ బోధమునకుఁ గొనిపోఁగలవారు మాత్రమే యీ పశ్యంతీ నాదసత్త ననుభవింపఁ గల్గుదురు. ఇది శ్రవణేంద్రియ గోచరము కానందున, దీనిని 'పశ్యంతీ' యనిరి. తరువాతిది 'మధ్యమా'. ఇదిమనోమయ క్షేత్రమందను భూతమగును. కొంచెము స్థిరముగాఁ దమ సంకల్ప వికల్ప భావమువంక లక్ష్యముంచినచో, మనుష్యులీనాదమును బ్రత్యక్షము చేసికొనఁగలరు. ఇది ధ్వని లేకున్నను శబ్దమే. తరువాత భావములు ఘనీభూతమగుటచేతనే కంఠము, తాలువులు, పెదవులు మున్నగు స్థానములందొక స్పందనము బయల్పడును. దాని ఫలముగా వ్యక్తనాదము వెలయును. శాస్త్రమందు దీనిని "వైఖరీ" యంద్రు. ఇది సర్వప్రాణి సాధారణము. శ్రవణేంద్రియ గోచరము. ఎదిరికి వినవచ్చును. తొల్లింటి యాచార్యులు 'నాద' యను మాటను వ్యవహరింపక 'వాక్' అని వ్యవహరించిరి. వాక్కు నాదము, వేఱుకాదు. ఇచ్చట 'వాక్' అనుమాట, ఇంద్రియ మనెడి యర్థమందుఁ బ్రయోగింపఁబడలేదు. 'వాక్' స్త్రీలింగ పదముగాన 'పరా' 'పశ్యంతీ' 'మధ్యమా' 'వైఖరీ' అనెడి అమ్మనాలుగుసంజ్ఞలు స్త్రీలింగము లైనవి. వైఖరీవాక్కు మఱల

'ఉదాత్త, అనుదాత్త' స్వరిత నాదములచే ముత్తెఱంగులది. దాని యాలోచన మిట నక్కఱలేదు.

ఆర్యశాస్త్రమం దొక విశేష మేమనఁగా, వాక్ = నాదమును ప్రకాశింపఁజేయు వర్ణములను 'అక్షరము' లనిరి (గీత 8-3). "అక్షరం పరమం బ్రహ్మ" అక్షర శబ్దముచేతఁ బరబ్రహ్మమని తెలియవచ్చును. పరబ్రహ్మ వాచకమైన యక్షర శబ్దమే యీదేశమందు వర్ణమాలను దెలుపుమాట. కావున నాదతత్త్వ విషయమున దీనిని మించిన విజ్ఞానము నేటిదాఁక భూముఖమున నేదేశమందును నావిష్కరింపఁ బడలేదు.

తెలిసికొనఁదగిన మఱొకమాట — 'అ' మొదలు 'క్ష' వఱకు స్వరవ్యంజనములు కలిసి (అచ్చులు+హల్లులు) నైన యేబది వర్ణములకు మాతృకలని పేరు. సృష్టి స్థితి ప్రలయంకరి మహాశక్తి స్వరూపిణి మహామాయ (అమ్మ) వర్ణమయియు, నాదమయియునై నిత్యము వెలయుచున్నది. మాతృకాధ్యానమందు "పంచాశల్లిపిభి ర్విభక్త ముఖదోః పన్మధ్య వక్షః స్థలామ్" యేఁబది వర్ణములతోనే, యమ్మ మొగము చేతులు పాదములు నడుము వక్షము ననెడి యవయవము లేర్పడినవి. సాధకా! నీవు అమ్మ నెక్కడనో వెదుకఁబోవు చున్నావా? చూడు, నీ కంఠమునుండి వెలువడు ననేకశబ్దముల రూపముతో అమ్మయే. ఈ జగత్తునందు నీవనేక విధముల శబ్దములు వినుచున్నావు. అవే అమ్మ. నీ యిష్టమంత్రము అమ్మయే. నీ మనస్సులోనే బయల్పడ నట్లుచ్చరించుచుఁ జింత సేయుదువే, ఆ వాక్కు అమ్మయే. నీవు "అమ్మా" యని యఱచి పిలువుము. 'అమ్మా' యన

నమ్మాటయు నమ్మయే. నాయనా! నాకునూ నీకును నామికిని భేదములేదు. నీవు అమ్మను జూడఁగోరవు కనుకఁ జూడలేవు. (కానరాదు.) అమ్మ నాదరూపమున సర్వత్ర సుప్రకాశ రూపముతో నున్నది. చూచు కోరిక లేనపుడు, అమ్మ కాన రాదు. అది వేదమాట.

ప్రత్యేక జీవదేహము, ప్రత్యేక పదార్థము, పంచాశ ద్వర్ణ రూపిణి (మాతృకావర్ణరూపిణి) యైన యమ్మచేతనే రచియింపఁబడినది. తాంత్రికన్యాసములు (మాతృకా న్యాస ములు – మంత్రవర్ణ న్యాసము, షోఢాన్యాసము మొద॥) ఈ సత్యముపైనే ప్రతిష్ఠితములై యున్నవి. అనేకులు "అం నమో లలాటే" "ఓం నమః శిరసి" "ఇం నమో దక్షిణ చక్షుషి" "ఈం నమో వామ చక్షుషి" మున్నగు మంత్రముల ననుచు, నా స్థానములయందు ప్రేళ్లతోఁదాకి న్యాససమాప్తి చేయుదురు. కానీ, అక్కటా! న్యాసముల యథార్థఫలము నంతె మాత్రమునఁ బొందఁగలరా? ఏయుద్దేశ్యముతో నీ విధా నము పుట్టినదో, యా లక్ష్యము లేకుండుటచేతనే యీ యనుష్ఠానము అంగసంచలన రూపమైన కసరత్తుగాఁ దేలి పోవుచున్నది. దాని విషయ మించుకంత యిచట వినునది. ఒక్కరయినను దీని ననుసరించి ముందడుగు వేసినచో నుద్దే శము సఫలమగును. లలాటము మున్నగు నంగప్రత్యంగము లకు బోధశక్తిని (అనుభూతిని) గొనిపోవుదురు. ప్రత్యక్ష స్పందనానుభవము కానంతదాఁక 'అం' మున్నగు మంత్రాక్ష రములను మెల్లమెల్లగా వాగ్యంత్రమందు అధిక కంపనము కానట్టులుచ్చరింతురు. మానసోచ్చారణమే శ్రేష్ఠము. మొదట నభ్యసించునపుడు కొంచెము కష్టము నిర్బంధము తోఁచును.

కొన్నాళ్ల వెనుక మఱి యాకష్టము తోఁచదు. క్రమముగా నిచ్ఛామాత్రమున ననుభూతి పరిచాలనము చేయు సామర్థ్యము కలుగును. తోడ్తోనే బీజోచ్చారణము చేయుచుండుటచే ననుభూతి స్పందనమును బీజములన్నియు నేకమై పోవుటయుఁ దెలియును. ఇటులు మంత్రము, స్పందనము, అనుభూతి యనెడి మూడును నొక్కస్వరముతో మీఁది కుబుకునపుడు, అనఁగా నొక్కసారిగా నభిన్నముగా బోధపడునపుడే న్యాసము సిద్ధమైనదని తలఁపవలయును. ఈ విధముగాఁ జైతన్యమయ న్యాసము చేయువేళనే, మున్నులేని యింతు కంత సుఖమయానుభవ మగును. ఇంకను దీనివలని విశేష ఫలమేమనఁగా "నేను" దేహ విశిష్టమైన జడపదార్థమే యనెడి బోధ మంతరించిపోవును. దేహాత్మబోధము పూర్తిగా సడలిపోవును. శారీరక వ్యాధులను బోఁగొట్టుకొనుటకును నిదియొక మంచి యుపాయము. ఇంతేగాక, క్రమన్యాసపుటీత సాధకునకు అలౌకిక శక్తు లనేకములు లభించును.

పరావాగ్రూపిణి నాదశక్తి దేహమందంతటను బరిచాలిత యైనను దాని యుచ్చరించు (మీఁదికి నడుచు దారి సుషుమ్నా మార్గము) యందుఁ బ్రథమాత్మ వికాసమైన పాంచభౌతిక తత్త్వవిశేషములు, మూలాధారాది చక్రములనెడి శక్తి కేంద్రములందుఁను. శరీరము పాంచభౌతికము. వర్ణమాల పాంచభౌతికము. నాదస్వరూప పరాశక్తి వీని యుత్పత్తికేంద్రము. అది బహుశక్తిసంపుట స్వరూపము. ఆ వివిధశక్తిలాభము నొందుటకుఁ దొల్లింటి మహర్షులు, అభివ్యంజన సంసృష్టిచే నిష్పన్నమగు పరాశక్తిస్వరూప మహిమాదులను దెల్పు వివిధబీజాక్షరముల నుచ్చరింపఁజేసి, యనఁగా

నా యా శక్తి కేంద్రములందు నడిపి, ఆయాశక్తుల యనుగ్రహము నొందిరి. ఈ యుచ్చారణకాలమునందా నాదము శక్తి కేంద్రములనెడి వివిధ కేంద్రములను దాకి వివిధస్పందనములను బుట్టించును. వీణాదండమునందుండు సారెలను వ్రేళ్లతో నదుముచు సాధారణ నాదమును బరిచలింపఁజేసి నపుడు వివిధమనోహరనాద స్పందనములు పుట్టి వివిధరాగ రూపములై, వివిధశక్తులతో వెలయును. ఇదియు నట్టిదే; కావునఁ జక్రసహిత సుషుమ్నామార్గమునకు వీణాదండమని పేరు. బీజాక్షరోచ్చారణముచేఁ బుట్టు వివిధ స్పందనములు వివిధశక్తిరూపములైనట్లులే, వీణాయంత్రము (మానుషకంఠము) నుండి వెడలు సక్రమ మనోహర నాద రూప రాగములకును వివిధశక్తులు కలవు. అసంకీర్ణముగా, శాస్త్రోక్తముగా నుచ్చరించుటచేనైన, యాయా రాగాలాపములును వివిధ శక్తిసంపన్నములేయై కొన్ని వ్యాధినాశకములు, కొన్ని మనోలయ సాధనములు, కొన్ని తాపశాంతికరములు నగుటయేకాక, (మేఘరంజన్యాదులు) కొన్ని బాహ్య ప్రకృతి పరివర్తన సమర్థములునై యున్నవనుట శాస్త్రవిహితము, అనుభూతము. కావున శాస్త్రోక్త సప్తస్వరములును సప్తమాతృదేవతలుగా భావించి, యందనుస్యూతమై యవిచ్ఛిన్నమైన నాదమును బ్రహ్మముగా ననుభవించి చేయుగానము, గాయకు నానందమయునిగానే చేయును. ఇదే నాదబ్రహ్మోపాసనము. అది యుండనిండు. చెప్పెడిదేమనఁగా, జప పూజాస్తవాది కార్యములందు మనముచ్చరించు మంత్ర బీజాక్షరములు మూలాధారాది కేంద్రములందుఁ దంత్రోక్త గురూక్త విధి ననుసరించి బరిచలింపఁ జేయునపుడు, ఆయా

మంత్రాదుల ఫలశ్రుతుల యందుఁ జెప్పఁబడిన లాభములను బొందఁగలను ఈ విధానము దుర్భాగ్యవశమున సాధకుల యభ్యాసములందిపుడు తొలఁగి పోవుటచేత నే, యాశానురూప ఫలము నొందకపోవుటయు దైవస్వరూపశాస్త్రములను నిందించుటయు ననెడి పాపము చుట్టుకొనుచున్నది. స్వరాపరాధము లేనటుల వైదికమంత్రములును, జత్రన్యాసవిధి నుల్లంఘింపక తాంత్రికమంత్రములును సంపూర్ణమైన యర్థజ్ఞానముతో జప పూజాదులం దుచ్చరింపఁబడినపుడు సాధకులను సర్వసిద్ధి సంపన్నులనుగాఁ జేయకుండవు. ఇందు ప్రత్యేకవిషయమును గురుముఖమున సవివరణముగ నెఱింగికొనవలసినదే యనుచు నీ భాగము ముగించుచున్నాను.

## ఘటస్థాపన రహస్యము

మన దేశమందు జరుగు నధికాంశ పూజలయందు ఘట మొకటి స్థాపింపఁబడుట సుప్రసిద్ధము. ఈ ఘటమునందే పూజనీయ దేవదేవీగణమును ఆహ్వానపూర్వకముగా నర్చింతురు. సాలగ్రామశిలా శివలింగమూర్తుల కంటెఁ దక్కిన పూజలయందెల్ల నీ ఘటస్థాపనము చేయబడుట కానవచ్చుచున్నది ఇప్పుడొక ప్రశ్నము — ఎట్టిమూర్తియును లేనిచోట నీ ఘటస్థాపనప్రయోజనము సంభవమా? ఏదేనొక మూర్తియే యున్నపుడు, దాని చెంత మఱియొక ఘటస్థాపన ప్రయోజన మేమి? యని. అవును, ప్రయోజనమున్నది. ఒక దేవతా మూర్తి ప్రతిష్ఠింపఁబడునపుడు, ఆ దేవత పూజమాత్రమే యా ప్రతిమయందుఁ గాఁగలదు. కాని యితరమైన తదంగ దేవతల పూజలు జరుగవలయును. ఆ యంగదేవతా పూజల

కొంటకే వేఱుగా ఘటస్థాపనము చేయుట తప్పదు. దుర్గా పూజయే యనుకొనుఁడు. ఈ దుర్గాప్రతిమయందే పూజ సంపన్నమగును. దుర్గాప్రతిమయందు దుర్గాపూజయే యగును గాని, తదంగములైన గణేశుఁడు మున్నగు తక్కిన పలు దేవ దేవీ పూజలు దుర్గాప్రతిమయందే జరుగుట సంభవింపదు. ఇట్లు చేయుట యనుభవవిరుద్ధమగును. కావుననే యీ సర్వ దేవతల పూజలకై ఘటస్థాపనముచేయుట యత్యంతావశ్య కము. మఱియు నేవిధమైన మూర్తియు లేనపుడు ఘటమునే ప్రధానమూర్తికిఁ బ్రతినిధిగాఁ గైకొనవలయును.

ఘటము, పల్లవములు, ఫలము, జలము అనునవి ఘట స్థాపనమునకుఁ బ్రధానవస్తువులు. విశేషపూజలయందుఁ గలశ ములోఁ బంచరత్నములు వేయుటయుఁ గలదు. ఘటము హృదయగుహకుఁ బ్రతినిధిగాఁ గల్పింపఁబడును. చైతన్యము విశేషముగా నభివ్యక్తమగు స్థానము హృదయ గుహయే. ఈచోటినుండియే దేవతాబృందము విశేషించి యావిర్భవించు చుండును. కనుక హృదయగుహ నవలంబించియే పూజచేయు విధాన మేర్పడినది. ఎదురుగా స్థాపింపఁబడిన మృణ్మయాది ఘటము పూజకుని హృదయగుహకుఁ బ్రతినిధి. దీనిని జక్కఁగా ననుభవింపనిచోఁ బూజాసాఫల్యము కలుగదు. ఎక్కడనోఁ స్వర్గాదిస్థలమునందున్న దేవత లీ స్థాపించిన ఘటమందు దిగి కూర్చుందురా? యనువారు కేవల శిశువులవంటివారు. మఱియు హృదయస్వరూపమును బొత్తిగా నెఱుంగనివారు; అనఁగా హృదయమన నేమో యెఱుఁగనివారికి దేవతాగమము కడు దూరమందున్నమాట నిజమే. శాస్త్రములందు యీ విధ ముగా దూరత్వవిషయము వర్ణింపఁబడినచోట నెల్ల, నది

స్థలమునుగూర్చినది కాదు. జ్ఞానమునుగూర్చి చెప్పఁబడిన మాట.

హృదయదేశము నుండియే దేవత లావిర్భవింతురు. కాని యేదేనొక దూరమందుండు స్థానమునుండి కాదు. మన లోపలనే, యనఁగా విజ్ఞానమయక్షేత్రమందే దేవతావాసమైన స్వర్గమున్నది. లోపలి యే కేంద్రమునుండి మంత్రోచ్చారణమగునో, యా కేంద్రమువైపు మంత్రోచ్చారణముతోఁ జిత్తము ముందడుగువేసి విజ్ఞానమయ క్షేత్రమందుఁ జేరునపుడే దేవతావిర్భావ స్థానమును గుర్తింపఁగలఁడు. హృదయగుహాపేరే స్వర్గము. ఈ స్వర్గమందుఁ జేరు విషయమున శాస్త్రమందుఁ జెప్పఁబడిన పలువిధములైన యుపాయములలో మంత్రోచ్చారణ కేంద్రమును వెదకుట యొక యుపాయము. మంత్రము లుచ్చరింపఁబడునపుడు పూజకుని హృదయదేశమును దాఁకినచో నీ హృదయదర్శి మంత్రముల ప్రభావము వల్లనే హృదయగుహాయందున్న దేవశక్తులు చక్కఁగా మేలుకొని పూజకై యేర్పడిన యాసనము నలంకరింతురు. వేదాన్తశాస్త్రము "హృది+అయమ్= హృదయమ్" అనఁగా నాత్మయని యర్థము చెప్పినది. సాధారణముగా హృదయమనఁగానే హృదయపద్మమని తోఁచును. వక్షఃస్థలములోపల నంగుష్ఠప్రమాణమైన యాకాశమువంటి యేస్థలముగలదో, యచటనే సుఖదుఃఖానుభవ మగుచుండును. అచటఁ బ్రవేశింపఁగల్గిన యెడల హృదయమన నేమో తెలియును. హృదయమన్నంతమాత్రమునఁ బ్రాణము చైతన్యము నని యర్థము చేసికొనుటయే సరిగానుండును. దీని విషయ మేమియు నెఱుంగలేనివాని కిది కడుంగడు దూరమే.

మఱి దీని నెఱింగినవారికిఁ గడుంగడుఁ జేరువే. ఏమయినను దమ యెదుట స్థాపింపఁబడిన ఘటము తన హృదయమునకుఁ బ్రతిరూపమేయనెడి సత్యజ్ఞానముతో గురువుచేత నుపదేశింపఁబడిన విధమునఁ బూజలు చేయఁగాఁ జేయఁగాఁ, బూజకునకు హృదయము చేఁజిక్కును. ప్రాణసంస్పర్శము నొందును. చైతన్య ముద్బుద్ధమగును. పూజకుఁడు ధన్యుఁడగును. లోపలి వెలుపలి భేదజ్ఞానమును దొలఁగించుటకుఁ బూజ యొక్కటే సులభోపాయమని చెప్పియుంటిమి ఆత్మజ్ఞానమునొందు పక్షమున, భక్తిజ్ఞానకర్మముల సమన్వయవిషయమున నపూర్వమైన సులభోపాయము పూజయే.

కలశమందు నింపిన జలము భావములకుఁ బ్రతినిధి. భావమునుమీఱి పూజయే జరుగదు. భావుకుఁడును రసికుఁడునైనవాఁడే భగవంతుని పూజయం దధికారి. భావసమన్వితులై పూజచేయు విషయము భగవంతుఁడే స్వయముగా గీతలందుఁ జెప్పెను. హృదయమునుండియే భావములు వికసించును. మంత్రసమూహములనునవి యీ భావముల నుద్దీపింపఁజేయు సంకేతవిశేషములే. హృదయదేశమును దాకునదియు, అర్థజ్ఞానముతోఁ గూడినదియుఁ జైతన్యమయమునైన మంత్రమే, హృదయమందున్న దేవభావమును మేలుకొలుపును. ఇటులే చలింపని శ్రద్ధావిశ్వాసముల ప్రభావముచే నీ భావములు ఘనీభవించి దేవతారూపమున స్థూలముగా వెలయును. ఏమయినను, భావమనెడి వస్తువును దెలిసికొనుటకే భావములకుఁ బ్రతినిధియైన ఘటము జలముతో నింపఁబడును. హృదయఘటము భావజలముతో నిండనంతదాఁకఁ బూజాధికారము కలుగదు.

బుద్ధికిఁ (జ్ఞానమునకు) ప్రతినిధిగా నారికేళ ఫలము ఘటముపై నూర్ధ్వశిఖముగా నుంచఁబడును. భావసమూహము జ్ఞానమందే వికసించును. జ్ఞానశూన్యభావము లుదయించుట కానవచ్చినను, అవి వాస్తవములైన భావము లనఁబడవు. అవి తాత్కాలికమైన మనస్సంకల్పమో, స్వప్నముల యుత్తేజనమో యగును. జ్ఞానమునందుఁ ప్రతిష్ఠితమైన భావము లుద్బుద్ధమగుటవల్లనే పూజ సార్థకమగును. ఇపుడు పూజింపఁబడుచున్న దేవత స్వరూపమెట్టిది? పూజకునితో నా దేవత కెట్టి సంబంధము కలదు? పూజకుఁ డగుటవలన నేవిధముగా నాత్మ ప్రకాశమగును? అను తత్త్వవిషయములఁ బొరపాటులేని జ్ఞానము గల్గినపుడే యథార్థభావ వికాసమగును. ఈ సత్యమును జక్కగా గుండెకు నాటించుకొనుటకే ఘటముపై నొక ఫలము స్థాపించుటను గనుచున్నాము. మన దేశమందును దఱచుగా ఘటముపైని గొబ్బరిబొండమును నిల్పు విధానము గలదు. అది జ్ఞానమనెడి శిఖతోఁ గూడికొన్న మస్తిష్కమునకుఁ దగిన ప్రతినిధిగా నెన్నఁబడును. నారికేళము లోపలి గుజ్జు మస్తిష్కముగాను, దాని మూఁడు కన్నులు భూత భవిష్యద్వర్తమాన జ్ఞానమునకుఁ ప్రతినిధిగాను, దాని శిఖ యఖండజ్ఞాన ప్రతినిధిగాను నెన్నఁబడును. ఈ శిఖ నసంఖ్యాభావ ప్రతినిధిగాను నెన్నవచ్చును. కనుకనే కలశముపై నుంచఁబడునట్టియు, దేవతాప్రతినిధిగా నెన్నఁబడునట్టియు, దేవబ్రాహ్మణ సమర్పితము చేయఁబడునట్టియు నారికేళము శిఖావర్జితమైన యెడల, అనఁగా మీఁది జుత్తు తీసివేయఁబడిన యెడల నింద్యమనిరి. అనఁగా నది పూజా సత్కార్యమున నుపయోగింపఁదగ దనిరి.

కలశమందుంచఁబడు పంచపల్లవములు (మామిడి, రావి, జువ్వి, వేఁగు, మేడి) పంచ కర్మేంద్రియములకు, పంచ రత్నములు పంచ జ్ఞానేంద్రియములకును ననుకల్పములుగా నెన్నఁబడును. ఇవిగాక ఘటముక్రిందఁ బంచధాన్యములు (సస్యములు) పంచతన్మాత్రల కనుకల్పముగాను నుంచఁబడును. పరమాత్మతత్త్వము అనఁగా జ్ఞానమయపరమేశ్వరుఁడు హృదయ మందలి భావములతోఁ గూడినవాడై జ్ఞానేంద్రియములు కర్మేంద్రియములు మున్నగు తత్త్వసమూహమం దుండియే స్థూలముగా వెలయును. ప్రాణప్రియుఁడైన పరమాత్మను స్థూల మునకుఁ దెచ్చి ఫలపుష్పాదులతోఁ బూజింతురు. విశుద్ధచైతన్య స్వరూపుఁడును, దేశ కాలములచేఁ దెంపు లేని వాఁడును, ఆనందస్వరూపుఁడు నైన యిష్టదేవుని స్థూలరూపమున దర్శిం చుట తత్త్వసమూహ మందుండియే కావలయును. మనస్సు బుద్ధి యింద్రియములు మున్నగు తత్త్వసమూహమందుండియే యతఁడు విశిష్టభావములతో నాత్మప్రకాశము చేయును. కావుననే తత్త్వములను అనఁగా సూక్ష్మదేహమును జక్కగా గ్రహించుటకు దానికిఁ బ్రతినిధిగా నొకఘటమును స్థాపించుట శాస్త్రవిహితమైనది. ఘట శరీరముమీదఁ గుంకుమాదులతో వ్రాయఁబడు దేవతామూర్తి యీ సూక్ష్మ దేహమునకుఁ బ్రతినిధిగా నెన్నఁబడును. వేర్వేఱు తత్త్వములందున్న చైత న్యమే వేర్వేఱు దేవతలు. పలుమాట లేల? దేవతాపూజ యందు సూక్ష్మదేహానుభవమే చక్కఁగాఁ దప్పక చేయఁదగినది. ఘటస్థాపనమువల్ల నా యనుభవము సులభముగానే లభింపఁ గలదు. ఘటస్థాపన కాలము నందు జదువబడు మంత్రము లన్నియు నరజ్ఞానము తాదాత్మ్యము ననువాని సాయముతో

నుచ్చరింపఁ బడుటచేత, ఎదురనున్న కలశము తన హృదయ మునకే యథార్థప్రతినిధి యనుమాట యనుభవమునకు వచ్చును. ఈవిధమున నిచ్చటనే సర్వదేవశక్తులును బుట్టు ననుటయు ననుభవమునకు వచ్చును. ఆసమయమందు ఘటము మీఁద గంధపుష్పాక్షతాదులు జలము మున్నగునవి యర్పించు నపుడు, నిజముగా నవి తన హృదయదేశమందే యర్పింపఁబడు చున్నవనెడి యనుభూతి కల్గుటవల్లనే, ఘటస్థాపనము యథా ర్థముగానైనదా, లేదా యనెడి మాట తేటపడిపోవును. ఇష్ట దేవతనుద్దేశించి సమర్పింపఁబడిన పత్రపుష్పాదులైన యుప చారములు తనహృదయమును స్పృశించినట్లు లనుభూతి చేయఁ జాలనంతఁదాక యథార్థముగా ఘటస్థాపనము జరుగలేదనియే తలంపవలయును.

గ్రంథారంభమునుండియు, నాత్మస్వరూపము నెఱుంగు టయే మనుష్యుని తుట్టతుది లక్ష్యమనుచున్నాము. ఆ లక్ష్య ముతోఁ బూజించుటయే సరియగు నుపాయము. ఇపుడు సహృదయులైన పాఠకులు ముందు చెప్పఁబడిన మాటల నన్నిటిని దాత్పర్యముతో మనసున నాటించుకొనఁగల్గుదురు. ఈ మాంసపిండమయమైన స్థూలదేహమే నా యథార్థ స్వరూ పము కాదనియు, దీనికంటె వేఱుగా నొక సూక్ష్మశరీరము నాకుఁగలదనియు, నా పాపపుణ్యములు, ధర్మాధర్మములు, నాయాశలు, నాకోరికలు నన్నియు నీ సూక్ష్మదేహమువల్లనే వ్యక్తములగుచున్నవనియు, దేవశక్తిసమూహము సైతము ఈ సూక్ష్మదేహమునుండియే యావిర్భవించుననియు, మఱియు నీ కానవచ్చుచున్న స్థూలదేహము సూక్ష్మదేహముయొక్క ఘనీభూతవికాసమే యనియు, నిది భోగాయతనక్షేత్రమనియు,

నీ ఘటస్థాపనకార్యమువల్లనే యత్రిమముగా మనసున నాటు కొనును. ఈరీతిని బూజ చేయఁగాఁ జేయఁగా సూక్ష్మదేహ విషయక సంస్కారములు స్థూలదేహమువలెనే సుదృఢము లగునపుడు, ఈ సూక్ష్మశరీర మెక్కడనుండి పుట్టుచున్నది? యను దానిపైని మెల్లగా లక్ష్యముపడి, మెల్లమెల్లగాఁ గారణ శరీరము ప్రత్యక్షము కాఁజొచ్చును. క్రమముగాఁ గారణశరీర సంబంధమైన జ్ఞానము సుదృఢము కాఁగా, అనఁగా 'నేను' అన్నంతమాత్రముననే కారణశరీరమును ప్రతీతి గోచర మగుచుండును. అపుడు కారణాతీత క్షేత్రమువైపు యనఁగా నిరంజన స్వరూపమువైపు నిగా పడును దాని ఫలముగా జీవుఁడు ఆత్మస్వరూపసంధాన మొందును. ఈ విధముగా సుఖదుఃఖములతో నిండిన సంసారసాగరము నావలిగట్టుఁ జేరి పూర్ణానందస్వరూపమున నిల్చిపోవును. ఇదే మనుష్యుని మనుష్యత్వము. ఇదే మనుష్యుని పుట్టుకది లక్ష్యము.

## ఆచమనము

స్వరూపోపలబ్ధి పేరే ముక్తి. పురాణాది శాస్త్రము లందు ముక్తి, సాలోక్యము, సామీప్యము, సారూప్యము, సాయుజ్యము (నిర్వాణము) అని నాలుగు విధములుగా వర్ణింపఁబడినది. ఈ నాలుగు విధములును వాస్తవముగా ముక్తిభేదములు కావు. ముక్తిక్షేత్రమునకుఁ జేరుకొనుటకైన వేర్వేఱు స్తరములు మాత్రమే. ముక్తి యనునది స్వయం బ్రహ్మస్వరూపమే. దానియం దెట్టి భేదమును లేదు. ఉండఁ జాలదు. సాయుజ్యమే (నిర్వాణమే) ముక్తియొక్క యథార్థ స్వరూపము. తక్కిన మూడును ఈక్షేత్రమునందుఁ జేరుకొనుట

కైన దగ్గరదగ్గర మెట్లవరుసయే. ధీశాలురైన చదువరులు రవ్వంత లక్ష్యముంచినచో, నీదేశమందు జరుగు పూజాది కార్యములలోపలనే మును జెప్పిన ముక్తిస్తరములు, ఏవిధముగా నమర్పఁబడినవో తెలిసికొనఁగలరు. క్రమముగా దీనిని స్పష్టముగా నెఱుంగఁ బ్రయత్నింతము. పూజాది విధ్యుక్త కార్యములందు అన్నిఁటికంటెఁ దొల్తఁ జెప్పఁబడిన ఆచమనము, ఆసనశుద్ధి యనునెడి విధులను యథార్థభావముతోఁ జేయఁగల్గుటచేతనే పూజకుఁడు సాలోక్యాది ముక్తుల నాస్వాదింపఁగలఁడు.

ఆచమనశబ్దమునకు సంక్షిప్తార్థము శుద్ధి. విష్ణుస్మరణమే దానికైన సర్వశ్రేష్ఠోపాయము. పూజకుని లోను, వెలిని జక్కఁగా విశుద్ధముచేయు విషయమున విష్ణుస్మరణమును బోలిన ఫలప్రదోపాయము మఱియొకటి యున్నట్లు మాకుఁ దోఁచదు. విష్ణుస్మరణమునకై యీ దేశమున స్మరింపఁబడు వైదికమంత్రము "ఓం ఓం ఓం. తద్విష్ణోః పరమం పదం సదా పశ్యంతి సూరయః । దివీవ చక్షురాతతమ్" అనునదే. దీని సంక్షిప్తార్థము — ఆకాశమందు వ్యాపించిన దృక్ఛక్తి వలెనే విష్ణుని పరమపదమును సూరిజనులు (జ్ఞానులు) సర్వదా దర్శింతురు. ఈ మంత్రము కేవల ద్విజాతులు చదువఁదగినదే. శూద్రులకు "అపవిత్రః పవిత్రో వా సర్వావస్థాం గతోఽపి వా। యఃస్మరేత్పుండరీకాక్షం స బాహ్యాభ్యంతరం శుచిః॥" ఈ పౌరాణికమంత్రము విష్ణుస్మరణమునకై పఠింపఁబడును మున్ను జెప్పిన 'తద్విష్ణోః' ఇత్యాది వైదికమంత్రముతో దీనికి వాస్తవముగా నెట్టిభేదమును లేదు. వేదమంత్రమందు ఆకాశవ్యాపియైన దృక్ఛక్తివలెనే విష్ణుని పరమపదముగా వర్ణింపఁబడినదే,

యీ పౌరాణిక మంత్రమందు "పుండరీకాక్ష" శబ్దముతో సైతము లక్ష్యము చేయఁబడినది. ఆచమించు వేళ విష్ణుని మఱేదే నొకపేరితో స్మరించుటచే సాగదు. ఈ పుండరీకాక్ష నామమే విశిష్టభావముతో స్మరింపవలయును. తెల్లదామర రేకులవంటి కన్నులుగల విష్ణుని స్మరణమును, ఆకాశవ్యాపియైన దృష్టిశక్తివంటిదైన విష్ణుని పరమపదానుస్మరణము తత్త్వదృష్టిచే భిన్నములు కావు. ఈ మంత్రములను వాని చైతన్యమయార్థమును గురుముఖమున శ్రద్ధతో వినవలయును. కాకున్నచో నీ మంత్రముల యుచ్చారణము, ఆశానురూప ఫలప్రదము కాదు. ఐన నిచటఁ బూజకుల మేలునకై కొంత తెలుపఁ బ్రయత్నింతును.

మొట్టమొదట విష్ణువన నెవ్వరో యెఱుంగవలయును. "వ్యాప్నోతి సర్వమితి విష్ణుః" అంతట నాత్మరూపమున వ్యాపించియున్నవాఁడే విష్ణువు. చతుర్భుజ శంఖ చక్ర గదా ధారియైన యొకమూర్తివిశేషమాత్రమే విష్ణుశబ్దార్థము కాదు. ఈ జగద్వ్యాపకత్వ మహిమము నే పూజకుఁ డపుడు మనసున ధరించుటచేత నే విష్ణుశబ్దోచ్చారణము సార్థకమగును. మహత్త్వ జ్ఞానహీనుఁడై కేవల మూర్తి ననుస్మరించుట యెన్నఁడును మనుజుని మహత్త్వపదవియందుఁ బ్రతిష్ఠింపఁజాలదు. మూర్తి విశేషమును జింతించు నభ్యాసము లేకుండుటచేతఁ గేవల కల్పనద్వారా యేదేనొక మూర్తిఘటనముకైన ప్రయాసము పడకున్నను నెట్టిహానియు లేదుగాని మూర్తి మహత్త్వవిశేషమును దప్పక యవధరింపవలయును. విశేషించి యీ యాచమన మంత్రమందు మూర్తి చింత చేయకుండుట మేలు. ఏమన మూర్తివిశేష మెట్టిదియు నెన్నఁడును జగద్వ్యాపి

కాఁజాలదు. విష్ణుని జగద్వ్యాపకత్వమనెడి మహత్త్వమును జింతించుటచేతనే యాచమన మంత్రము సార్థకమగును. మఱియు మంత్రమందు విష్ణుని పరమపదమును జూచుట కయియే యీ మాట చెప్పఁబడినది. విష్ణువనెడి మూర్తివిశేషమును జూచుటకై చెప్పఁబడలేదు. పదమనఁగా 'చరణము' కాదు (స్థానము). విష్ణుని విష్ణుత్వమే అనఁగా జగద్వ్యాపకత్వమే విష్ణుని పరమపదము. న్యాయాధీశుని (విచారకుని) న్యాయవిచారకత్వమే యతని పదము. విచారకుని పదమునందు, అనఁగా విచారకత్వమందు (దానికై సనిర్దిష్టస్థానమందు) ఎవ్వడేవ్యక్తి కూరుచున్న నప్పు డావ్యక్తియే విచారకుఁడను పేరితోఁ బరిచితుఁడగును. సరిగా నీవిధముగానే సాధకుఁడెవ్వడేని విష్ణుని పరమపదమునందుఁ బ్రతిష్ఠితుఁడు కాఁగలుగునే, నతఁడును విష్ణుని సారూప్యమును అనఁగా విష్ణుత్వలాభము నొందును. కావుననే పురాణాది కావ్యములయందు "విష్ణులోకమునకుఁ బోవువారెల్లరు విష్ణుసమానరూపమునొందుదు" రని వర్ణింపఁబడినది. ఏమయినను విష్ణుని యీ పరమపదదర్శనము చేయుటయే యాచమన మంత్రోద్దేశము. ఆ పరమపదదర్శన మేవిధముగాఁ జేయుటగునో, యదియు మంత్రమందే 'దివీవ చక్షురాతతమ్' అనెడి వాక్యముచేఁ దేటపడుచున్నది. ఆకాశమందు విస్తరించు చక్షువు, అనఁగా దృక్ఛక్తివలెనే యీ విష్ణుని పరమపదమున్నది.

అదె తేటమాటలతోఁ జెప్పుచున్నాము. భౌతికమైన సర్వతత్త్వముల యందును జూడఁగా నాకాశము వ్యాపకత్వ లక్షణము కలది. తనలో నాకాశము లేని యెట్టి ఘనపదార్థమును లేదు. ఇంతేల? అతిసూక్ష్మతమములైన రెండు పర

మాంసములు నరములు సైతము, ఆకాశము (అవకాశము) సిద్ధముగా నుండనే యున్నది. పూజకై కూర్చుండువారు చూడఁ బ్రయత్నించుదురుగాక—వారి శరీరమందలి రక్తము, మాంసము, ఎముకలు మున్నగువానిలో సైతము ఆకాశమున్నది. ఆ దేహములోని యాకాశము మొదలిడి వెలుపలి విశ్వవ్యాపి, మహాకాశమున్నది. ఆ యఖండము, సర్వవ్యాపియు నైన యాకాశము చతుర్మయము అనఁగా దృక్ఛక్తిమయము అని చూడఁగల్గుట చేతనే, అనఁగా ననుభవింపఁగల్గుట చేతనే విష్ణుని పరమపదమును జూచుటగును. "లోను వెలిని వ్యాపించి యున్న యాకాశమువలె నొక స్నేహమయదృష్టితో 'నేను' సంపూర్ణముగా నోతప్రోతభావముతో (పడుగుం బేకవలె) నున్నాను" అని యీవిధముగాఁ బ్రత్యక్షానుభవమగుట చేతనే యీ యాచమన మంత్రోచ్చారణము సార్థకమగును. ఇదే సాలోక్యముక్తి. విష్ణునితో నొక లోకమందే యుండుట. ఇంత మాత్రమైనను గాకున్నచోఁ బూజాది వైధికార్యములందధికారము కలుగదు. దీనివలనఁ బూజ్యపాదులైన ఋషులు విధ్యుక్తకార్యములందన్నిటఁ దొలుతనే యాచమనక్రియను విధించిరి. బళిరా! పరమేశ్వరుని సమీపమునుండి తత్సామీప్యలాభము నొందుటకును, క్రమముగాఁ దత్సాయుజ్య లాభము నొందుటకును, అనఁగా నతనిలోఁ జేరిపోవుటకును, అతఁడే లోకమందున్నాఁడో, యెట్టి వ్యాపక ప్రకాశసత్తగా నున్నాఁడో, యా లోకమందట్టి వ్యాపక ప్రకాశసత్తయందే పూజకుఁడు మొట్టమొదటఁ జేరవలయును గదా! పలువిధములైన విషయములందుఁ దగిలి, బొత్తిగా విక్షిప్తమైన చిత్తమును నియమించు విషయమున నీయాచమన మొక యపూర్వమైన

యుపాయము. కేవల మంత్రపాఠముచేతనే, కేవల జలపానము చేతనే యథార్థాచమనము కాఁజాలదు. మంత్రార్థమునకుఁదగిన యనుభూతివికాస మత్యావశ్యకము. ఈవిధముగా మంత్రపాఠమును జేయనివారి విషయమున సర్వతత్త్వముల నవధరించుట యనునది దురూహము అనక తప్పదు. మఱియు నీయాచమన మంత్రము చైతన్యమయమైనచో, అనఁగా నెవఁడేని సాధకుఁడు యథార్థాచమనము చేయు నలవాటుపడెనేని, యీ యొక్క ప్రక్రియవల్లనే యతఁడు బ్రహ్మజ్ఞానపర్యంతలాభము నొందఁగలఁడు. తొలుత విష్ణుని పరమపదదర్శనము, తరువాత నతనికి సన్నిహితుఁడగుట, తరువాతఁ దత్సారూప్యలాభము, అంతమందా పరమపదమందే సాయుజ్యప్రాప్తి; యీవిధముగా నొక్క యాచమనమంత్రమునందే చతుర్విధముక్తుల దొంతి కానవచ్చును.

ఆచమనమంత్ర సంక్షేపము :— ఓం ఓం ఓం విష్ణు ర్విష్ణు ర్విష్ణుః అనుచుఁ దాత్పర్యములోఁజేయు నీ విష్ణుస్మరణ మును మున్నుఁజెప్పిన పరమపద దర్శనముగానే గ్రహింప వలెను. మన మెల్లప్పుడును విశ్వవ్యాపినియైన యొకమహాశక్తి యొడియందే యున్నారమనుమాట మరచిపోవుచున్నాము. కనుకనే యామెతో బొత్తిగా నెడసిపోయి యింద్రియభోగ్య విషయములందే విచరించుచుందుము. ఈ మహాశక్తి యొడి నుండి జాఱిపోక, క్షణమాత్ర మొక్కసారి యా విరాట్ సత్తతో మనకుఁగల యచ్ఛేద్య సంబంధము ననుభవించుటచే నానాటఁ బై మెట్టులెక్కు యోగ్యత నిశ్చయముగాఁ గల్గునని తెలిసికొనియే పూర్వాచార్యులు దైనందిన ప్రత్యేక కార్యమందును నిట్టి యాచమనమును విధించిరి. విశేషించి, ద్విజా

తుల విషయమున వ్యావహారికము లైన సర్వకర్మములందు సైతము ఈవిష్ణుస్మరణముతోడి యాచమనము విధింపఁబడినది. అది వారి యాధ్యాత్మిక జీవనోన్నతివిషయమున నేకాంతోపయోగి. మఱియు నెవ్వఁడేని సమస్తదైనిక కార్యములందును విష్ణు పరమపదదర్శనము నీ రీతి నభ్యసించునేని, యతఁడే శాస్త్రనిర్దిష్టములైన దినములందు నిర్దిష్టపూజకై కూర్చుండి యథార్థాచమనము చేయ సమర్థుఁడగును. హఠాత్తుగా నిట్టి యనుభవము నందుట సులభసాధ్యము కాదు.

ధీమంతులైన పాఠకు లిచట మఱియొక్క మాట గుర్తింపఁదగును. శూద్రుఁడు వేదమంత్రములనుఁ బఠించు నధికారముచే వంచితుఁడైనను వేదప్రతిపాద్యమైన తత్త్వజ్ఞానముచే వంచితుఁడు కాలేఁడు. ఏలనఁ బౌరాణిక మంత్రమందున్న పుండరీకాక్ష స్మరణమునకును వేదమంత్రోక్తమైన స్నేహమయ దృష్ట్యనుభవమునకును నించుకంతయు భేదము లేదు. కనుక సనాతనశాస్త్రముల యనుశాసనమును మన్నించి పోవుటచే నెవ్వరు నేవిధముగాను వంచితులైననెడి యా శంక యుండదు.

## ఆ స న శు ద్ధి

ఆసనశుద్ధియు నాచమనమువలె విరాట్ సత్తానుభవమే. ''నేనొక కాలి యాటబంతివలె గోళాకారముగల పృథ్విపై యొంటరిగాఁ గూర్చున్నాను. నామీఁద, క్రింద, కుడి, ఎడమ, ముందు, వెనుకల నంతటను మహాకాశమున్నది. ఆశూన్యము కేవల శూన్యముగాదు. అది స్నేహమయదృష్టితో ననఁగా విష్ణుని పరమపదముతో నుద్భాసించు

చున్నది. స్నేహమయమును, సర్వవ్యాపకమునైన యాదృక్ఛక్తియొక్క పరిపుష్టప్రతీకమే యీ సూర్యదేవుఁడు. అతఁడు మహాశూన్యమందుండి నా యాసనస్వరూపమైన భూమిని స్నేహమయాకర్షణముచే ధరించుచున్నాఁడు. మఱియు నీ ధాత్రీరూపిణియైనతల్లి నన్నుఁ దనగుండెయందుంచుకొని యీ విరాట్ సూర్యనారాయణుని చుట్టును తిరుగుచున్న" దనెడి యనుభవము చేయుటకే —

"పృథ్వి త్వయా ధృతా లోకా దేవి! త్వం విష్ణునా ధృతా।
త్వం చ ధారయ మాం దేవి పవిత్రం కురుచాసనమ్॥

"ఓపృథ్వీ! అమ్మా! నీవు సర్వలోకములను, నన్నును ధరించుచున్నావు. ఓదేవి! నీవి విష్ణునిచే, అనఁగా సూర్యునిచే ధరింపఁబడుచున్నావు. నీవు నన్నివిధముగా నీ స్నేహమయ వక్షమందు ధరించియుంచుము. అనఁగా నీ స్నేహమయాంకమునుండి నేను తృణమైనను జాఱలేదు. అని సర్వదా స్మరింతును. ఓయమ్మా! నీవు నా యాసనమును శుద్ధము చేయుము."

ఇది మంత్ర సంక్షిప్తార్థము. ఇందు అర్థమునకుఁ దగినభావము ఘనీభూతమగునపుడే యాసనశుద్ధిరహస్యము తెలియఁగలదు. ఈభూమి సర్వలోకులను ధరించుచున్నది. ఆమె సూర్యుని మధ్యాకర్షణశక్తిచేత నాకర్షింపఁబడుటవలన నిరాలంబమైన యాకాశమందు నిమిషమునకు వేలకొలఁది నాత్మప్రదక్షిణలు చేయుచు, దానొక నిమిషమునకు వేలకొలఁది మైళ్లవడిని సూర్యుని చుట్టుఁ దిరుగుచున్నది. ఇంత వడిగా యాత్మప్రదక్షిణములను సూర్యప్రదక్షిణములు చేయుచున్నను, దన వక్షమునున్న పరమాణువును సైతము తననుండి జారిపోకుండఁ దన మధ్యాకర్షణశక్తిచే నాకర్షించి ధరించుచున్నది.

ఆత్మాభిముఖుఁడై సాధకుఁడు మంత్రజపాద్యుపాసనమును జేయఁ బూని వీర, స్వస్తిక, పద్మ, వజ్రాద్యాసనములలో నేదే నొక దానిని ధరించి కూర్చుండును. ఆ యాసన మనెడి యంగవిన్యాసము తుదముట్ట నిల్పుకొను సామర్థ్యము లేకుండుటచే సకల ధారణ శక్తి గల దేవీ స్వరూపమైన భూమినిఁ బ్రార్థించుచున్నాఁడు. దీనిచే సాధకుని యహంకారమణఁగి శరణాగతత్వ మలవడును. ఇదే దీని యర్థానురూపపూర్ణ భావము.

పాతంజల దర్శనమందు — చిత్తము యొక్క యనంత సమాపత్తివల్లనే యాసన జయము (ఆసనశుద్ధి) లగునని యున్నది. పద్మాసన స్వస్తికాసనాదులైన యంగ సంస్థాపనములు 'పృథ్వి త్వయా' యనెడి యాసనశుద్ధికారక మంత్ర పాఠము వలననే లభించును. ఇదే యనంత సమాపత్తి. మన చిత్తమెల్లప్పుడును క్షుద్రక్షుద్ర నామరూపాత్మక విషయములందే కట్టువడి యుండును. వానినుండి లాగివేసి కొన్నిక్షణములపాటు చిత్తము ననంతసత్త యందు మగ్నము చేసి యుంచుటచేతనే యథార్థాసనశుద్ధి యగును. కాని చిత్తమున కీవిధమైన సామయిక భావములవలన ననంతసమాపత్తి కానన్నాళ్లు నది వట్టి యంగసంస్థాపనమే. వట్టి మంత్రపాఠము మాత్రమే. అది సాధకు నెన్నఁడును గృతార్థునిఁ జేయఁజాలదు. పూజకుఁడే దేవతనుఁ బూజించుటకేనిఁ బూనుకొన్నప్పుడతఁడు ఈ దేవతయే ప్రత్యక్షపరమేశ్వరుఁడనియు, నితఁడు సర్వవ్యాపియు, సర్వశక్తిమంతుఁడు ననియు, చైతన్యమే యాతని స్వరూపమనియు నెన్నుచు నాతని మహత్త్వమును, స్వరూపమును మనసున నిల్పికొని పరమేశ్వరుని పూజకుఁ బూనుకొనుటవలనఁ బూజకునకు సైతము ఆసమయమందాంశిక ముగ

నీశ్వరధర్మవిశిష్టత కలుగునని మున్నుఁ జెప్పియుంటిమి. ఈ యాచమనము, ఈ యాసనశుద్ధి యనువానిచేతనే పరమేశ్వరుని చైతన్యమయత్వమును, సర్వవ్యాపిత్వమునుఁ జక్కఁగాఁ దెలియఁగలుగును. కావుననే పూర్వాచార్యులచే సర్వకార్యములందునుఁ దొలుదొల్త నీరెండిటి యనుష్ఠానములే విహితములైనవి. ఈ విషయమునందు మఱిరెండు మాటలు చెప్పుట యప్రాసంగికము కాదు తఱచుగా సర్వపూజలందును నొక సాధారణ రీతియున్నది. పుణ్యాహవాచనము, స్వస్తివాచనము, జలశుద్ధి, సూర్యార్ఘ్యము, గణేశపూజ మున్నగునవి. సంకల్ప ఘటస్థాపన రహస్యము లిదివఱకే వివరింపఁబడినవి. పుణ్యాహ స్వస్తివాచన సమయముల నెఱుంగవలసియున్నది.

ఆంతర బాహిరము లన్నియునుఁ బుణ్యమయములు. అన్నియును మంగళమయములు. సాంసారికమైన యుద్వేగము చిత్తవిక్షేపము, అశాంతి యనునవి యీ పుణ్యాహవాచనాది మంత్రపాఠకాలమందుఁ దొలఁగిపోవును సూర్యచంద్రాదులైన దేవతలు నిక్కముగాఁ బూజాకాలమందు సన్నిహితులై పూజలను గ్రహించుచున్నారు. తమ యాశీర్వాదముగాఁ బూజా సామర్థ్యము నిచ్చుచున్నారనెడి యనుభవమును యథా సాధ్యముగాఁ జేయవలెను. విఘ్నముల వలన దొలఁగి, పూజకగు శక్తిసామర్థ్యముల లాభము నొందుటకు గణేశాది దేవతలనుఁ బూజించి ఋషి, గురు బ్రాహ్మణులనుఁ బూజించి వారి యాశీర్వాదము నుపార్జించుట యగుచున్నది. కారణమేమనఁగా స్థూల సూక్ష్మములైన సర్వతత్త్వములకు నధిష్ఠాతలై చైతన్యరూపులై లోలోనే

యున్న దేవతల కృప నార్జింపఁగలిగినచోఁ బూజ సఫల మగును. దేవతాగణము దూరస్థమైన లేదనియు నాంతరమందే యున్నదనియు మున్నే చెప్పియుంటిమి. చూడకున్నాళ్లు, నసఁగా వారిని మనము మఱచునన్నాళ్లు వారు దూరస్థు గానే యుందురు. కాని పూజాకాలమందుఁ బూజకుఁడు దేవతావర్గమును గేవల సన్నిహితముగానే దర్శించుట కుద్యమించునపుడు, మఱి వారు దూరస్థులని తలంచుట యుచితము కాదు.

ఈ విధముగా జలశుద్ధికాలమందు "గంగేచ యమునే చైవ" యున్నగు మంత్రములతోఁ బుణ్యనదుల జలములు యథార్థముగానే పూజకుని సమ్ముఖమందున్న జలమందు సన్నిహితములై యావిర్భవించినవని ధరింపవలయును. సూర్యార్ఘ్య ప్రదానము వేళ సత్యముగానే విరాట్సూర్యమండలమందుఁ బ్రవేశించి విశ్వప్రకాశకసూర్యున కర్ఘ్యదానము చేయఁబడు చున్నదని యనుభవించుటకే ప్రయత్నింపవలెను. ఇంకను గ్రంథము పెంచుటేల? ఎపుడెట్టి మంత్రపాఠము చేయఁబడునో అపుడామంత్రార్థానురూపభావముతో హృదయమును నింపించి పూజచేయునపుడు నిశ్చయముగా నాయా దేవతలు సన్నిహితులై పూజలను గ్రహింతురు. ఏదో నొకమంత్రము నర్థము ఉన్న దున్నట్టులు హృదయంగమము కాకపోసి; సర్వవ్యాపకుఁడును, చైతన్యమయుఁడును, స్నేహమయుఁడునైన యొకఁడు సన్నిహితుఁడై యున్నాఁడను నిట్టి ధారణచేయుటచే నామంత్ర పాఠము సార్థకమగును. ఇతి ప్రథమ నాసన శుద్ధిరహస్యము.

# చతుర్ధాసనము - ప్రాణప్రతిష్ఠ

ఈరెండు తత్త్వములును మఱింత గూఢములు. సాధకులు కానివారికిని, సత్యప్రాణ ప్రతిష్ఠాభ్యాసము లేనివారికిని ఇవి సులభసాధ్యములు కావు. ఒక రసాయనశాస్త్రవేత్త, యొక వడ్రంగికి రసాయనశాస్త్రమందలి గంభీర రహస్యములను దెలుపఁబూనినచో నతని ప్రయత్నము వ్యర్థమగునట్లే, అనఁగా వడ్రంగికి వాని బోధము పచరింపనట్లే, గురూపదిష్టమైన యుపాయముతో సాధన చేసి, యాత్మప్రాణమందును విశ్వతశ్చక్షువునందును నెట్లో ప్రతిష్ఠితులు కాఁజాలనివారు, చతుర్ధానప్రాణప్రతిష్ఠల యథార్థరహస్యము నెఱింగికొని, యాశానురూపఫలమునొందు నాశయుండదు. అపుడట్టివారలు మాటిమాటికి నభ్యసించుచుండఁగా, భగవత్కృపచేతను, బూజకునిసుకృతిబలముచేతను మీఁదుద్గమతత్త్వములు సైతము ప్రకాశింపఁగలవు. ఈచతుర్ధానప్రాణప్రతిష్ఠలే కాదు; మును జెప్పిన యా చమనాసన శుద్ధులందును నభ్యాసము లేని వారికీ రెండు తత్త్వములును సులభసాధ్యముగాఁ దెలియఁబడునా? యందురేమో. తొలుత దురూహతత్త్వములుగాఁ దోఁచినవే, యభ్యాసబలముచేఁ గొన్నాళ్ళకు సులభములును స్వాభావికములును నైపోవును. మఱి, యాచమనాసనశుద్ధులందుఁ బూర్తిగాఁ గడతేఱినవారే, చతుర్ధానప్రాణప్రతిష్ఠలయందు సమర్థులు కాఁగలరు. ఆచమనమందుఁ జెప్పఁబడిన యంతర్బహిర్వ్యాపియు దృగ్ఛక్తిమయమును నైన యాకాశమును ధరించుటచేతనే, మన్ను ఱాయి మున్నగు వానితో నిర్మింపఁబడిన ప్రతిమల చక్షువులందును నిట్టి సర్వతోవ్యాపి దర్శనశక్తినే

యారోపించు సామర్థ్యము గలుగును. చక్షువునందే చైత న్యముయొక్క ప్రాకట్యము ప్రధానముగా నగును. చచ్చిన వారికి బ్రతికియున్నవారికిని గల భేదము, వారి మతే యవ యవమును జూడక కేవల చక్షువువల్లనే తెలియును. చక్షు వనఁగా దర్శన సాధనము. ఇదొక యింద్రియము. చైతన్య శక్తి ప్రవాహరూపమును గ్రహించు సామర్థ్యము కలదియే చక్షువు. సాధారణముగా మనము ఏది చక్షువనుకొను చున్నామో, యది చక్షురింద్రియ ద్వారముమాత్రమే. ఈ దారినే దర్శనేంద్రియశక్తి రాకపోకలు చేయుచుండును. ఈ రూపగ్రహణముచేయు నింద్రియముకూడ నొక యిచ్ఛా మాత్రమే. కేవల చైతన్యముయొక్క రూపగ్రహణేచ్ఛయే దృక్ఛక్తి—చక్షువు. ఈ యిచ్ఛను సరిచేయఁజాలుటచేతనే చక్షుర్దానప్రియ కొలఁదియో గొప్పయో సులభసాధ్యమగును. ఎదురనున్న ప్రతిమా చక్షువునందుండియే యీ విశ్వవ్యాపి దర్శనేచ్ఛ, అనఁగా దృక్ఛక్తి ప్రవహించుచుండును. తలఁ చుగా నిట్టి ధారణమువల్లనే యీ విధమైన యనుభవము ప్రస్ఫుటితము చేయగల్గినచో, మన్ను అాయి మున్నగు వానిచేతనైన ప్రతిమలయందుఁ జక్షుర్దానము చేయఁబడు చుండును. ఇటులు చేయఁజాలినపుడే జడప్రతిమలు జీవవం తములును జక్షుష్మయములు నగును. అసలుమాట యేమనఁగా, ముందు పూజకుని యాత్మయందే చక్షువు ప్రతిష్ఠితమగును. అపుడు మాటిమాటికి, నారోప సహా యముచేఁ బ్రతిమాచక్షువునందు దానిని బ్రతిష్ఠించుటగును. "తచ్చక్షుర్దేవహితం...పురస్తాత్" ఇత్యాది మంత్రసహా యముఁగొని యిట్టి యారోపము చేయుటగును. పలుసారులు

మంత్రపాఠము చేయుచు నారోపము చేయఁగాఁ జేయఁగాఁ ప్రతిమాచక్షువులో నుండియే నా దర్శనకార్యముకూడ నెఱవేఱుచున్నదని కనుగొనును. అపుడీ చక్షువే సర్వజగత్తు నుద్భాసింపఁజేయునదిగాఁ బ్రతీయమాన మగును. ఇట్టి ప్రత్యక్షానుభవము రాఁగానే చక్షుర్దానము సరిగా నైనదని తెలిసికొనఁగల్గును. మృణ్మయప్రతిమాచక్షువపుడు జీవవద్దేవ చక్షువులవలెనే దీప్తిమయమును, దర్శనశక్తిమయమును నగును. ప్రాణప్రతిష్ఠ విశేషించి యభ్యసించినవారు, మఱి వేఱుగాఁ జక్షుర్దానమనెడి పనిని జేయకున్నను హాని లేదు. కారణమేమనఁగాఁ, బ్రాణప్రతిష్ఠచేతనే యది సంపన్నమగును. ప్రాణప్రతిష్ఠామంత్రములందు "వాఙ్మనశ్చక్షుః శ్రోత్ర ఘ్రాణ ప్రాణా ఇహాగత్య చిరం తిష్ఠన్తు స్వాహా" మున్నగువానిచేఁ జక్షువు మొదలు సర్వేంద్రియప్రతిష్ఠ చేయఁబడుచున్నది. నాయనా! వాస్తవముగా బ్రాణవస్తువు సర్వేంద్రియ ధర్మమయమైనదే. "అపాణిపాదో జవనోగ్రహీతా పశ్యత్యచక్షుః సశృణోత్యకర్ణః" అనిశ్రుతి. యథాయథముగాఁ బ్రాణప్రతిష్ఠ యగుచో సర్వేంద్రియములును దమంతనే ప్రతిష్ఠితములగును. ముందుగా జక్షుర్దానము చేసివేయఁగల్గినచోఁ దరువాతఁ బ్రాణప్రతిష్ఠ యింతో యంతో సులభసాధ్యమైపోవును. పూజకత్వలాభ మొందుటకై ముందుగానే ప్రాణప్రతిష్ఠాభ్యాసము చేయుట యావశ్యకము. ఏమనఁగా నిదే పూజాంగములలోఁ బ్రధానతమము. ప్రాణప్రతిష్ఠ కాకున్నచోఁ బూజ నిక్కముగా బాహ్యపూజయే యగును. అది యధమాధమ పూజగానే లెక్కింపఁబడును. కాని ప్రాణప్రతిష్ఠ చేయఁగల్గినపుడు ప్రతిమ మఱి వెలుపలిది కాదు. ఆంతరమే

మైపోవును. ప్రాణమయమైపోవును. ప్రాణమువల్లనే ప్రతిమమైన దనడి ప్రతీతియగునపుడు ప్రాణమే ఘనీభూతమై ప్రతిమాకారమున నాకారితమైయున్నదనితోచును అపుడు ప్రతిమయందు స్నేహము, ఆశీర్వాదము, వరము ఇట్టివెన్నో కానవచ్చును. ఆ సౌందర్యమును, ఆ మధురిమను మాటలతోఁ దెలియఁజెప్పఁ జాలము. ఏమైనను నా యహంత సమ్ముఖమందున్న ప్రతిమారూపముతోనే వెలసినదనడి ప్రత్యక్షానుభూతి యగునపుడే సత్యముగాఁ బ్రాణప్రతిష్ఠ మైనదని తెలియవచ్చును. ఈ యవస్థయందు విధిపూర్వక పూజాక్రమము తప్పిపోఁగలదు. పోనీ, భయములేదు. దీనివలనఁ బూజయందుఁ గొఱఁత రాదు. సరిగదా, యిదే పూజయొక్క పూర్ణసాఫల్యము.

ఇపుడొక శంక కలుగఁగలదు — ఈ విధముగా బ్రాణప్రతిష్ఠ యగుటచే మఱి పూజ్య పూజక భేదముండదు గదా! ఎవరెవరి పూజ చేయుదురు? పూజకుఁ డెవఁడు? పూజ్యుఁ డెవఁడు? అని. ఔను. అట్టి యవస్థయందు నిక్కముగాఁ సరిగాఁ బూజ సాగదు. కాని యీ యభేదావస్థ సామాన్యముగా క్షణమాత్రమే యుండును. మఱుక్షణమందే యించుకంత భేదభావము మఱల నుదయించును. ఈ భేదభావము పూర్తిగా వేర్వేఱు పదార్థములకుండు భేదమువంటిది కాదు. బిందుసింధులకువలె స్వగతభేదమాత్రమే. క్షణక్షణమందును నభేదభావమును, ఉత్తరక్షణమందే భేదభావమునుఁ దల చూపును ఈ యవస్థయందే పూజసాగుచుండును. ఈయవస్థయందే పాద్యము నర్ఘ్యము మున్నగు నుపచారములు యథాసంభవముగా నర్పించుట యగును. (ఉపచారార్పణము మున్ముందు చూడనగును.) ఈ భేదాభేదము లెట్లు సంభవించు

నంటేని, అది వ్రాసి తెలియఁజెప్పఁబడదు. అది యుట్టి దన
రాని యొక యవస్థావిశేషము. అనుభవశీలురైన సాధకులే
దానిని స్వయముగాఁ నందఁగలరు. ఇట్టి భేదాభేదజ్ఞానముతోఁ
బూజ చేయఁగాఁజేయఁగా గురుకృపచే విశుద్ధమైన యద్వయ
తత్త్వ ముద్బోధిత మగును. అపుడు నిష్కామపూజకులైన
వారు 'అహం బ్రహ్మాస్మి' యనెడి జ్ఞానమందు నిల్చి జన్మ
మృత్యు సుఖదుఃఖముల యావలిగట్టు చేరిపోవుదురు. మఱి
విశేషకామనతోఁ బూజించువాఁడును ఈ భేదాభేదమనెడి
యనిర్వచనీయావస్థకువచ్చి, యపుడు విషయస్మరణము చేయఁ
గల్గెనేని నిశ్చయముగా నాతని కామన పూర్ణమైపోవును.

ఇప్పుడు ప్రాణప్రతిష్ఠా విషయమున నొక సంకేతము
చెప్పఁబడును. పరమేశ్వరు కృపచే నిది యెచ్చటను, ననధికా
రులచేతను బడి విస్మృతమును లాంఛితమును గాకుండుగాక యని
నాకోరిక. బుద్ధిశాలురైన పాఠకులు ఈ సర్వసంకేతములతోనే
యభీష్టమూర్తియందుఁ బ్రాణారోపణ కౌశలము నెఱుంగఁ
గలరు. మూర్తిపూజయందు మాత్రమే యొక యధివాస
విధానమున్నది. పూజా పూర్వదినమందు సాయంకాలము
చేయఁబడును. అభావపక్షమునఁ బూజాదినమందైనను జేయు
నాచారము గలదు. మృత్తికాగంధశిలాదులైన మాంగళ్య
ద్రవ్యములను మంత్రపూతములుగాఁ జేసి ప్రతిమ యొక్క
హృదయము, మస్తకము, శిఖ, కవచము, నేత్రము, నాభి
మొదలుకొని చేతివ్రేళ్ళ, కాలివ్రేళ్ళవఱకును స్పృశింపఁజేయు
దురు. ప్రతిమయొక్క ఈ సర్వస్థానములందును నధివాసము
చేయునపుడు, తన యవయవములయం దాయా చోటుల
విశిష్టానుభూతిలక్ష్యము చేయఁబడును. ఆరోపసహాయముతో

నీ యనుభవము సులభముగానే చేయఁగల్గును. ఇట్టి యారోప స్థాపన సాఫల్యమునకే యన్నిటికంటె ముందుఁ బ్రతిమ యందు సత్యప్రతిష్ఠ చేసి యాంతరబోధమును మొలకెత్తించును. అనఁగా "నేను మున్స్తాబయి, వస్త్రులను ధరించి, ప్రతిమను గప్పివేసితిని ఈ మూర్తి నాలోపలనే యున్నది. ఈ మూర్తిరూపములో నా యంతరమే నిలయుచున్న"దనెడి సత్యధారణ యగును. ఇట్టి ప్రత్యయానుభవములోనిదే అధివాస క్రియ. ఈ యారోపసహాయముచే నగు ననుభూతి లాభమును గుర్తించియే శాక్తులు స్త్రీవేషమును ధరించియు, వైష్ణవులు విష్ణుసమాన రూపమును, శైవులు శివసమాన రూపమును ధరించియుఁ బూజించు ప్రథ యున్నది. ప్రతిమ యొక్క హృదయ శిఖాది స్థానములందు హస్తార్పణమును, నాయా మంత్రోచ్చారణముతో నాయా యాంగళికి ద్రవ్య స్పర్శనమును మున్నగు ప్రక్రియల సాయముతోఁ బూజకుఁడు తన యవయవములయం దారోపణము చేయుటే యగును. ఇట్టి యారోపణము సరిగానున్నదా, లేదా ? యని తెలియు నుపాయ మేమనఁగాఁ బూజకుని వేర్వేఱవయవములందు నొక సుఖమయ స్పర్శానుభూతి వెలయును. అప్పుడప్పు యీ స్పర్శానుభవము వేర్వేఱవయవములయందు వేర్వేఱుగాఁ గాక, ఒక్కసారిగా సర్వాంగవ్యాపి యగును. నూటిమాట యేమనఁగా బ్రతిమయొక్క వేర్వేఱవయవములఁ దాకినపుడు తన యంగస్పర్శ మనుభవమునకు వచ్చునపుడే యారోపము సరిగా నగుచున్నదని తెలియవలెను. మఱి ప్రతిమా మేరుదండమును దన మేరుదండముగా ననుభవింపఁ బ్రయత్నింపవలెను. ఇది చేయునపుడు మూలాధారాదులైన వేర్వేఱు

కేంద్రముల నవలంబించి యనుభవశక్తిని బరిచలింపఁజేయుటయే విశేషానుకూలము. ఈ సర్వకేంద్రములందు బృథివ్యాది తత్త్వములను, నింద్రియశక్తులను ననుభవించుట యగును. ఏమి చెప్పను? ఈ సర్వప్రక్రియలను, బ్రతిమాస్థలములను నాయా కేంద్రములను లక్షించి యుపాసోపసహాయములచే ననుభవమునకుఁ దెచ్చుటగును. ఇట్టిప్రక్రియ నడుపఁగానడుపఁగా మెల్లమెల్లఁగాఁ బ్రతిమయం దాత్మబోధము ప్రకాశింపఁ జొచ్చును. అపుడు పూజకుఁడు తీవ్రప్రయత్నముచేఁ దన ప్రాణమును అనఁగా జైతన్యసత్తను ఈ ప్రతిమయందే దర్శించుచు 'ఆం హ్రీం క్రోం' మున్నగు బీజాక్షరములను, 'ప్రాణా ఇహ ప్రాణాః' మున్నగు మంత్రములను సహాయముగాఁ గొనును. ఇదే ప్రాణప్రతిష్ఠయొక్క సాధారణ సంకేతము.

కాని, యొక్కమాట చెప్పుచున్నాను — ఈ యుపాయముల నన్నిటి నుల్లంఘించినను, బరదేవతాకృపచే నక్కడక్కడ నాకస్మికముగాఁ బ్రతిమయందుఁ బ్రాణప్రతిష్ఠ యైపోవును. మఱియొకొక్కచోట నిన్నియుపాయములచేత సయితము ఆశానురూపప్రతిష్ఠ కాకున్నది. కావున మును జెప్పిన ప్రక్రియల నవలంబించినచో యథాయథముగా బ్రాణప్రతిష్ఠ యగునని నిశ్చయించి చెప్పలేము. కాని మును జెప్పిన ప్రక్రియల నవలంబించుటచే నాశానురూప ప్రాణప్రతిష్ఠ కాకున్నను, నిక్కాలమందు సాధారణముగా జరుగుచున్న పూజలనుబట్టిచూడఁగా నది వేయింతలు శ్రేష్ఠమనిమాత్రము నొక్కి చెప్పఁగలము. నాయనా! ప్రాణప్రతిష్ఠ యనఁగా దేవతావిర్భావమని యర్థము. పూజకుఁడు ఏ దేవతను బూజించుచున్నాఁడో యా దేవత కృపాపూర్వకముగా సమ్ముఖప్రతిమ

యందు విశేషించి వెలయనంతదాఁక, వేయి ప్రక్రియలచేత నైనను దేవితావిర్భావము కాదు. ఏమనఁగాఁ బ్రతిమయందు ఆవిర్భవించుట, ఆవిర్భవింపకుండుట యనునది దేవతయొక్క యిచ్ఛపైనే పూర్తిగా నిర్భరపడియున్నది. కావునఁ గేవల పురుషార్థప్రయోగమువలన అనఁగా మంత్రపాఠము మున్నగు ప్రక్రియలే ప్రాణప్రతిష్ఠకైన యుపాయములని యెన్నఁడు నెన్నఁజాలము. దానితోఁ పూజకుని సరళచిత్తముతోడి గంభీర కాతరప్రార్థనములును ఆవశ్యకములే. పలుతావులందు యే మంత్రమును నే ప్రక్రియయుఁ దెలియకున్నను వ్యాకుల ప్రార్థనాప్రభావముచేతనే పూజకుఁడు ప్రతిమయందు దేవత నావిర్భవింపఁజేయ గల్గుచుండుట కనుచున్నాము. దీనిచేఁ బ్రక్రియలకంటె దేవతాకృపపైనే నిర్భరపడియుండుట ఫల దాయకమని తెలియుచున్నది. అటులని యెట్టి ప్రక్రియను జేయక కేవల కృపపైనే యాధారపడి కూర్చున్నచో నాశకుఁ దగిన ఫలమును గలుగదు. ఇట్లుచేసి యనేకులు వ్యర్థ మనో రథు లగుచున్నారు. పలుమాటలేల ? దేవతాకృపయు, పురు షార్థప్రయోగమును నుపయుక్తకాలము ననెడి మూడు నిమిత్త ముల నవలంబించి చేసినపుడు సర్వకార్యములును సఫల మగును.

సరే, యపుడు ఆత్మప్రాణమునందుఁ జక్కఁగాఁ బ్రతి ష్ఠితులైన సాధకపురుషులు ఎట్టి ప్రక్రియా విశేషము నుల్లం ఘించినను బ్రాణప్రతిష్ఠ చేయఁగల్గుదురు. కారణమేమనఁగా వారియెడ నా దేవత సర్వదా ప్రసన్నమై కృపామయమై యుండును వారి యిచ్ఛ వేఱుకాదు. ఏలన, వారు దేవత యందు ఆత్మసమర్పణము చేసి పూర్తిగా నిశ్చింతులై యు

దురు. ఇట్టి యవస్థయందు వారిలోఁ నెదేని విశిష్టేచ్ఛ వెలయు నపుడు వారది పరమేశ్వరునిచ్ఛయే యని తలంతురు. కావునఁ బ్రాణప్రతిష్ఠాక్రియయందుఁ గడతేఱిన సాధకులు ఏ ప్రతిమ యందు ప్రాణప్రతిష్ఠ చేయఁగోరినను దానియందే దేవతా విర్భావము తప్పకగుచుండును.

## ఉపచారార్పణము

దేవతావిర్భావమగునప్పుడే యథాసాధ్యముగాఁ బూజ అనఁగా నుపచారార్పణము చేయవలెను. ఇట్లనుఁడు; అట్టివేళఁ బూజకుఁడు పూజ చేయకుండఁజాలడు. తన సర్వస్వము నభీష్ట దేవతాపాదములందుఁ బడవేయఁ బూనుకొనును. తఱచుగా నతనికి "గుండెచీల్చి గుండెకాయను నా ప్రాణారాధ్యయొక్క రక్తచరణములం దర్పింతు"నను కోరికయుఁ గలుగును. అంత తోను దృప్తికాదు. "జన్మజన్మాంతరములనుండియు, యుగ యుగాంతరములనుండియు నెవరిసంధానమును జేయుచున్నానో, తెలిసియో తెలియకో భోగములలోనేయుండి, లేదా వైరాగ్య మార్గమందే యుండి యెవరిని దెలియక యెంత సంధానము చేసితినో, యెవ్వారి పరితృప్తికై యనాదికాలము నుండియు నెన్ని జననమరణ దుఃఖయాతనలలో నలిగి యోర్చికొని వచ్చు చుంటినో వారే, యీ నా ప్రాణనిధియే నేఁడు నాయెదుట నిల్చినది. ఆహా! నేనేమిచ్చి వారిని బూజింతును? ఈ పృథ్విపై నున్నదంతయు, నీ బ్రహ్మాండమందున్నదంతయు నా బ్రహ్మాండ నాయకుని పాదములం దర్పించి, యనాదిజన్మములందైన కృత ఘ్నతాభారమును జులకబెట్టుకొందును. ఇపుడు తడవెంతో లేదు. ఇదే నాహృదయదేవతావిర్భావము. ఇదెంతకాలమో

నిల్వాదు ఇపుడు గాకున్నను, ఒక్కడె వెనుకఁదెచ్చి యథా సాధ్యముగా నుపచారముల నర్పింతు ననుకొనుటకవకాశము లేదు." కావునఁ బూజ మొదలిడుటకుమున్నే యుపచారము లను గూర్చుకొని యుంచికొందురు. అర్ఘ్యము, పాద్యము, ఆచమనీయము మున్నగు నుపచారద్రవ్యము లెంత యల్పము లును సామాన్యములే యగుఁగాక, అవి దేవతాయోగ్యోప చారములే యనెడి సత్యధారణ చేయవలయును. కనుకనే శాస్త్రములందు ఉపచారద్రవ్యముల నర్చించి యర్పణము చేయు విధానము గలదు. "అర్చిత మ్మ్యతాయ దద్యాత్" పాద్యార్ఘ్యాదులగు నుపచారములను గంధ పుష్పాదులతో ముందుగా నర్చింతురు. ఉద్దేశమేమనఁగా సత్యప్రతిష్ఠాసహా యముతో నీ సర్వద్రవ్యములనర్పించి చైతన్యమయములుగాఁ జేయుటయే. ఉపచారద్రవ్యములను చైతన్యమయములుగాఁ జేయఁగల్గుటచేతనే యా దేవతకు యోగ్యోపచారములుగాఁ బరిణమించును. దేవత లేక దేవతయెదుట దేవతాచరణ ముల నెవ్వరు సమీపింపఁగలరు? కావునఁ బాద్యము అర్ఘ్యము మున్నగు నుపచారముల కధిష్ఠాత్రియైన దేవతను ముందు స్మరించియే పూజచేయుటగును. వేర్వేఱు ద్రవ్యముల యధిష్ఠాన దేవతలకు వేర్వేఱు పేళ్లుగలవు. ఆయా నామములు తెలియకపోవుటచేత నొక్క విష్ణుని బూజించుటచేతనే యుద్దే శ్యము నెఱవేఱఁగలదు. ఏమనఁగా 'సర్వం వా విష్ణుదైవతమ్' విష్ణువే సర్వద్రవ్యముల కధిష్ఠానదేవతగా సంతతట వెలయు చున్నాఁడు. కావున విష్ణుని బూజించుటచే విభిన్నదేవతల పూజ సంపన్నమగును. కనుకనే యీ దేశమునందగు పూజ లలో ననేకోపచారములగు నధిదేవతారూపముగా విష్ణు

పూజయే జరుగుచున్నది. పూజాప్రణాళి యిట్లున్నది —
"ఏతే గంధపుష్పే, ఓం పాద్యాయనమః। ఏతదధిపతయే, ఓం విష్ణవే నమః। ఏతత్సంప్రదానాయ అముక దేవతాయైనమః॥" తోలుతఁ బాదప్రక్షాళనార్థము పరికల్పితమైన జలమును లక్షించి పూజచేయుటగును. ఈ నామరూపాత్మక స్థూలాంశమునే సత్యజ్ఞానముతోఁ బూజ్యజ్ఞానముతో గంధపుష్పములచే నర్చింపవలయును. ఈ విశిష్ట నామరూపములుదయించిన వ్యాపకచైతన్యసత్తయందు లక్ష్యముంచి, యధిపతిదేవతారూపముతో, విష్ణురూపముతో, జగద్వ్యాపక చైతన్యరూపముతోఁ బూజింపవలయును. తరువాతఁ బ్రాణప్రతిష్ఠచేయఁబడిన యే ప్రతిమయందు దేవతాపూజ యారంభమైనదో, దాని నాత్మచైతన్యముయొక్క ఘనీభూత విశ్వాసస్వరూపమైన ప్రతిమగాను, ఏప్రతీకమందు నీవు లక్ష్యముంచితివో దానినే సంప్రదాన (కారక) రూపముగాను దర్శించి యర్పించునపుడు విశిష్టప్రార్థన మంత్రపాఠములతో, నదివఱకే చైతన్యమయములుగాఁ జేయఁబడిన పాద్యాద్యుపచారములను శ్రద్ధతో నర్పింపవలయును. తక్కిన యుపచారముల సంబంధమందును నీవిధముగానే యని తలంచునది.

ఇచట మంత్రపాఠముచేతనే పూజాఫలము పూర్తిగా లభించు ననరాదు. మంత్రార్థమున కనురూపమైన భావముతోఁగూడి పూజ చేయవలయును. ప్రత్యక్షదేవత కుపచారముల నర్పించుటకై పూజకునిలో నెట్టి సత్యభావోన్మేషమగునో, యట్టి సత్యభావమును బట్టియే యథాసాధ్యముగాఁ బూజింపవలయును. ఒకవంక నుపచారముల లోటుపాటులను జూచుటయు, రెండవవంకఁ బూజనీయ దేవతయొక్క సర్వ

వ్యాపకత్వము, సర్వశక్తిమత్త్వ మహత్త్వములను దర్శించుచుండఁగా ప్రాణశక్తి తనంతనే పొంగి పొరలును. ఈ విధముగా భావాపన్నుఁడై పరమేశ్వరుని బూజింపవలయును. మఱియొకలాగయినచో నాశానురూప ఫలమును దృప్తియు లభింపదు.

మఱియొక్కమాట — పూజోపచారము లెంత న్యూనములే, హీనములే కానిమ్ము. వానినే స్వర్గీయ భావముతో మహార్ఘ దివ్యరూపముగా భావింపవలయును. పూజకై సిద్ధపడునపుడు యథాశక్తిగా యథాసంభవముగాఁ బవిత్రములైన యుపచారములను సంగ్రహించుటే యావశ్యకము. శాస్త్రకారులు "విత్తశాఠ్యం న కారయేత్" అనఁగా నీకున్నదానిని బట్టి కృపణత్వమును విడిచి, అనఁగా సామర్థ్యమున్నను లోపము చేయక పూజింపుమనిరి. కావున యథాసాధ్యముగా శ్రేష్ఠమైన యుపచారములను సంగ్రహించి పూజాప్రయత్నము చేయుటావశ్యకము. నీ వెంతటి శ్రేష్ఠోపచారములను సంగ్రహించుకొని కూర్చున్నను, జగత్పతి పరమేశ్వరుని యెదుట నవి యన్నియు నిశ్చయముగా హీనములుగానే న్యూనములుగానే తోఁచును. అపుడు వానిని స్వర్గీయభావముతో మహద్భావముతోఁ బరికల్పనము చేయవలయును. ఇట్టి కల్పనము మిథ్య యేనాఁడునుంగాదు. ఏమనఁగా, ద్రవ్యసమూహము భావముకంటె వేఱేమియుంగాదు. భావమే యీజగత్తు భావముల పూజయే యగుచున్నది. చూడు — నీవు కూపజలముతో విశ్వపతి పూజ చేయుచున్నావనుకో; అపుడీ కూపజలమునే స్వర్గంగా జలముగాఁ గల్పించితివేని, అది నిక్కముగా మందాకినీ జలముగానే పరిణమించును.

ఇటులే సర్వోపచారముల నెఱుంగునది. సాధకులైనవారు, ఉపచారములను సుహృద్భావముతో దివ్యభావముతోఁ బరికల్పితములుగాఁ జేయుచు నభీష్టదేవతాసన్నిధిని బెట్టఁజాలరు.

ఇట్టి పూజయందు గుర్తింపఁదగిన దేమనఁగా, నుపచారద్రవ్యములను జైతన్యమయములుగాఁ జూచి యర్పించి, పూజనీయదేవత నుద్దేశించి యర్పణ మారంభించిన యెడలఁ బూజాంగములన్నియుఁ జైతన్యమయములై పోవును. అనఁగాఁ బూజ్యము, పూజకుఁడు, పూజాద్రవ్యములు, పూజ – యివన్నియు నొక యఖండచైతన్యము యొక్క విశిష్టాభివ్యక్తిగానే గానవచ్చును. అపుడు సత్యముగా "బ్రహ్మార్పణం బ్రహ్మహవిర్బ్రహ్మాగ్నౌ బ్రహ్మణా హుతమ్" అగుమనే పూజ నడచిపోవును. కర్త, కర్మము, కరణము, సంప్రదానము అనునన్నిటియందును నొక యఖండ బ్రహ్మసత్త లక్షింపఁబడుచుండును. ఇట్టి పూజాఫలముగా, ననఁగా నీ బ్రహ్మరూపకర్మసమాధిఫలముగా బ్రహ్మత్వలాభమగుచుండును. అద్వయబ్రహ్మమందుఁ బ్రతిష్ఠితుఁడగును భక్తి జ్ఞాన కర్మముల సమన్వయమీ భావముతో సుసంపన్నమగును. కొందఱు జ్ఞానికిఁ గర్మాధికారము లేదందురు. వారును నిట్టి బ్రహ్మకర్మానుష్ఠానమును నిషేధింప లేదు; సరిగదా జ్ఞానలాభమైన తరువాతఁ గూడ లోకశిక్షార్థము బ్రతికియున్నంతకాలము నిట్టిసత్కర్మానుష్ఠానమును మాటిమాటికి నుపదేశించిరి. కర్మము బంధనమే యనుమాట యజ్ఞానకల్పితము. ఏమన యథార్థముగా సర్వకర్మములును బంధనమును గలిగించునవియే. అవి యహంకర్తృత్వబోధముతోఁ గూడి కామ్యకర్మములేయైనను క్రమముగా మున్ను జెప్పిన బ్రహ్మకర్మసమాధిగాఁ బర్యవసితములే

మైనచో నచిరకాలమందే యీ కర్మసమూహకర్తృత్వము అసఁగా బంధనజనకత్వమునశించును. కర్మముయొక్క ప్రత్యాగమందును బ్రహ్మదర్శనాభ్యాసమైనచో నట్టి కర్మము బంధనకారక మగుటెట్లు? కామ్యకర్మములు చేయఁగాఁ జేయఁగా మనుష్యుఁడు నిష్కర్మాధికారి యగును. నిష్కామకర్మమే చిత్తశుద్ధి విషయమున సాక్షాత్కారణము. ఇట్టి చిత్తశుద్ధి గలవానికి జ్ఞానలాభము తప్పకగును జ్ఞానలాభానంతరము నిష్కామకర్మానుష్ఠానమే మనుష్యునికిఁ బ్రకృతిసిద్ధమై పోవును. ఈమాటయే బహుశాస్త్రములు, ఆచార్యులు నుపదేశించినది.

సరే మన ముపచారార్పణమును గూర్చి చెప్పకొనుచుంటిమి. తుట్టతుది యుపచారము ప్రణామము. ప్రకృష్టముగా నతఁడు కాఁజాలినపుడే యుపచారార్పణము సార్థకమగును. అర్ఘ్య పాద్య వస్త్ర పుష్పాదుల నర్పించి యర్పించి పూజకుఁడు తన యహంతను గొనిపోయి నిర్విచారముగా నభీష్టదేవతా చరణములం దర్పింపఁగలుగునపుడే పూజ సార్థకమగును. పూజ, ఉపాసము, ధ్యానము, యోగము, జపము ఏదేననుము; సర్వము నీ ప్రణామమునకొఱకే. కల్పితమైన 'నేను'ను జన్మ జన్మాంతరములనుండి పోషించుకొని వచ్చుచున్నాము. అన్నిటినిబట్టి చూడఁగా మనుష్యుఁడు దేనిని సత్యముగా నెంచి విచరించుచున్నాఁడో, దేనిని రక్షించుటకు, దేనిని దృప్తినొందించుటకు జీవుఁ డనుక్షణము వ్యాకులుఁడగుచున్నాఁడో యా 'నేను'ను—(అహమ్) గైకొని యేది యథార్థమైన నేనో, యేది పరమేశ్వరుఁడో, యేది పూజనీయ దేవతారూపముతో నీయెదుట నున్నదో దాని చరములందు ఈ 'నేను' నర్పింపఁగల్గునపుడే యథార్థ ప్రణా

మము చేయుటగును. మనుష్యత్వలాభమున కిదియే తుట్టతుది యుపాయము. బ్రతికియున్నంత కాలము ప్రణామములు చేయుచు నొక్కసారియైన నిట్టిప్రణామము సిద్ధమగునేని, జీవనాంత కాలమందైన నొక్కసారి యిట్టి ప్రణామము చేయఁగల్గునేని, యపుడే మనుష్యత్వము సార్థకమగును కావుననే దూరదర్శులైన యాచార్యులు పూజోపచారవర్ణనప్రసంగమున వందనమునే (ప్రణిపాతమునే, తుది యుపచారముగా గ్రహించిరి. గీతలందు భగవంతుఁడు తానే, పత్ర పుష్ప ఫల జలములను భక్తితో నర్పించునపుడు వానిని నేను క్షుధార్తుఁడన్నమును వలెనే తాత్పర్యముతో గ్రహించి భుజింతునన్నాఁడు. కావున బూజాసర్వాంగములందును భక్తి కలియకున్నచోఁ బూజ సఫలము కాదని వేఱ చెప్పవలయునా? సర్వవిధముల యుపచారముల సద్భావమందును, నసద్భావమందును బ్రణామమనెడి తుదియుపచారమునకే ప్రాధాన్యము. సర్వోపచారములును సద్భావసంపన్నములయినను, యథార్థముగాఁ బ్రణామము కాదేని పూజకుఁడు సఫలుఁడు కాఁడు. ఇఁక సర్వోపచారములు నసద్భావసంపన్నములేయైనను నొక్క యథార్థ ప్రణామముతోనే పూజ సుసిద్ధమైపోవును. కావునఁ బూజ చేయఁగోరువారు యథార్థ ప్రణామ మెట్టిదో నేర్చికొనక తప్పదని సంకోచింపక చెప్పుచున్నారు.

ఈ తుద నొక్కమాట యప్రాసంగికము కాదు. మనము జగదీశ్వరుని చరణములందుఁ బూర్తిగా నవనతులము కాఁజాలము, గనుక మన దీనత, హీనత మున్నగునవి తొలఁగకున్నవి. సకలజగదధీశ్వరుఁడై మనకే కాంతనాయకుఁడైయున్న వాని చరణములందు మన కల్పితాహంబోధమును బూర్తిగా

నవనతము చేయఁగల్గుటచే మన దీనతాహీనతలు బొత్తిగాఁ దొలఁగిపోవునని తెలిసికొనలేము. కనుకనే మనకుఁ బరముఖాపేక్షతో జీవనము గడుపుట యగుచున్నది. ఈ విధిపూర్వక ప్రణామము లర్పించు ఫలముగా మనలోను వెలిని విశ్వపతి యొక్క యవ్యయసత్తయే వికసించును అపుడే స్వరూప ప్రతిష్ఠలమును, స్వారాట్టులము గుదుము.

## బలిదానము

గొఱ్ఱెలు, కోళ్లు మున్నగువానిని బలియిచ్చు ప్రథ, యీదేశమందగు దేవీపూజలందుఁ జిరమునుండియు సాగుచున్నది ఇది శాస్త్రవిహితమే. పశుబలిసంబంధమునఁ బలువురు పలువిధములుగా నందురు. కనుక శ్రీగురు కృపచే మన కేమి తోఁచునో యది వెల్లడించుట సంగతముకదా! "దేవాన్ పితౄన్ సమభ్యర్చ్య ఖాదన్ మాంసం న దోషభాక్" దేవతలను బితృదేవతలను బూజించి చేయు మాంసభోజనముచే దోషములేదని శాస్త్రాదేశము. ఆత్మవత్సేవ పేరే పూజ = ఏపూజకుఁ డెట్టి పూజచేసి పరితృప్తుఁడగునో యట్టి భావముతోనే పూజనీయదేవత పూజ సేయుటగును. పూజకుఁడు మత్స్యమాంసాభిలాషియైనచోఁ దన యిష్టదేవత నట్టి యుపచారములతోఁ బూజించుట తప్పదు. అటులు చేయకుండుటే యన్యాయము. కనుకనే శాస్త్రమందును, బూజావిశేషమందామిష (మాంస) భోగమును, బశు బలిదానమును జెప్పఁబడినవి. వృథా మత్స్యమాంసాదిభోజనము శాస్త్రనిషిద్ధము కావున, మాంసప్రియజనుల విషయమున నిట్టి పూజ చెప్పఁబడినది. సాత్త్విక, రాజసిక, తామసిక భేదముచేఁ బూజ

మూడువిధములు. వటుక భైరవదేవతా పూజయందు మనకు గానవచ్చుచు. ఒక్క వటుకభైరవదేవతాపూజయందే సాత్త్వికాది భేదముతో మూడువిధముల ధ్యానము వర్ణింపఁబడినది. ఇందువలన నన్నిపూజలును మూడువిధములుగా జేయఁబడగలవు. ఇదే శాస్త్రసిద్ధము. ప్రకృతిసిద్ధము. అసలుమాట యేమనఁగాఁ బూజకుని యధికారమునుబట్టి పూజాప్రకారమందు భేదముండును. గీతయందు వర్ణింపఁబడిన త్రివిధకర్తల భేదమునుబట్టియే పూజయును మూడువిధములుగా నగును. పాఠకుల సుగమతకై గీతయందలి త్రివిధ కర్తృలక్షణములను జెప్పుచున్నాను.

ఫలాకాంక్ష లేనివారును, అహంకర్తృత్వబోధ రహితులును, ధృత్యుత్సాహములతోఁ గూడినవారును, కర్మసాఫల్యమందును, నిష్ఫలతయందును, నిర్వికారముగా నుండఁగలవారే సాత్త్వికకర్తలు. విరాగి, క్రోధి, కర్మఫలాకాంక్షి, లోభి, హింసాశీలుఁడు, అశుచి, సుఖదుఃఖహర్షవిషాదములకు లోఁగినవాఁడే రాజసికకర్త.

అయుక్తుఁడు, అనఁగా నభీష్టదేవతయందు సమాహితచిత్తము లేనివాఁడు, మలినబుద్ధి, స్తబ్ధుఁడు — కొయ్యబోతు, ధూర్తు — ఇతరుల వృత్తిని జెఱచువాఁడు, ఇతరుల నవమానించువాఁడు, అలసుఁడు, దీర్ఘసూత్రియునైనవాఁడే తామసికకర్త యని చెప్పఁబడెను.

మనుష్యుని మఱియొక పేరే కర్త. కావుననే మనుష్యజాతినంతటిని భగవంతుఁడు మూఁడు విధములుగ విభజించినాఁడు. మనుష్య ప్రకృతియందు లెక్కలేని వైచిత్రములున్నను, అవి స్థూలముగా నీ మూఁడు ప్రకారములందే విభ

జింపఁబడగలవు. సాత్త్విక, రాజసిక, తామసిక ప్రకృతులలో నేదేనిగానిమ్ము; మనుష్యులెల్లరు జగదీశ్వరుని స్నేహామయాంకమందే యున్నారు. కావున నెల్లరును దమతమ యధికారములకుఁ దగినట్లుగా నీశ్వరపూజయందు సమర్థులు. మనుష్యుఁడీ సాత్త్వికాదులలో దేని కధికారిగా నున్నాఁడో, వాడట్టి భావముతోనే పరమేశ్వరుని బూజించును. ఈ యధికారములను గుర్తించియే శాస్త్రకారులు సాత్త్వికపూజయందు మాంసభోగము పశుబలిదానము చెప్పలేదు. రాజసిక తామసిక పూజలందే యిట్టి విధానముం జేసిరి. కావున దేవపిత్ర్యకార్యములందుఁ బశుబలి విధానము గానవచ్చుచోట్ల, నది మున్ను జెప్పిన రాజసిక తామసిక కర్తల పక్షమందే ప్రయోజ్యము. సాత్త్వికకర్త విషయమునఁగాదు. మఱియు, వాస్తవిక సాత్త్విక ప్రకృతి గలవారి పక్షమున నిట్టి పశుభావాది హింసామూలక కార్యములు జరుగుట బొత్తిగా నసంభవము. కొందఱు, పశురక్తములేకున్నచోఁ గాళీపూజాదులు బసుసిద్ధములు కానేకావందురు. తంత్రశాస్త్రమందిట్టి మాట కలదు. నిజమేకాని యదియు మున్ను జెప్పిన రాజస తామస కర్తల సంబంధముననేయని తెలియవలెను. ఇది తెలిసియుఁ గర్త సాత్త్విక పూజాసంబంధమైన మాటలనే యఱచుచును, నసఁగా నహింస వాచనికముగానే చేయుచుఁ దన దేవపైత్ర్యాది కార్యములందు విధిని విడిచిన యెడల, వాని దేవపిత్రృకార్యము లెన్నడును సుసిద్ధములు కాఁజాలవు. ఒకవంక శాస్త్రవిధి నుల్లంఘించుటవలని ప్రత్యవాయమును, రెండవవంక ఆత్మవంచనరూప దోషమును వానిని జుట్టుకొనును. ఇంతేకాదు, పలుతావులఁ గొందఱు రాజసికకర్తలు

తమ పూర్వులు చేసిన పూజలను, పశుబలిరహితములుగాఁ జేయుటకు సైఁపరాని శోకదుఃఖముల నొందుదురు. మత్స్యమాంసముల రుచిమఱిగి యంగడినుండి వానిని గొని తెచ్చి, చరితార్థతను సంపాదించు వారి విషయమందు మాత్రమే దైవపైతృక కార్యములందు శాస్త్రవిహితమైన విషయమున నామిషభోగము, పశుబలి యిచ్చుట కర్తవ్యము. సరే యపుడు సాత్త్వికకర్తల మాటవేఱు. ఆ కాళీపూజాదులను సైతము సాత్త్వికభావముతోనే నిర్మాంస నైవేద్యాదులతోనే సంపన్నము చేయుదురు. వారి పూజయు సమ్యక్సిద్ధమగును. శాస్త్రమందును సాత్త్వికకర్తల విషయమున నిట్టి విధానమే యున్నది.

ఇపుడొక శంక— "సాత్త్వికపూజయందు బలిదానము నిషిద్ధమైన యెడల, దుర్గాపూజాదులందుఁ జెప్పబడిన స్నాన పూజన బలిదాన హోమముల నెడి నాలుగు ప్రధానాంగములకు నన్యథాత్వము వచ్చును—కావున సాత్త్వికకర్తల విషయమున దుర్గాపూజవలని మహాపూజాతత్త్వసిద్ధి కాకపోఁగలదు." అను నిట్టి యాశంకకు బదులేమనఁగా— సాత్త్విక పూజాస్థలములందుఁ గూష్మాండము (గుమ్మడి పం[illegible]) ఇక్షుదండము (చెఱకు గడ) మున్నగునవి పశువునకుఁ బ్రతినిధిగా నుంచఁబడి బలిదానము చేయఁబడుచున్నది. ఈ విధముగా బలిదానము సిద్ధమగును. గనుక మహాపూజయు సిద్ధమగును. పశుబలి యనఁగాఁ బశుభావమును బలి యిచ్చుట యని యర్థము. కామక్రోధాది పశుభావములను బట్టుకొని మహాశక్తిస్వరూపిణి యైన యమ్మ యడుగులయం దర్పింపవలయును. సాత్త్వికపూజకుఁ డే భావముతో బలిదానము

చేయునో, యది కొంచెము తెలియఁజెప్పెదును — కూష్మాండము మున్నగు వానికిఁ బశురూప కల్పనము చేసి, వాని యందుఁ గామక్రోధాది వృత్తులను, అహంకారము, అవిద్యా వాసనా సంస్కారములు మున్నగు వాని నారోపింతురు. ఒక్కొక్క వృత్తిని లక్షించి వేర్వేఱు భావములతో గంధ పుష్పాదులతోఁ బూజించి యభీష్టదేవతకు యథావిధిగా నర్పించి బలికై (దేవతోపహారమునకై) తేఁబడిన కూష్మాండము మున్నగువానియం దారోపింతురు. తరువాత యథా విధిగా ఛేదించుట మున్నగు పనులు చేయుదురు. సాత్త్విక పూజయందు బలిదాన విధానమిదియే. ఇట్టి బలిదానమును జేసియుఁ బూజకులు కామక్రోధాదివృత్తుల పట్టువలన విడివడ లేక యున్నారు. అయినను దీనియందు బలిదానము సిద్ధము కాలేదనెడి సంశయము లేదు. ఏమనఁగా నిట్లు చేయఁగాఁ జేయఁగా, భగవత్కృపచే నొకనాఁడు సత్యముగానే పశు భావముల బలిదానము సిద్ధమై పోవును. అనఁగాఁ బూజకుని పశుభావములు నిక్కముగాఁ దొలఁగిపోవును. కనుక నిట్టి బలిదాన మెన్నఁడును వ్యర్థము కాదు. మఱి, యుత్తమాధి కారులు జీవాత్మని జీవభావ జడభావములను బశువులుగాఁ గల్పించుకొని భాగాది (గొఱ్ఱెలు మున్నగు) పశువులనే బలి దానముగా నిచ్చినను నట్టిచోటఁ బశుఘాతనము, సాత్త్విక పూజకు వ్యాఘాతమును గల్గింపదు ఏమన నిట్టి పశుఘాతము జీవనమందొక్కసారియే యగును. ఇట్టి పూజను దక్షిణాంతముగా నొనర్చినతోడనే పూజకుని దేహాంతమై పోవును. జీవత్వ జడత్వ సంబంధములో నాత్మకు — చైతన్యమునకు నగు విముక్తియే యథార్థబలిదానము. సరే అది యుండనిండు.

శివపూజ, విష్ణుపూజ మున్నగు పలుపూజలు సాత్త్వికభావముతోఁ జేయుటే, శాస్త్రములందు విధింపఁబడినది. ఈదేశమందుఁ బలుతావుల నీపూజలు అట్టి భావముతోనే చేయఁబడుచున్నవి. మఱి, కాళీపూజ, వటుకభైరవ పూజ, జయదుర్గాపూజ మున్నగునవి రాజసిక భావముతోనే చేయఁబడుచున్నవి. కర్త యొక్కఁడే యీ పూజలనన్నిఁటిని విభిన్న భావములతోఁ జేయుచున్నాఁడు. ఇదియు శాస్త్రవిధానమే. కర్త యించుకంత సత్త్వగుణ సంపన్నుఁడై, లేదా కాఁగోరినవాఁడై రజస్తమోగుణ ప్రభావమువలనఁ బూర్తిగా విముక్తుఁడు కానపుడు, అతఁడే శాస్త్రానుసారవిష్ణుపూజాదులను సాత్త్వికభావముతోను, గాళీపూజాదులను రాజసిక భావముతోను సంపన్నములు చేయును. వాస్తవముగా ననేకు లిట్లు చేయుచున్నారు. పూజయే ధర్మము గాదు. ధర్మలాభము కొఱకే పూజ. ధర్మలాభ ముద్దేశ్యము. పూజదానికైన యుపాయము. రాజసిక తామసిక ప్రకృతివలన విడువఁబడి క్రమముగా సాత్త్విక ప్రకృతియందుఁ జేరవలయును తుదకు గుణాతీత స్వరూపమందుఁ బ్రతిష్ఠితుఁడగుటకే యీ యనుష్ఠానము లన్నియుఁ బ్రయోజనీయములు. కనుక కర్తయొక్కఁడే మున్ను జెప్పిన వేర్వేఱు పూజలను వేర్వేఱు భావములతోఁ జేయుట కేవల స్వాభావికము. మఱి, జీవనమందుఁ దొలుతఁ గొంత భాగము రాజసిక భావముతోఁ బూజించువాఁడు బ్రతికియున్నంత కాలము నటులే చేయుననెడి నియమము లేదు మన మిట్టివారి నెందఱనో చూచుచున్నాము. మత్స్యమాంస భుగ్వంశములందే పుట్టి, మత్స్యమాంసములనుభుజించుచునే కొంతకాలము బ్రతికి, కేవల శాకాహారులుగా మాఱిపోయి తమ కులమందుఁ

జిరాచరితములైన పశుబలిదానాదులను విసఁగొన్నవారి నెంద ఱినో చూచుచున్నాము. ప్రకృతిపరివర్తనముతోనే పూజాది ప్రకారములును మాఱుచుండును. అందులకే శాస్త్రకారీ విషయమున నౌదార్యమునే చూపిరి. చెప్పెడిదేమనఁగా_ ఎవ్వఁ డెట్టి పూజకు నధికారియో వాఁడప్పటి శాస్త్రవిధి ననుసరించియే యాపూజలను జేయవలయును. అధికారమును మీఱి చేయు పూజాదులు తఱచుగా నిష్ఫలములే యగును. ఎవఁడెట్టి యధికారమందున్నాఁడో దానిని నిర్ణయించు విషయమున మున్ను జెప్పిన భగవద్వాక్యమే ప్రమాణము. ఉద్దండ ప్రవృత్తికే యభిముఖమైన యుచ్ఛృంఖల ప్రకృతిని యథార్థముగా నియమించుటకై, కొంతవఱకుఁ బ్రకృతి యనుకూలించుచునేయుండును, గాని పూర్తిగా ననుకూలముగానే పోవుచో మనుష్యుని యధఃపతన మనివార్యమేయగును. మఱియు నొక్కసారిగానే ప్రకృతికిఁ బ్రతికూలముగాఁ బోవుట దుస్సాధ్యము, అసంభవము. "ప్రకృతిం యాంతి భూతాని నిగ్రహః కిం కరిష్యతి" ఈవిషయముల నన్నింటిని జక్కఁగా నాలోచించియే పూజ్యపాదులైన యార్యర్షులు ప్రకృతి గతి సామర్థ్యమును లక్షించి మెల్ల మెల్లఁగా మనుష్యుల నున్నతిమార్గమందు నడుపుటకే చూచిరి. శాస్త్రీయ విధినిషేధములు ఈసత్యముపైనే ప్రతిష్ఠితములైనవి.

రాజస, తామస ప్రకృతిగలవాని నొకని నెల్లప్పుడును సాత్త్వికపూజాదివ్రతినిగానే యుంచినచో ననఁగా నతివడిగా నున్నతుని జేయఁబూనినచోఁ దఱచుగా నా ప్రయత్నము విఫలమే యగుచుండును. ఏలన, నట్టి యధికారి యొక్క వంక సామర్థ్యహీనత కారణముగా సాత్త్వికపూజాదుల నుత్తమ

విధమున సంపన్నము చేయఁజాలఁడు. రెండవవంక వాని ప్రకృతి ననుసరించి సుసాధ్యములుగాఁ జేయఁబడు రాజస తామసిక పూజలచే వంచితుఁడగును. ఈ విధముగా రెండు విధముల స్వార్థమనోరథుఁడై పోవుచు అల్పవయస్కుఁడైన యొక బాలునకుఁ జారశాలకు యోగ్యమైన శిక్షణము నిచ్చుటకు మున్నె, దర్శన విజ్ఞానాది కళాశాలలందు నేర్పఁబడు విషయములను నేర్పుట మొదలిడినచో నెట్టి దుర్దశ వచ్చునో యీ ప్రస్తావితవిషయమందును నట్లే యగును.

భారతీయ ధర్మశాస్త్రములందు నిట్టి యధికార నిర్ణయము స్థిరపడియుండుటచేతనే యీ పామరపండితు లెల్లరు యథాయోగ్యముగా నీశ్వరునిపూజయందు సమర్థులై దానిచే ధార్మికులగు సుయోగము నొందుచున్నారు. ఈ దేశమందలి వారీ విధముగా నేఁటిదాఁక నధికారానురూప ధర్మాచరణమును జరుపుచుండుటచేతనే యిప్పటికిని సర్వధర్మ సంప్రదాయములలోను మహాపురుషులు కొందఱావిర్భవించుట సంభవించుచున్నది. వైదిక తాంత్రిక పౌరాణిక భక్తిమార్గీయ జ్ఞానమార్గీయ యోగమార్గీయ శాక్త శైవ వైష్ణవ సౌర గాణాపత్య రామాయత రాధాస్వామి నానాపంథీ కబీర్ పంథీ దాదూపంథీ మున్నగు లెక్కలేని ధర్మసంప్రదాయములు ఇట్టి యధికారవైచిత్ర్యముపైనే నిల్చియున్నవి. నేఁడును దఱచుగా సర్వసంప్రదాయములందును యథార్థ ధార్మికపురుషులు బయల్వెడలుట చూచుచున్నాము. వారిట్టి యధికారానురూప వ్యవస్థవలనఁ బుట్టిన సుధామయఫలములు. ఇంతే కాదు, ఈ వైదికార్యజాతి నేఁటికిని సమస్తభూమండలము యొక్క ధర్మాచార్యాసనము నలంకరించినది. ఇదియును

స్వాధికారాను రూపోపాసనముయొక్క మఱియొక ఫలము. ఇతర దేశములవలె నధికారవిచారము లేకయే యెల్లరకు సమానరూపముగా నీశ్వరోపాసనములవడియుండు నేని, అనఁగా నెల్లరకు నుపాసనాప్రణాళి యొక్కటేయయి యుండునేని, బహుశః యీ జాతి యిట్టి గౌరవజనక ధర్మగురుస్థానము నొందకపోయి యుండును. సంప్రదాయభేదముచేతను వ్యక్తిభేదముచేతను నుపాసనాప్రణాళియందైన యేర్పాటే యీ జాతియొక్క విశేషత్వము, మహత్త్వము నై యున్నది. మానవ ప్రకృతియొక్క నైసర్గిక వైచిత్ర్యమువలన నుపాసనాప్రణాళియందును వేఱుపాటుండుట కేవల స్వాభావికము. దీనిని గుర్తింపక యెవఁడేని మనుష్యుల కెల్లరకును సమానోపాసనమే కర్తవ్యమన్నచో వాఁడల్పదర్శి, హ్రస్వదర్శి యనక తప్పదు. కాని మన భారతీయ ఋషిగణము మానవ ప్రకృతియొక్క సూక్ష్మతమపార్థక్యమును గుర్తింపఁగల్గినది. కనుకనే యీ దేశమందలి శాస్త్రీయ విధినిషేధములు దేశకాలపాత్రాధికారముల సమ్యగ్విచారముపైని వ్యవస్థాపితములైనవి. ప్రకృతియొక్క యుచ్ఛృంఖలతను (కట్టుబాటు మీఱుదలన) బహిర్ముఖగతిని మెల్ల మెల్లఁగా సంయమించుటకే యీ విధినిషేధము లెల్ల నుద్దేశింపఁబడినవి. కావున నుద్దేశ్యమును యథాసంభవముగా లక్షించి శాస్త్రీయ విధినిషేధములను యథాశక్తిగా ననుశీలించి పాలించుటొక్కటే శ్రేయోలాభమున కుపాయము.

మనము ప్రస్తావించిన బలిదాన విషయమునఁ దుదిసిద్ధాంతమేమనఁగా — సాత్త్విక కర్తలైనవారు, అనఁగా కర్మఫల స్పృహ లేనివారు, హింసాప్రవృత్తికిఁ దొలఁగిపోయిన

వారు, సుఖదుఃఖములందు నిర్వికారులు నైనవారే దేవ పైతృక కార్యములం దెన్నఁడును బలిబలులను, ఆమిష భోగములను సర్పింపరు శాస్త్రములు సాత్త్వికకర్తలకై సర్వ కార్యములందును మాంసరహితనైవేద్యము నే నొక్కి చెప్పినవి. ఇఁక రాజసిక ప్రకృతి గలవారు, అనఁగాఁ గర్మఫల స్పృహ గలవారు, సుఖదుఃఖములకు లోఁగిపోవువారు, మత్స్యమాంస ములందు రుచిగలవారు, తమ దైవ పైత్ర్యకార్యములందు యథాశాస్త్రముగా మత్స్యమాంసాదుల నుపహరింప వల యును. కానిచో వారి కార్యములు సుసిద్ధములుకావు. ఇఁకఁ దామసిక ప్రకృతి గలవారల పూజయం దెట్టి శాస్త్రీయ విధి నిషేధముల యపేక్షయు లేదు. వారు మంత్రవిహీనముగానే కులక్రమాగతాచారములతోఁ బూజలను జేయుదురు. ఇట్టి పూజయు నీదేశమున శిక్షితకులములందు అశిక్షితసంప్ర దాయములతో మిక్కిలిగా జరుగుచున్నవి. ఎంత యప కృష్టుఁడు తుచ్ఛుఁడునైనను సుదురాచారుఁడైనను మెల్ల మెల్లఁగాఁ బరమేశ్వరసత్తయందు విశ్వాసవంతుఁడగుట కిట్టి పూజయును నుపకరించును — ఇపుడు మనము కొన్ని సుప్రసిద్ధ పూజల తత్త్వము నెఱుంగఁ బ్రయత్నింతము.

## గణపతి (విఘ్నేశ్వరుఁడు)

శ్రీమంతంబగు భరతఖండ మందంతటను విఘ్నేశ్వ రారాధనము విపులముగా జరుగుచున్నది. ఏ నామముతోనైన నేమి గణాధిపతిని (జీవగణాధిపతియైనపరమేశ్వరుని) హిందువు లందఱు పూజించుచున్నారు. ఈ పూజ బహు పురాతనము. వేదములందే గణపతి యుగ్గడింపఁబడి యున్నాఁడు. "నిషుసీద

గణపతే గణేషు త్వాహవామహే" "గణానాం త్వా గణపతిగ్ం హవామహే" ఇటులెన్నియో శ్రుతులున్నవి. కొందఱు వేద భాగమందుఁ జెప్పఁబడిన గణపతి బ్రహ్మణస్పతియేగాని వక్రతుండుఁడు కాఁడందురు. అది యనాదరణీయము. వక్రతుండుఁడు బ్రహ్మణస్పతికంటె భిన్నదైవము కాఁడు.

"విఘ్నేశ విధిమార్తాండ చంద్రేంద్రోపేంద్ర వందిత,
నమో గణపతే తుభ్యం బ్రహ్మణాం బ్రహ్మణస్పతే॥"

అని ఋషులు విఘ్నేశుని బ్రహ్మణస్పతిగానె వర్ణించిరి.

"తత్పురుషాయ విద్మహే వక్రతుండాయ ధీమహి,
తన్నో దన్తిః ప్రచోదయాత్॥" — తై. శ్రుతి.

ఈ దేవునిపేర నొక యుపనిషత్తే కలదు. గణపతి పురాణమని యొక పురాణమే కలదు. "ఆదౌ పూజ్యో గణాధిపః" అని యెందైనను ముందుగా గణపతినే పూజింతురు. వైష్ణవులు సకలకార్యాదిని బూజించు విష్వక్సేనుని కంటె నీ గణపతి భిన్నుఁడు కాఁడు. గణమనఁగా ముప్పదియాఱు తత్త్వముల సముదాయము. దానికి బతి కాఁగా గణపతి. విశ్వమనఁబడు షట్త్రింశత త్త్వగణమే యీతనిసేన. అంతటను వ్యాపించియున్న తత్త్వగణమే సేనగాఁ గలవాఁడు. విశ్వమునకు (తత్త్వరూప సేనకు) నాయకుఁడు కనుక వినాయకుఁడు. విష్వక్సేనుఁడు. అన్నివైపుల వ్యాపించియున్న సేన గలఁడు. తత్త్వముల నెడి సేనయే యంతట విశ్వరూపమున వ్యాపించియున్నది. కనుక విష్వక్సేనుఁడు. ఇందువలన వైష్ణవుల విష్వక్సేనుఁడును, ఇతరమతముల గణపతియు నొక్కఁడే. తత్పురుషుఁడే. పరమాత్మయే.

ఏకేశ్వరారాధనమును బోధించు మతములలో నగ్రగణ్యము హిందుమతము. అట్లయిన నీ విఘ్నేశ్వరుఁ డెవఁడందురేని, యితఁడు తత్పురుషుఁడే; పరమాత్మయే; పరబ్రహ్మమే.

"యం బ్రహ్మ వేదాన్తవిదో వదన్తి పరం ప్రధానం పురుషం తథాన్యే।
విశ్వోద్గతేః కారణ మీశ్వరం వా తస్మై నమో విఘ్నవినాయకాయ॥"

ఈ శ్లోకరాజమును బ్రతి హిందువుఁడు నక్షరములు నేర్చినది మొదలు పఠించుచున్నాఁడు. వేదాన్తు లెవనిని బరబ్రహ్మ మనుచున్నారో, అన్యులు సాంఖ్యాదులు నెవనిని బ్రధానపురుషుఁ డనుచున్నారో (ప్రకృతియుఁ బురుషుఁడు నీతఁడే యనుచున్నారో) యట్టి విఘ్నేశ్వరునకు నమస్కారము.

కం. పర విశ్వోద్గతిహేతువు
పరముఁడు, పురుషుండు, ప్రకృతి, బ్రహ్మము, పరమే
శ్వరుఁ డంచుఁ దద్జ్ఞు లెవ్వని
బరికింపుదు రగ్గణాధిపతి నర్చింతుఁన్.

అని సీతారామాంజనేయ సంవాదకారుఁడును గణపతిని బరమాత్మగానే వర్ణించెను.

ఒకచో బ్రహ్మ పరాత్పరుఁడనియు, ఒకచో విష్ణువు పరమాత్మ యనియు, వేఱొకచో శివుఁడు పరదైవతమనియు భావింపఁబడి యుండఁగా, నిపుడు మీరు గణపతియుఁ బరబ్రహ్మమే యనుదురే, ఇందేది సత్యమంటేని, అన్నియు సత్యము లే. వీరందఱు నా పరాత్పరుఁడే. ఆ పరబ్రహ్మమునకే యిన్ని పేళ్లుగాని, యింతమంది వేర్వేఱు దేవులు లేరు. "ఏకమ్ సద్విప్రా బహుధా వదన్తి" ఒక్కటైన సత్పదా

ర్థమును (పరమాత్మను) విజ్ఞులు పలు విధములఁ జెప్పుచున్నారు, అని భావము.

తైత్తిరీయ శ్రుతియందు నారాయణమనెడి భాగమున "అంభస్యపారే భువనస్య మధ్యే నాకస్య పృష్ఠే మహతో మహీయాన్" అని పరమాత్ముని ముచ్చట ప్రారంభమయి—

"తత్పురుషాయ విద్మహే, మహాదేవాయ ధీమహి।
తన్నో రుద్రః ప్రచోదయాత్"

"తత్పురుషాయ విద్మహే వక్రతుండాయ ధీమహి।
తన్నో దన్తిః ప్రచోదయాత్"

"నారాయణాయ విద్మహే। వాసుదేవాయ ధీమహి।
తన్నో విష్ణుః ప్రచోదయాత్"

అను వాక్యములలో నా పరాత్పరుఁడే రుద్రుఁడనియు, వక్రతుండుఁడనియు, నారాయణుఁడనియుఁ దెల్పఁబడినది.

ఒక్కఁడైన భగవంతు నిన్నివిధములఁ బిలువనేల? యందువేని అటులు పిలుచుటయందే చాల సామరస్యమున్నది. ఈశ్వరు నొక్కపేరితోఁ బిలుచువానికంటెఁ బలుపేళ్ళతో వ్యవహరించువారే యెక్కుడు జ్ఞానులు. ఏమన, నీశ్వరుఁ డనంతకల్యాణగుణ పరిపూర్ణుఁడు. అట్టివాని కొక్క పేరు పూర్తిగాఁ జాలియుండదు. వేయివిధముల నాతనిమనము వర్ణించినను బూర్తిగా నిర్వచింపఁజాలము. కనుక ననంత కల్యాణగుణ పరిపూర్ణున కనంతనామము లేర్పడుచున్నవి. కావున శివుఁడు (మంగళప్రదుఁడు), విష్ణువు (అంతట వ్యాపించియున్నవాఁడు), బ్రహ్మము (వృద్ధినొందువాఁడు), విఘ్నేశ్వ

రుఁడు (విఘాతములఁ దొలఁగించువాఁడు) మున్నగు నామములు వేలకువేలు వెలసినవి. ఎన్ని వెలసినను జాలవు.

వర్ణింపనలవికాని యవాఙ్మానస గోచరుఁడైన భగవంతుని పారమ్య మహిమ కల్యాణగుణములను యథాశక్తి యథారుచి ప్రకాశింపఁ జేయుటకు భక్తులనేక నామములను గల్పించుకొనినటులే, యుపాసకుల కార్యార్థమై యాయా నామముల కనుగుణములగు ననేకరూపములు కూడ విజ్ఞులచేఁ బ్రకాశింపఁ జేయఁబడినవి. భగవద్గుణములను గీర్తించు శబ్దములఁ జదువుకొనినవారలు భగవంతుని దెలిసికొనుటకు సాధనములైనటులే, యాయా రూపములును, అజ్ఞులు మొదలు ప్రాజ్ఞుల వఱకుఁ దెలిసికొన సాధనము లగుచున్నవి. ఈ విషయమున నామ మెంత ప్రధానమో ప్రతిమలును నంత ప్రధానములు. 'మూర్తిరహస్యము' క్రిందఁ జూచునది.

ఇపుడు మనము విఘ్నేశ్వరుని మూర్తిరహస్యము నెఱుంగఁ బ్రయత్నింతము. భగవంతుని యనంతగుణములలో విఘ్ననియంతృత్వమును బ్రధానముగాఁ జేసికొని విఘ్నేశ్వరుఁడని వ్యవహరించిరి. ఆ విఘ్నేశ్వరత్వమున కనుగుణమగు చిత్రమైన రూపమును గల్పించుకొని యుపాసించి తాము కృతార్థులై లోకహితబుద్ధితో వెల్లడించిరి. విఘ్నములను దొలఁగించుటకై మేధావిత్వము చతురత్వము నెమ్మది మున్నగు గుణములు ప్రధానములు. మేధ భగవచ్ఛక్తి. కనుకనే "మేధా దేవీ జుషమాణా న ఆగా ద్విశ్వాచీ భద్రా సుమనస్యమానా" అని శ్రుతి యుగ్గడించినది. గజముఖము మేధావిత్వమును దెలుపును. నరవానర కుంజరములు జ్ఞానవజ్జంతువులు. అయినను నరుని జ్ఞానము మాటిమాటికి విషయ

ములచే నాకర్షింపఁబడు స్వభావము కలది. ఈ యాకర్షణమే మనుజుని బహుచంచలుని జేయుచుండును. ఇఁక వానరము జ్ఞానవజ్జంతువైనను స్వభావ చంచలబుద్ధి. మఱి, యేనుఁగు బుద్ధి చాంచల్యదూరము. లక్ష్యమును సాధించు నాగ్రహము కలది. తనదారి కడ్డమైన మహావృక్షాదులను బెల్లగించి, మార్గమును విరళము చేసికొని గమ్యమును జేరును. అట్టి బుద్ధియే బ్రహ్మలక్ష్యమును జేర్చునది యని బోధించుటకే గజముఖ కల్పనము. అది తుండమును బైకెత్తినపుడు ఒాని కుంభములతోఁగలిపి లక్షించినచో 'ఓ' కారమనెడి నర్థమే స్ఫురించును. బిందువును జేర్చినపు డదియే ప్రణవము భగవంతుఁడు ప్రణవస్వరూపుఁడని బోధించును. వర్ణమాలయందలి ఓకారమును (బ్రహ్మమును బ్రహ్మశక్తిని దెలుపు, 'అ+ఉ' అను స్వరముల చేరికచే నైనదానిని) విడిగా నుపాసించు విధానము తంత్రములందుఁ గలదు. దాని ఫలము బ్రహ్మజ్ఞాన లబ్ధి. దాని చేటచెవులు సంతతము కుంభస్థలమునుండి యుట్టు సుగంధిమదలుబ్ధములై మూగెడి మక్షికములనుద్రోలు సాధనములు. బ్రహ్మజ్ఞాన సాధనము చేయు బుద్ధియందు మాటిమాటికిం జేరుచు, దానికి విఘ్నములగు విషయసంస్కారములే మక్షికములు. వాని దోలఁగించు నుపాయము సంతత శ్రవణము. కావున, జీవునికి శ్రవణ సాధనము విషయసంస్కారములను దోలఁచునని బోధించునవియే విశాలశ్రవణములు.

విఘ్నేశ్వరునిది పెద్ద కడుపు. ఈ లంబోదరత్వము లోకముల నన్నిటిని దనలోధరించిన పరమేశ్వరుఁడితఁడే యని తెల్పు లక్షణము. నాలుగు చేతులు ధర్మార్థ కామమోక్షము లనెడి నాలుగు పురుషార్థముల నిచ్చువాఁడనెడి మాటను

దెలుపు లక్షణము. అతఁడు తాల్చిన పాశము కామమును, అంకుశము క్రోధమును, వశపరచుకొన్నవాఁడనియుఁ దన్నా శ్రయించిన భక్తులకు రజోగుణ సముద్భవములైన కామక్రోధ ములను వశపఱచి సత్త్వగుణప్రకాశమును జేయుననియు బోధించును. మూడవచేతి పుస్తకము సకలవిద్యాస్వరూపుఁ డును, సర్వవిద్యాప్రదాతయు నీతఁడేయని తెలుపును. నాలవ చేతి మోదకము ఆనందస్వరూపుఁడును, ఆనందప్రదాతయు నీతఁడేయని తెలుపునదే. ఇదిగాక ద్విభుజ, షడ్భుజ, అష్టభుజ దశభుజ గణపతి మూర్తులను గనుచున్నాము. ఆ భుజముల యందలి వస్తువుల సంకేతముల నన్నిటిని దెల్పఁబూనినచో గ్రంథశరీరము పెఱిగిపోవునని యిట వ్రాయమానితిని. కోరిన వారికిఁ దెల్పఁగలను.

ఇఁక సర్పభూషణములు — భగవచ్ఛక్తి గ్రంథము లందుఁ బెక్కుచోట సర్పముగానే రూపింపఁబడినది. బహువిధ క్రియా శీలమైన యాశక్తియే భగవంతుని బహువిధ విభూతు లను బ్రకాశింపఁ జేయునది. జ్ఞానబలక్రియారూపమైన యా శక్తియే తన కలంకారమని బోధించుటకే యీ సర్పాలంకా రములు.

ఆ దేవుని యరుణవర్ణము విమర్శశక్తి స్వరూపమునుం దనదే యని బోధించును. ఆతని ప్రకాశశక్తిని, ఆనందమయ త్వమును దెలుపునదియే చంద్రకళావతంసము.

ఆతని వాహనము మూషికము (ఎలుక). ఇది యపూ ర్వము. ఇది పరమరహస్యము. మూషికము - దీని స్వాభావ మేమనఁగా, తన దారి కడ్డువచ్చువానిని గొఱికివేయుటయు,

వలసిన యాహారవస్తువులతోఁ దృప్తి నొందుచేగాక, కొన్నింటి నుపకరించువాని నెత్తుకొనిపోయి తన కలుఁగులో దాచికొను టయు మూషికధర్మము. సాధకజీవున కిట్టి ధర్మములు పట్టి నపుడు — అనఁగా దన సాధనమార్గమున కడ్డునిల్చు కొన్ని సంస్కారములను ప్రతిబంధకములను విడఁగొట్టుకొని, యను కూల సంస్కారముల నవలంబించి, జ్ఞానోపయోగి సామగ్రిని సంగ్రహించికొని మూలబిలమున (మూలాధారమున) స్వాయంభూలింగమును (ఈశ్వరుని) జేరి యుపాసించు జీవుఁడే మూషికధర్మము పట్టినవాఁడు. అట్టి జీవు నధిష్ఠించియే, ప్రజ్ఞా స్వరూప పరమేశ్వరుఁడు (ఈశ్వరశక్తి) సాధనబలముచేఁ దన రూపమే యైన జీవునితో స్వాధిష్ఠానాది చక్రములను దాటి యాజ్ఞాచక్రమునకుఁ బోవును. అప్పు డా జ్ఞానశక్తి ఋతంభర ప్రజ్ఞ యనఁబడును. జీవుఁడు తాను గురుకృపచేతను, శాస్త్ర వాక్యములచేతను 'అహం బ్రహ్మాస్మి' త్యాది జ్ఞానము ననుభ వించుచుండును. అపుడు మనఃస్థానమైన యా చక్రమునందు నిల్చిన జీవుని విషయేంద్రియాదులు బాధింపకుండ నాజ్ఞ పెట్టఁ బడును గావునను, 'అది సత్యము, అది సత్యము' అనుచుఁ బరమశివస్థానమైన సహస్రారమునుండి శివాజ్ఞలను జీవుఁ డందుకొనుచుండును గావునను ఆ భ్రూమధ్యగత చక్రమునకు 'ఆజ్ఞాచక్ర'మని పేరయ్యెను. ఈశ్వరాజ్ఞల నందుకొని మహా వాక్యార్థజ్ఞానము సుస్థిరమగునపుడు, ఆ ఋతంభర ప్రజ్ఞయే సత్యంభరప్రజ్ఞ కాఁగా, అచ్చోటుదాటి జీవుఁడు సహస్రార మందు దాదాత్మ్యానందము నొందును. కనుక ఋతంభర ప్రజ్ఞాస్వరూపము గణపతి. సత్యంభరప్రజ్ఞాస్వరూపము శివుఁడు. అందుచే శివుని కుమారుఁడు గణపతి యనఁబడెను. పైని

వివరించిన మూషికధర్మముపట్టిన జీవు నధిష్ఠించిన ఋతంభర ప్రజ్ఞయే మూషికవాహనుఁడైన గణేశుఁ డనఁబడెను. ఆజ్ఞా చక్రమునుదాటిన జీవున కెట్టి విషయేంద్రియ సంస్కార విఘ్నములు రావు కనుక, నీ ఋతంభర ప్రజ్ఞాస్వరూపేశ్వరునే విఘ్నేశ్వరుఁ డనిరి. ఇదే మూషికవాహన విఘ్నేశ్వర రహస్యము.

విఘ్నేశ్వరుని భార్యలు బుద్ధి సిద్ధి యను నిరువురని వర్ణింపఁబడినది. విఘ్నేశ్వరు నారాధించువానికి సంపత్తి జయము గలుగుననను సూచనమే యిది. ఈ దేవున కెనమండ్రు భార్యలున్నట్లు కొన్నిచిత్రములందుఁ గనుచున్నాము. ఇది పరమేశ్వరుని యష్టసిద్ధి ప్రదాతృత్వగుణమునకు జ్ఞాపకము.

కావునఁ బరమాత్మకంటె విఘ్నేశ్వరుఁడు వేఱుకాదనెడి సత్యము నాదరముకల భక్తులు ఈ నా గ్రంథమందలి మూర్తి మంత్రరహస్యములను బోధించుకొని, సక్రమ భావయుక్తముగాఁ బూజించి కృతకృత్యు లయ్యెదరుగాక.

మఱి రెండు మాటలు వినాయకుని గూర్చి వ్రాయక తప్పదు. మొదటిదొకవింత, యేమన - విదేశములందుఁగూడ గజాననారాధనము. భగవంతుని గజముఖునిగా భావించి, యిక్కడకు మిక్కిలి దూరముగానున్న పాతాళదేశములందుఁ గూడ నీ విశేషము గలదు అమెరికాదేశస్థులుకూడ నీ గజాననుం గొలుచుచురు. ఈ విషయము " Hindu Superiority అనఁగా హిందువుల యౌన్నత్యము" అను గ్రంథమం దీవిధముగా నున్నది.

The Mexicans worshipped the figure made of the trunk of a man with the head of

an elephant, The Hindus as is too well known, still worship this diety under the name of Ganesh. Baron Humboldt thus remarks on the Mexican diety. "It represents some remarkable and apparently not accidental resemblance with the Hindu Ganesh."

మెక్సికనులు గజముఖమును మానవదేహమును గల విగ్రహము నారాధింతురు. హిందువు లిప్పటికిని నీ దేవతను గణేశనామమున నారాధింతురనుట సుప్రసిద్ధము. మెక్సికన దైవతమునుగూర్చి హంబోల్ట్ అను నతఁ డిట్లు వ్రాసెను. "ఈ దైవతము హిందుగణేశుని పోలిక కొంత కలిగియున్నది. ఆ పోలిక యెన్నదగినదియు స్పష్టముగాఁ గాక కాకతాళీయముకాక సమంజసమునై యున్నది."

దీనివలన రెండువిషయములు తేలుచున్నవి. మొదటిది పలువిషయములందు విఘ్నేశ్వరారాధనము కలదనెడి విషయము. రెండవవిషయము తొల్లి హిందువులు మతప్రచారమునకై పాతాళదేశమగు నమెరికాకుఁగూడఁ బోయియుండిరనునది.

చెప్పెడిదేమనఁగా, యూదులు దేవుని "జిహోవా" యనఁగా, మహమ్మదీయులు "అల్లాహో" అనునట్లే, వైష్ణవులు భగవంతుని విష్ణునామముతోఁ బేర్కొనఁగా, శైవులు శివనామముతోఁ గొలుచునట్లే, గాణాపత్యులు గణపతినామముతో నాయొక్క యీశ్వరునే యారాధించుచున్నారు. వీరి మతము గీతామతముకంటె భిన్నము కాదు. దీనినిగూర్చి మోనియర్ విలియమ్సు దొరగా రిట్లు వ్రాసిరి. గ్రంథము పేరు 'ఇండియన్ విజ్డమ్' Indian Wisdom (P. 127).

"There is a sect among the Hindus called Ganapathyas, who identify Ganapathi or Ganesh with the Supreme Being. Their doctrines are embodied in the Ganesa Purana but they have a poem called the Ganesa Githa, which is identical in substance with Bhagavath Githa, the name of Ganesa being substituted for that of Krishna.

"పరాత్పరుని గణేశునిగా భావించు గాణాపత్యులనెడి శాఖ యొకటి హిందువులందుఁగలదు. వారి మతసిద్ధాంతములు గణపతి పురాణమందుఁ గలవు. ఇంకను భగవద్గీతతోఁ దుల్యమగు 'గణేశగీత'యును వీరికిఁ గలదు. దీనియందుఁ గృష్ణునకు మాఱుగా గణేశనామము వాడఁబడినది." అనియుండనింపు.

ముఖ్యమైనది గణేశపూజాకాలజ్ఞానము. ఇది భాద్రపద శుద్ధచతుర్థి. బాహ్యాంతః ప్రకృతులందు వ్యాపించు జడత్వము మెల్లమెల్లగా సళ్లుదలనొందు మంచి సమయము. అంతః ప్రకృతియందు జడత్వము సడలనారంభించు నీ భాద్రపదశుద్ధ చతుర్థి (నాల్గవ దినము) మొదలు తొమ్మిది దినములు జ్ఞానప్రద శివపుత్త్రుఁడుగా భావింపఁబడినట్టి ఋతంభర ప్రజ్ఞాస్వరూపుడైన భగవంతు నారాధించి, స్వభావముచేనగు నంతఃప్రకృతి ప్రసాదము నాస్వాదించి, సాధకజీవుఁడు కృష్ణపక్షమందుఁ బితృదేవతల యాశీర్వాదము నొందునని, రాఁబోవు శరత్కాలాదిని, బరాశక్తి నారాధింపఁగల జడత్వవిముక్తి యనెడి యంతఃప్రసాదము నొందును. అదియే శరన్నవరాత్రములందుఁ బరాశక్తి నారాధింపఁగల సామర్థ్యము నిచ్చును. జడత్వము తొలఁగి యంతఃప్రసాదము వికసించు నపుడే ప్రాణాయామ క్రియయందలి కుంభక ప్రయత్నము

సఫలమగును. అపుడు పూర్తిగా జడత్వముతొలఁగి చిత్ప్రకాశ మనెడి ఓజః ప్రకాశ మగును. దీనినే కాళిదాసుఁడు—

"ప్రససాదోదయాదంభః కుంభయోనేర్మహౌజసః"

అని శరత్కాలవర్ణనమునం దుగ్గడించెను. మహాతేజశ్శాలియగు కుంభసంభవుని(అగస్త్యుని) యుదయమువలన, జలము(జడము) నిర్మలమయ్యెను. అనఁగా, కుంభసంభవుఁడు – కడవయందుఁ బుట్టినవాఁడని పౌరాణికార్థము. ఆధ్యాత్మికార్థము—"కుంభే సమ్యగ్భవతి తిష్ఠతి ఇతి కుంభసంభవః" ప్రాణాయామ క్రియయందలి ప్రధానభాగమైన కుంభకమందుఁ జక్కఁగా నిల్వఁగలవాఁడు కుంభసంభవుడు. కనుకనే శ్రీవిద్య యనుపేరఁ బరగు దేవీ విద్యను హయగ్రీవ విష్ణుమూర్తి కుంభసంభవుఁడైన యగస్త్యునకే ప్రసాదించెను. భాద్రపదశుద్ధమందు విఘ్నేశ్వరుని బూజించియు, కృష్ణపక్షమందుఁ బితృదేవతల నారాధించియు వారి కరుణాశీర్వాదముల నొందినవాఁడే, తేజోభూత వికాసారంభమగు శరదృతువు ప్రవేశింపఁగానే, తేజోమయియు, భర్గఃస్వరూపయు, గాయత్రియునైన పరాశక్తిని, దేవినారాధించి కృతార్థుఁడు కాఁగలఁడని నిశ్చితాభిప్రాయము

భాద్రపద శుక్లపక్షమందుఁ జవితినాఁటికిఁ జంద్రకళలు అనఁగా మానసిక కళలు నాలుగు వికసించుసరికి సాధకోత్తముఁడైన యొక మహర్షియందు ఋతంభర ప్రజ్ఞాస్వరూప గణపతి యీవిధమగు మూర్తిగా నావిర్భవించుట నీతిథియే యీదేవుని పూజకై శాస్త్రములందు విహితమైనది. గణపతి భేదము లనేకములు కలవు. భిన్నభిన్న మహర్షులు భిన్న మంత్రముల సాయముతో నారాధించుచుఁ, బరమేశ్వరుని

భిన్నభిన్న కల్యాణగుణములందుఁ దమ కిష్టమైనవి స్ఫురించు నటులు భిన్నభిన్న రూపకల్పనములు చేసి ధన్యులైరి. అవి యన్నియు నిటఁ బ్రాయఁ బనిలేదు. ఆయా మూర్తుల చిత్ర కల్పనారహస్యములను, ఆయా మంత్రముల యర్థములను దద్జ్ఞుల నాశ్రయించి తెలిసికొనఁదగును. దీని యందే కాదు. పెక్కింటియందీ మంత్రమూర్తి భేదములు కలవు. దైవకృప గురుకృపయు శాస్త్రకృపయు సంపాదింప గల్గినచో నన్నిటి జ్ఞానమును లభించును. జిజ్ఞాసాబలమే యటఁ బ్రధానము. ఇంత చాలును.

# రాసలీల

ఇది మన యాంధ్రదేశమున విశేషించి ప్రచారమందు లేకున్నను, దీని ప్రాశస్త్యము నెఱుంగుట మనవిధి. ఉత్తరాది పూజలలో నిది ప్రముఖము.

శరదృతువునందలి నిర్మలాకాశమునఁ బూర్ణచంద్రు నుదయముచే శుభ్రజ్యోత్స్నాస్నాతయై శీతోష్ణము కాని విశ్వ ప్రకృతియొక్క యపూర్వసౌందర్యము గాంచి ముగ్ధులైన పూర్వా చార్యులు అంతర్జగత్తునందును నట్టి యపూర్వ శోభావికాస మునే యనుభవించి, కార్తికపూర్ణిమాతిథియందు రాసలీలా పూజావిధానమును జేసిరి. ఎవ్వని యసీమ సౌందర్యమాధుర్య ముల యించుక యాభాసము నొందిన విశ్వప్రకృతియం దిట్టి యపూర్వసౌందర్య ముదయించునో, వానిహద్దులేని సౌందర్య మాధుర్యముల పరాకాష్ట కిది సమయము. ఆతని సుందరదిన మొక్కసారి యూహింపఁబడకుండునా? అతఁ డానంద ఘనుఁడు;

ఆత్మారాముఁడు; విశ్వాతీతుఁడు నైనను, ఏ విధముగా నీ యపూర్వ విశ్వలీలానందము ననుభోగించుచున్నాఁడో, ఆత్మారాముఁడయ్యును నే విధముగా నాత్మశక్తులతో రమించుచున్నాఁడో, దానిని స్మరించిన తత్త్వదర్శులు ఈ దినమం దెంత యానందమును, నెంత యాత్మతృప్తియు ననుభవించిరో! కలికాలావసానమందు క్షితితత్త్వముయొక్క ప్రకట ప్రకాశము క్రమముగా క్షీణించును. కొలఁది నాళ్ళలోనే శీతర్తువు పౌషమాసపుటలో, వ్యోమతత్త్వము విశేషించి వెలయు కాలము వచ్చును. దాని పూర్వసూచనము లారంభ మగును. ఈసమయమందు మన స్థూల శరీరమందలి యాకాశతత్త్వము మొదలుకొని సర్వవ్యాపియై హద్దులేని వ్యోమమండలమును బోధమందు జాగృతముఁ జేసి, యాబోధమయాకాశమందు భువనసుందరుని సుందర రాసలీల నాస్వాదింపఁగల్గుటచే నీ దుఃఖభర మానవజీవనము మధుమయమై పోవును. అపుడే మానవజీవనము యొక్క సర్వాపేక్షా సమాధానము కూడి వచ్చును. అప్పుడు మనుష్యుఁడు భువనసుందరుని రాసలీలను దర్శింపఁగలడు.

రాసలీల — గోపికలతోఁడ శ్రీకృష్ణుని యానందక్రీడ. జగత్తునందలి సర్వజీవులను దనవంక కాకర్షించువాఁడు, సర్వపాపముల సమూలకర్షణము చేయువాఁడు శ్రీకృష్ణుఁడు. ఆతఁడే యానందమయ పరమాత్మ. అతఁడు సర్వదా సర్వత్ర నసంఖ్య గోపికలతో నానందలీల నెఱపుచున్నాఁడు. ఆసంఖ్య గోపులందు పదునాలుగురు శ్రేష్ఠులు. వారిలో నెనమండ్రు సఖులు శ్రేష్ఠతరులు. ఎనమండ్రలో మొట్టమొదటిదే శ్రేష్ఠతమ. రాసలీలయందు సృష్టితత్త్వము బాగుగా తేటపడును.

మూలప్రకృతివలన నీ జగత్తు పుట్టును. ఆమెయే పూర్తిగా నీ రాసలీలయందు శ్రేష్ఠతమ గోపిక. మూలప్రకృతి వలన నేడు ప్రకృతులు వికృతిరూప పరిణామమును సంఘటిత మగును. అనఁగా మహత్తు అహంకారము పంచతన్మాత్రలు అనునవే రాసలీలయందలి శ్రేష్ఠతమ గోపీతారలు. మఱి వానివలనఁ బుట్టు పదునాఱువికారములే పంచజ్ఞానేంద్రియములు, పంచకర్మేంద్రియములు, పంచభూతములు, మనస్సు అనునవియే రాసలీలయందు శ్రేష్ఠగోపులు ఈ పదునాఱు ప్రకృతుల వికాస తారతమ్యములే నసంఖ్య గోపికాభేదము కలుగుచున్నది. కావుననే రాసలీలయందలి గోపీసంఖ్య నిర్ణయించుట కాదు. జగత్తునందలి ప్రతిపరమాణువును బృందావనమే. ఇట్టి బృందావనమం దెల్లవేళల నసంఖ్యగోపికలతో నాత్మరూప శ్రీకృష్ణుఁడు విరాజిల్లును. గోపికల సంఖ్య యనిర్ణేయమైనను, మనకు నచ్చఁజెప్పుటకుఁగాను బూర్వాచార్యులు పదునాఱుగురు గోపికలతో శ్రీకృష్ణుని రాసక్రీడను వర్ణించిరి తాను సచ్చిదానందస్వరూపుఁడయ్యును, ఏకాఖండ స్వరూపుఁడయ్యును బదునాఱుతత్త్వముల కెడి గోపికలయందుండి సత్త, చైతన్యము, ఆనందము అనువాని యభివ్యక్తిని ప్రకాశింపఁజేయుచుండును. శ్రీకృష్ణుని సత్తవల్లనే గోపికల సత్తయు, శ్రీకృష్ణునిచైతన్యమువల్లనే గోపికలప్రకాశమును, శ్రీకృష్ణుని యానందమువల్లనే గోపికల పరిచ్ఛిన్నానందమును నభివ్యక్తమగుచుండును. పదునాఱుతత్త్వముల నెడి గోపికలు, అనఁగా నింద్రియశక్తులు ఆ యానందనయన శ్రీకృష్ణుని సంధానము నొందునపుడే, బహిర్ముఖవిషయాను సంధానము నుండి మఱలిపోయి, యంతర్ముఖములగుటకు మొదలిడును.

అపుడు తమతమ విశిష్టతయనెడి కుల మాన లజ్జాదులను విడిచి పెట్టి పూర్తిగా నాత్మయందే మైమఱచి, పరమపురుషు నానంద లీలయందుఁ బాల్గొనును. ఆ యానందమయ పురుషుఁడు శ్రీకృష్ణుఁడు తా నొక యద్వితీయుఁడయ్యును నేకవిధముగాఁ బ్రకృతి, మహత్తు, అహంకారము, పంచతన్మాత్రలు, పంచ భూతములు, మనస్సు, ఇంద్రియశక్తులు ననువానిలో నిల్చి యాయా భావములతో నాత్మప్రకాశము చేయునో, దాని చక్కని యనుస్మరణము నుపలబ్ధియుఁ జేయుటకే రాసలీలా పూజ విహితమైనది. రసస్వరూప పరమాత్మ భావాతీతమును గుణమయమునైన రూపములతోఁ బ్రకాశించును. నిరవయవ మైన కేవలానంద స్వరూపరసము సావయవమై — అకార యుక్తమై వెలయునపుడే — నామరూపములతో నభివ్యక్త మగునపుడే, రాసలీలాభినయ మారంభ మగును. రసము అపుడే రాసరూపమున నాత్మప్రకాశము చేయును.

సారాంశ మేమనఁగా జగత్తత్త్వమును, సృష్టిరహస్య మునుఁ జక్కఁగా నెఱింగించుటకే శాస్త్రములందీ రాసలీల విహితమైనది. శాస్త్రకృపను, గురుకృపను బొంది పురుష ప్రకృతి విషయక జ్ఞానమం దధికారులైనవారే, యీ విషయ బృందావనమందు నిత్యము రాసలీలాస్వాదము చేయఁగల్గు దురు. సర్వరూపములతో, బహురూపములతో, జగద్రూప ముతో, ఆత్మప్రకాశము చేసి యానందమయపురుషుఁడు నిత్యము నే యానందలీలానుభవము చేయునో, దాని నొక్క గడెసేపైనను జీవుఁడు హృదయంగమ మొనర్చుకొనుటకే యీ రాసలీలావిధాన మేర్పడినది. సాధారణదృష్టికి జగత్తు దుఃఖమయముగానే తోఁచును కాని జీవితకాలమం దొక్క

సారియైనను శ్రీకృష్ణుని యీ యపూర్వరాసలీలనుఁ గాంచు భాగ్యమబ్బిన సాధకులకు మాత్ర మీ జగత్తు నిత్యానంద మయముగా నే ప్రతిభాతమగును. దుఃఖమనెడివేరితో నొక్కటి యెక్కడను లేనే లేదు. అంతయు నానందమే. యిమ్మాటికిఁ గేవల మానందమే. దుఃఖరూపముగాఁ గానవచ్చునదంతయు నానందవస్తువుయొక్క విభిన్నస్ఫురణమే యనెడి సత్యజ్ఞాన లాభము నొందుటకే, యీ సత్యోపలబ్ధిఁ జేయుటకే యీ రాసలీలా పూజానుష్ఠానము జరుగుచున్నది. బ్రతికియున్నంత కాలము ప్రతిదినమో, యేఁడాది కొకసారియో యీ పూజ నాచరించు ఫలముగా మిగిలిన మనుగడనాళ్లన్నియును మను ష్యుఁడు సర్వవ్యాపియైన యానందమయసత్త ననుభవింపఁ గలిగినచో మానవజన్మమునందిన చరితార్థత నొందును.

ఇపుడొక ప్రశ్నము — కార్తికపూర్ణిమకంటె నితరమైన యే దినమందును రాసలీలాస్వాదము చేయలేమా? యని. ఏమి, ఎందుకు చేయఁజాలము? సాధకులు భక్తులునైనవారు నా భువనసుందరుని కృపాలేశమునందినవార లెట్టి సమయము నందైనను భగవంతుని స్వరూపోపలబ్ధిసి దాము గోరినట్లు చేయఁగల్గుదురు. ఇందు బాధయేమియు లేదు, సరిగదా, చేయుటే యుచితము. ఇదిగో యీ కార్తికపూర్ణిమా దివసము సాధకులకు, నసాధకులకు నెల్లరకు నిర్దేశింపఁబడినది. ఇట్లే సర్వపూజాపర్వములను నెఱుంగునది. ఈనాఁడు బాహ్యాంతః ప్రకృతులందుఁ గలుగు పరివర్తనము రాసలీలానుభవ పథ మున విశేషించి సాయపడునని యిదివఱకే సూచించితిని. ఈ తిథియందే యథాసంభవముగా నిట్టిపూజలు చేయుట సనాతనధర్మావలంబులైన వ్యక్తులకు మాత్రమే యవశ్య కర్త

వ్యము. అంతవఱకు స్మరణీయమేమనఁగా, నేఁడాదిపోడుగు నను బ్రతిదినముగాకున్నను, దుదకప్పుడప్పుడు ఈ రాసలీల యొక్క యత్యర్థికాస్వాదనమునకై యథాశక్తిగా ననుశీలించువారు మాత్రమే యీ సునిర్దిష్టదినమందు రాసోత్సవ యథార్థబలమొందు సమర్థులు. తక్కినవారి విషయమున - ఈ విషయము నేవిధముగాను ననుశీలించి, యనుస్మరింపనివారి పక్షమున నీ నిర్దిష్టదినమందు మాత్రమే చేయుపూజ యెన్నఁడును నాశానురూపఫలము నీయఁజాలదు. రంగమంచమందు సుదక్షనటుఁడని పేరెన్నికగన్నవాఁడు నిర్దిష్టదినమునకు ముందుగానే, తన యభినయింపవలసిన విషయమును బలుసారు లనుశీలించుచు భూమిక కవసరమగు నైపథ్యమును సంగ్రహించుకొనుచుండునట్లే యీసంసారరంగమంచమందు ఆనందమయ భగవత్ సత్తోపలబ్ధియనెడి యభినయకార్యమందు సమర్థాభినేతయనెడి పేరొందఁగోరువారు ప్రతిదినమో, వీలగునప్పుడెల్లనో యట్టి యనుశీలనము చేయుచునే యుండవలెను. కొత్తపుమాట యేమనఁగాఁ బూజాదులను జేసి దాని సార్థక్యము నొందుటకై మొదటినుండియు నీ పూర్వప్రయత్నమును జేయుచునే యుండవలెను. ఈ నియమము కేవల రాస క్రీడావిషయమందే కాదు. సర్వపూజాసంబంధము నందునని యెఱుంగునది. మఱియు నీ కార్తిక పూర్ణిమనాఁడు విశేష మేమనఁగా నానందమయ సృష్టిలీలా రహస్యమును జీవసాధారణులకుఁ దెలియఁజెప్పుటకే భగవంతుఁడు స్వయముగా నవతరించి యీ దినమందు రాసలీలాభినయము చేసెను. ఈ దినము విశేష స్మరణయోగ్యమును, ఆశానురూపఫల దాన రూపమున విశేషశక్తిసంపన్నము నని చెప్పవచ్చును.

మఱొక్కమాట చెప్పి యీ ప్రస్తావము నుపసంహ రింతును. శ్రీమద్భాగవతమున రాసలీలయందు శ్రీమతి రాధ పేరు విశేషించి యుల్లేఖింపఁబడినది. కాన, దాని విషయమున నిచ్చట నెట్టి యాలోచనమును జేయలేదు. గోపీ శబ్దము మాత్రము వ్రాయఁబడినది. గోశబ్దార్థము ఇంద్రియము. ఇంద్రి యములనుఁ బాలించువాఁడు గోపుఁడు. ఏశక్తివశమున నింద్రి యములు పరిచాలితములగునో (విషయగ్రహణమందు సమ ర్థములగునో), యదే గోపీ. పరమాత్మ యేశక్తుల నాశ్రయించి సృష్టిలీలాప్రకాశము చేయునో యవే గోపులు. ఆత్మశక్తుల తోనే యాత్మ చేయు రస (ఆనంద) క్రీడయే రాసము. సత్తు చైతన్యము, ఆనందము - అనఁగా సంధినీ, సంవిత్, హ్లాదినీ శక్తులయొక్క విశిష్టప్రకాశము, సంహరణము ననునదే రాస లీల. సాధకుఁడు రాసలీలాధ్యానము చేసి చేసియు నిత్యబృందా వన మనెడి హృదయక్షేత్రమందు నిత్య రాసలీలాసంధానము నొందనంతదాఁక, నతని రాసోత్సవానుష్ఠానము సమ్యక్ ఫల దాయకము కాదు. అన్ని పూజలయందును నీ రహస్యము నెలుంగునది. పూజనీయుఁడెవఁడో వాని మహత్త్వము, భావము మున్నగువాని నెఱింగి చక్కఁగా నాత్మసాక్షాత్కార మొనర్చుకొనగల్గు పూజకుని పూజలే సార్థకములగును. పూజ పూజకునితోను, పూజ్యముతోను భిన్నముగా నుండునంత కాలము పూజాయథార్థస్వరూపము హృదయంగమము కాదు.

## డోలాయాత్ర

ఈ యుత్సవము దేశమందంతట ఫాల్గుణశుద్ధ పూర్ణిమ నాడు జరుగును. ఆంధ్రమున సుప్రసిద్ధక్షేత్రమైన శ్రీ కూర్మే

శ్వర క్షేత్రము దీని విశిష్టస్థలము ఇది మున్ను శైవక్షేత్రమే. శ్రీరామానుజులచే వైష్ణవముగా సంస్కరింపఁబడినవానిలో నిది యొకటి. ఆనాఁడీ యుత్సవము ఉత్తరానక్షత్ర ప్రధాన ముగాఁ జేయఁబడును. స్మార్తార్చితక్షేత్రమునందు తిథిప్రధాన ముగాఁ జేయబడును. నాఁడు శ్రీనాథుని యుత్సవవిగ్రహమును శ్రీదేవి సహితముగా డోల (ఊయల) యందుంచి, పూజించి యూయల నూపుచు భక్తులు బగ్గుండ (ఫల్గుచూర్ణము అనఁడి సువాసిత రక్తచూర్ణము) స్వామి విగ్రహముపైఁ జల్లుచు, యథేష్టముగాఁ బ్రార్థింతురు. ఆ బగ్గుండనే భగవత్ప్రసాద ముగాఁ బూజకులు భక్తులపైఁ జల్లుదురు. కొన్నిచోట్ల బగ్గుం డను భక్తులొండొరులపైఁ జల్లుకొందురు. ఇది ప్రత్యేకవ్యక్తి యందున్న యాత్మచైతన్యమును భగవంతునిగానే భావించి పూజింతురని భావము.

ఇపుడీ యుత్సవ తత్త్వమునుఁ దెలిసికొనఁ జూతము. శ్రీకృష్ణునిడోలోత్సవము చైత్రమునకు ముందటిదైన ఫాల్గుణ శుద్ధ పూర్ణిమనాఁడు చేయఁబడును. ఆరు ఋతువులందునుఁ జూడఁగా శరద్వసంతములే మనోరమములు. విశ్వప్రకృతి యొక్క సౌందర్యము మానవచిత్తముల నాకర్షించు నాసము యమే భువనసుందరుని లీలారసాస్వాదను చేయువిషయమున మిగుల ననుకూలములు. మనస్సు స్వచ్ఛముగా నుండునపుడే యాధ్యాత్మిక భావరాశిని గ్రహించులాభము గల్గును. కావు ననే శాస్త్రకారులు చేసిన పూజల కట్టడులెల్ల భగవానుని యీ విశ్వలీలా రసాస్వాదము చేయుటకే యైయున్నది. ఆ పూజలెల్లఁ దఱచుగా శరత్కాలమందును, వసంతపూర్ణిమా తిథియందునుఁ జేయఁబడును. రసికభావుకులైనవారు బాహ్య

ప్రకృతియొక్క యపూర్వసౌందర్యమునుఁగాంచి భువనసుందరు నొక్కసారి స్మరింపకుండఁగలరా? ఎవ్వాని రవ్వంత సౌందర్యాభాసము నొంది విశ్వప్రకృతి యంకమందు వాసంతీపూర్ణిమా సౌందర్యము మెఱయునో వాని నొక్కసారి స్మరించుట మనుష్యమాత్రునకుఁ గేవల స్వాభావికముగాదా! భువనసుందరుఁడై యానంద ఘనవిగ్రహుఁడై యాత్మస్వరూపముతోఁ బరమ ప్రేమాస్పదరూపముతోఁ బూర్ణభావముతోనున్న యాతఁడే నిత్యస్థిరాత్మస్వరూపుఁడైన శ్రీకృష్ణుఁడే మనస్సు, ఇంద్రియాదులు ననువానిచేఁ బరిచ్ఛిన్నుఁడై యుపాధివశమున నిత్యడోలాయమానుఁ డగుచున్నాఁడు. (ఊగులాడుచున్నాఁడు). హృషీకేశరూపముతో, సర్వేంద్రియాధిష్ఠాతృ రూపముతోఁ బ్రతిజీవుని హృదయమందును గురురూపముతో, నచ్యుత స్వరూపముతో నిత్యమునున్న యాతఁడే యింద్రియముల దారిని తేఁబడు విషయములనుఁ బ్రకాశింపఁజేయుచు భోక్తృరూపముతో వెలయుచుండునపుడు ప్రతిక్షణమును నెంతగా నాందోళితుఁడగునో! ఆతని యీ డోలాయమాన స్వరూపమును యథాసంభవముగా ననుభవించుటకే యీ డోలోత్సవము విహితమైనది. మనము మన యింద్రియరాజ్యమందు విచరించుచుఁ బోవునపుడెల్లఁ జాంచల్యము ననుభవించుచున్నాము. ఆ చంచలత యతనిదే. నిత్యస్థిరుఁడును, ఏకాద్వితీయుఁడునైన యతఁడే యీచంచలత లోపలనుండి యలలుగల నీటఁ జంద్రుఁడువలెఁ బ్రకాశించుచున్నాఁడు. అమృతమయుఁడును, మధుమయుడును, ఆనందమయుఁడునుఁ, బరమ పురుషుఁడునైన యతఁడే భోగ్య భోక్తృ భోగరూపముతోఁ బ్రకాశించుచున్నాఁడనెడి సత్యమును సంవత్సరము పొడుగున

నొక్కనాడైనను ననుభవింపఁ గల్గినచో మనుష్యుఁడు నిశ్చింతముగా నానందముతో నీ దుఃఖభర సంసారారణ్యమునందు నిర్భయముగా విచరింపఁ గల్గును. ఏమనగా నొక్కనాటిస్మృతి మనుష్యునిఁ జాలకాలమువఱకు నానందమయునిఁ జేసి యుంచఁ గలదు. అతఁడే మన కేకాంతప్రియుఁడు. అతఁడు లేకున్నచో మఱి మన కేమియు నుండదు. అతని ప్రసాదమువల్లనే యీ వైచిత్ర్య విశ్వభోగములు సాగుచున్నవనెడిమాట నొక్కసారి మనసున కెక్కించుకొనఁ గల్గినచో మనుష్యుఁ డాతనియెడ ననురక్తుఁడు కాకుండఁగలఁడా? కనుకనే యీ డోలాపూజా దినమందు అనురాగమునకుఁ బ్రతినిధిగా ఫల్గుచూర్ణముతో (బగ్గుండతో) మన ప్రాణదేవతను అభిరంజితుని (రంగు వేయఁబడినవానిని) జేయు విధానమిది.

సాధారణముగా మనము విషయములయెడనే యనురాగము గలవారమనుకొందుము. వాస్తవముగా నది కాదు. మనమెల్లరము తెలిసియో తెలియకో జగత్తునందలి సర్వ వస్తువులను బట్టిచూడ, భగవంతునియందే విశేషానురాగము గలవారము. యథార్థముగా మన యనురాగ మంతయు మనకుఁ గేవల ప్రియతముఁడైన భగవంతునియందే పూర్తిగాఁ బర్యవసించుచున్నది యని నిస్సంశయముగా నెఱంగించుటకే యీ డోలోత్సవము చేయఁబడును. లోపల దాఁగియున్న యీ యనురాగ స్వరూపమును యథార్థముగా ననుభవింపఁ జాలమిచే, స్థూలమందు (వెలిని) ఇట్టి కర్మములు చేయు ప్రయోజనమున్నది. లోపల నిరవయవముగా నున్న యీ యనురాగమును బట్టుకొనుటకే (గ్రహించుటకే) వెలిని సావయవమైన యెఱ్ఱని రంగుగల బగ్గుండను బెట్టిరి. లోపల

నిరవయవానందరూపముగానే ప్రేమరూపముగానే యున్న వస్తువే వెలినిసైతము కృష్ణవిగ్రహరూపమున మన యెదుట వెలయుచున్నది. అంతరమును గ్రహించుటకే యీ డోలా పూజాకర్మ యేర్పఱుపఁబడినది. ఆవుయొక్క సర్వాంగము లందును సూక్ష్మరూపమున నేయి యున్నది. నిజమే కాని యానేతి ప్రభావముచే దాని శరీరమందైన గాయము మానదు, గాని దానిపాలు పిదికి దానినుండి నేతినిదీసి యా గాయమునకుఁ బ్రయోగించుటచే దాని గాయము పోవును. సరిగా నిటులే మనమెల్లరము వాస్తవముగ భగవాను నెడనే యనురాగము గలవారమైనను, ఈమాట తెలియకపోవుటచే ననురాగము మనలను ప్రేమమయులనుగాఁ జేయఁ జాల కున్నది. ఆనందము నీయఁజాలకున్నది. కావుననే యీ బాహ్య కర్మ ప్రయోజనము బాహ్యకర్మ ప్రయోగసహాయముతోనే, మనలోపలనున్న జ్ఞాన భక్తి ప్రేమాది దైవీసంపద నొందు చున్నాము. ఇది కేవల డోలాపూజావిశేషఫలమే కాదు. సర్వ పూజలవలన నపూర్వఫల లాభమగును. డోలాపూజయందు భగవంతునెడనైన యనురాగమునకుఁ బ్రతినిధియైన బగ్గుండ చేత సైతము భగవంతుని శ్లేష్మశరీరము అభిరంజితము చేయఁ బడునంత విశేషత్వమున్నది. కనుకనే దీని విషయమున నిన్ని మాటలు చెప్పఁబడుచున్నవి.

పూజకుఁడా! నీవు బగ్గుండను జేతఁబట్టుకొని భగ వంతుని లీలాందోళిత రూపము నెదుట నిలువఁబడి చూడుము. నీ ప్రాణదేవతయైన యాతఁడు నీ యుచ్ఛృంఖలా వాసనా వృత్తికొఱకు, భోగ్యవిషయరూపముతోను, భోగసాధనము లైన యింద్రియముల రూపముతోను బ్రకాశించునపుడు

మనకుఁ దెలియకయే యెంత యాందోళితుఁడగుచున్నాఁడో! నిత్యస్థితుఁడైన యాతఁడు కేవలము నీకొఱకే నీకుఁ దెలియకయే యెంత చాంచల్యభావము నొందుచున్నాఁడో! యిటులు చూడఁగా జూడఁగా నీ యహంకారము యొక్క నిక్కన తల నిశ్చయముగానే యకృతజ్ఞత యనెడి మోయరాని బరువుచేఁ బూర్తిగా వంగిపోవును. అట్టియపుడు నిష్కపటములైన నీ కన్నీళ్లతోఁ దడిసిన బగ్గుండను, అనురాగమునకుఁ బ్రతినిధిగా నాతని చరణములందును, నాతని సర్వాంగములందును నర్పింపుము, నీవు భక్తిపూర్వకముగా సమర్పించిన యనురాగముతో రంజితుఁడై, యాయనయు నప్పుడే యనురాగమయ మూర్తితో నాత్మప్రకాశ మొనర్చును. ఏమన, నాతఁడు కల్పవృక్షము. నీ వాతని కేమి యిత్తువో, నీవాతని నేగుణములతో విశ్వాసితుని జేయుదువో భావాతీతుఁడును గుణాతీతుఁడు నయ్యును, నీ యాభావములతో నీ యాగుణములతో భావమయుఁడును గుణమయుఁడును నై వెలయును. నీ యాశలు పూరించును. నీ వపుడు గోపికలచేఁ బరివేష్టితుఁడైన యాగోవిందుని యింద్రియ శక్తులతోఁ గూడి పరమానందుఁడును, ఇంద్రియాది పతియు నైన యా భగవానుని, నీ హృదయమనెడి (డోల) యూయెల యందుంచి లీలాందోళిత రూపముతో దర్శింపుము. ఆతఁడు తప్పక నీ హృదయడోలిక యందు డోలాయమానుఁడగు చున్నాఁడు. ఆతని నిన్నాళ్లును జూచు నవసరము కలుగలేదు, కావున నీ ఫాల్గునపూర్ణిమాతిథియం దీ సుఖభరితదినమందు, మరుత్తత్త్వము మొట్టమొదట నభివ్యక్తమగు కాలమందు, మందమధుర మఱియు మారుతముచేఁ బరిసేవింపఁబడుచు

వాసంతీపుష్పాభరణ భూషితుఁడైన యీ విశ్వప్రకృతి యంగమందుఁ గూర్చుండి యొక్కసారి యీ భగవంతుని దర్శించి కృతార్థుఁడవగుము. ఆ విశ్వేశ్వరుని యంగమందు, అనురాగమనెడి బగ్గుండ సమర్పించి స్వయముగా ననురాగ స్వరూపోపలబ్ధిని జేయుము. విశ్వమందలి సర్వజీవులయెడ ననురాగ సంపన్నుఁడవగుము. హృదయమందు గుప్తముగా నున్న భగవదనురాగము నుద్దీపింపఁజేసి విశ్వమయమైన యీ యనురాగమును వెదజల్లు సామర్థ్యము నొందుటే డోలా పూజయొక్క యాధ్యాత్మిక ఫలము. ఇంతేగాక దీనివలన నాధిభౌతిక ఫలమునుం గలదు. పాశ్చాత్య విజ్ఞానవిదులైన వారును నీ సమయమందు మేన నెల్లెడ బగ్గుండలేపనము చేసి, యథాశక్తి భగవంతుని స్మరించుటచే వసంతాది సాంక్రామిక వ్యాధులు గ్రమ్ముననెడి భయము తొలఁగునని చెప్పుదురు.

# శ్రీ వాసంతీ (దుర్గా) పూజ

శీతర్తువు నంతమందు మరుత్తత్త్వము చక్కఁగాఁ బ్రకటమగు కాలమున నానావిధ పుష్ప సంభారములతో నొప్పు వసంతర్తువునందు సర్వైశ్వర్యమయి దుర్గతిహారిణి దుర్గాదేవిపూజ విహితమైనది. అమ్మ సంతానమై, భగవంతుని మాతృభావమందు విముగ్ధులైన వారు విశ్వప్రకృతి యందొక విధమైన విశేషత్వమును గని పెట్టునపుడు, అమ్మ నొక్కసారి విశేషభావముతో స్మరింపకుండఁజాలరు. ఋతురాజైన వసంతము రాఁగానే యీ వాసంతీదుర్గాపూజ విధింపఁబడినది. విశేషించి పూర్వకాలమందు రాజు సురథుఁడు రాజ్యమును

గోలుపోయి మహర్షి మేధసు నుపదేశానుసారము నర్మదా తీరమందు ఈ వాసన్తీ దుర్గాపూజను జేసెను. దాని ఫలము గానే యతఁడు, చేజాఱిన రాజ్యమును మఱల నొందెను. నాఁటినుండి యీ పూజ దేశమున వెలసినది. శుక్లపక్షమందు సప్తమి మొదలు మూఁడుదినములీపూజ చేయఁబడును. ఈ సమయమందు మానసికావస్థ మాతృభావస్మరణ విషయమునఁ గడు ననుకూలమని మున్నె చెప్పితిని. ఈ పూజయొక్క యితర తత్త్వములు శారదీయ దుర్గాపూజా వివరణమందుఁ జూడఁ దగును. శారదీయ పూజకంటె, నీ వాసంతీపూజా విశేష మేమనఁగా, నీ పూజయందు బోధనానుష్ఠానము లేదు. మరు త్తత్త్వము యొక్క చరమ ప్రాకట్యసమయమున — తేజ స్తత్త్వావిర్భావము మొదలగునపుడు ఈ పూజచేయఁబడును. అపుడు సూర్యచంద్రగ్రహ నక్షత్రాదుల సన్నివేశ మీవిధ ముగా సంఘటిల్లును. అనఁగా విశ్వప్రకృతి యందొక జాగరణ మయ స్పందనము సిద్ధమగును. అపుడు మన యంతః ప్రకృతియు, అనఁగా మనోబుద్ధి చిత్తాహంకారమును, ఇంద్రి యాధిపతి దేవతాగణమును గొన్నిదినములు జడత్వ మోహము నణఁగఁద్రొక్కి యొక ప్రాణమయ స్పందనము ననుభవింపఁజొచ్చును. కనుకనే యుత్తరాయణము దేవతా జాగరణకాలముగా శాస్త్రములందు వర్ణింపఁబడినది. అపుడు దేవతాగణము తనంతనే జాగృతమగును. బోధశక్తి యొక్క వివిధాయతనములు తమంతనే క్రియాశీలమగును. కనుక నా సమయమందు వాని బోధనక్రియ యక్కఱలేదు. ఈ విషయమున నింతకంటె నధికముగాఁ జెప్పఁబనిలేదు. మున్ముందు విశేషముల నెఱుంగఁగలరు.

# శ్రీ గంగా పూజ

జ్యేష్ఠ శుక్ల దశమి నాఁటికిఁ జంద్రముని క్షీణత తొలఁగుటచేఁ బ్రాకృతిక నియమమువల్ల నపుడు మనస్సు వికాస భావము నొందును. ఈ సమయమం దొకసారి పుణ్యవాహిని యైన భాగీరథీ స్నిగ్ధజలములందుఁ బాపక్షయ కామనతో మునుఁగుటయు, సుఖదయు మోక్షదయునైన గంగను భక్తితోఁ బూజించుటయు నగుటచే వాస్తవముగానే పాప క్షయమును మోక్షలాభమును నగును. సర్వకార్యములు జేయునపుడును, సర్వభావముల యనుచింతన మగునపుడును, మనఃప్రాణములు సంకుచితములగుటయే పాపము. మనుష్యుఁ డీవిధముగాఁ దెలిసియో తెలియకో ప్రతిదినము నింతయో యంతయో పాపసంచయము చేయుచున్నాఁడు. ఏడాదిపొడుగున గూడఁబెట్టిన యీ పాపసంస్కారములనుండి విముక్తుఁడగుటకే పూర్వాచార్యులు గంగావతరణ తిథియందు విశేషించి స్నానపూజల విధానముం జేసిరి. రజోగుణమువల్లనగు చాంచల్యమువల్లను, తమోగుణముచేనగు మోహమువల్లను బాపములావిర్భవించును. ఈ రెండుగుణములు నణఁగినపుడు విశుద్ధసత్త్వగుణ ముదయించును. సత్త్వగుణము శుభ్రము (తెల్లనిది). కావుననే సర్వపాపహారమగు గంగమ్మ శుభ్రవర్ణ. మఱి యీ సత్త్వగుణమువల్లనే ధర్మార్థకామమోక్షముల నెడి చతుర్వర్గఫల లాభమగును. కనుకనే గంగామూర్తి చతుర్భుజ. గంగ మకరవాహిని — మొసలి వాహనముగాఁ గలది. మొసలి జీవత్వ జడత్వములకుఁ బ్రతిరూపము. జీవుఁడు తన పాపములను దానే యెఱుంగఁ గల్గునపుడే యపాపములు

తీయించుటకైన యుపాయమును బుణ్యసంధానమును జేయ బూనును. రజస్తమోగుణ విమూఢుఁడైన జీవుఁడు మెల్ల మెల్లగా సత్వగుణమువలన, అనఁగాఁ బుణ్యాభిముఖుఁడై ముందంజవేయుటకుఁ గోరుచుండును. అపుడతఁడు పాపహారిణి గంగాదేవియొక్క వాహనరూపముగాఁ బరిణమించును. పాప బోధ సంపన్నుఁడైన జీవుని ప్రతిరూపమైన జలజంతువు మొసలి పాపహారశక్తియైన గంగకు వాహనము - జలత్వ మన్నను జడత్వమన్నను నొక్కటే. వేదాదిశాస్త్రములందుఁ బలుచోట్ల డ వర్ణముచోట ల వర్ణము పలుకఁబడుటఁ గను చున్నాము. మొసలి ముఖము జలముకంటెఁ గొంచెము పైకి లేచియుండుటే మనము కనుగొందుము. అనఁగా, జలము నుండి పైకివచ్చుటకే యడియాస పడుచుండును. అటులే జడత్వమోహమందు మునిఁగిన జీవుఁడు, పాపముచే మలినుఁ డైన జీవుఁడు, తన మోహ జడత్వపాపములను దొలగించు కొనుటకై కొంతవఱకు లాలాయితుఁ డగునపుడు అనఁగాఁ బాపమయ సంస్కారములనుండి తొలఁగి, పుణ్యమయ సంస్కార ములందు నగ్రసరుఁడగుటకై యథార్థమగు పట్టుదల గలవాఁ డగునపుడే మహాశక్తిరూపిణియైన మన యమ్మ శుభ్ర సత్త్వ గుణమయియుఁ బాపహారిణియు నైన గంగామూర్తితో నావిర్భవించి, జీవుని పాపముల నన్నిటిని దొలఁచును. తన్నుఁ బాపిగా నెన్నఁజాలని వాఁడును గంగయొక్క పాపహరణ శక్తియందు విశ్వాసములేని వాఁడును బాపహారిణి, గంగా మూర్తి దర్శనము లేకయే పోవును. అందు విచిత్రము లేదు. ఆత్మోన్నతి మార్గమందు, సంశయము నవిశ్వాసము ననునవే మహాశత్రువులు. శాస్త్రమందు బ్రహ్మహత్య మున్నగు

దురాధర్ష మహాపాపములు, ఒక్కసారి గంగాస్నానము చేతనే పూర్తిగా నశించిపోవునని చెప్పఁబడినది. ఈమాటల యందు సంశయించి విశ్వసింపనివారే కుంభీపాకనరకమందు బచ్యమానులగుదురు. కావున గంగాస్నానమువలనఁ దొలఁగునా? తొలఁగదా? యనెడి సంశయము నన్యాయమే. ఏమైనను అజ్ఞానము, జీవత్వము, జడత్వము, అహంకారము ననునవే పాపములు. ఈ యన్నిటివలనఁ జిత్తమందుఁ బాప సంస్కారము లుదయించును. ఇట్టి సంస్కారముల సంక్షయమును, జ్ఞానమును, ఉదారతయు, మహత్త్వమును లభించుటకే యీ గంగాస్నానము, గంగాపూజయు నిర్ణయింపఁబడినవి.

## శ్రీ మనసాపూజ (నాగపంచమి)

శ్రావణమాసమందు మనసాదేవీ పూజ చేయుదురు. కొన్నిచోట్ల శ్రావణము (తుదముట్ట) పొడుగునను జేయుదురు. కొన్నిచోట్ల శ్రావణమునఁ బ్రతి రవివారమందును, ఒక్క నాగపంచమినాఁడైనను బూజింతురు. మనసాదేవి — నాగమాత, అనఁగా సర్పజనని. మనసాదేవి యను పదము అలుక్సమాసము; అనఁగా మనసా యనునది తృతీయావిభక్తి రూపము. మనసే మనసాదేవి. మనస్సు సంకల్ప వికల్పాత్మకము. సంకల్ప వికల్పములు చక్షుః కర్ణాదింద్రియములచేఁ దేఁబడిన విషయముల స్పందనముల వలనఁ గల్గిన యొక విధమైన బోధ మాత్రమే. విషయేంద్రియముల చేరికవేళ మనః కేంద్రమునుండి పలువిధములైన శక్తి ప్రవాహము పరిచాలిత మగును. శక్తిప్రవాహ మెన్నఁడును సరళ

ముగా (తిన్నఁగా) నుండదు. అది వక్రగతితోనే పోవు చుండును. సర్పమనఁగాఁ గుటిలగతి విశిష్టమైన (వంకర నడకగల) జీవుఁడు. ఈ సర్పసమూహము, అనఁగా సంకల్ప వికల్పములనెడి శక్తిప్రవాహ సమూహము మనసునుండియే ప్రసరించుచుండును. కనుకనే మనసాదేవిని సర్పజననియందురు ఈ తత్త్వమును జక్కఁగా హృదయంగమము చేసికొని భక్తితో మనసాదేవినిఁ బూజించుటచేఁ జిత్తకుటిలగతి శాంతించును. యోగశాస్త్రమందు మానసమును నిగ్రహించుటకై పలువిధములైన యుపాయకౌశలము లుపదేశింపఁబడినవి. కాని, యుపనిషత్తులందు మనఃప్రశాంతికై యుపదేశింపఁ బడినవి చూడఁగా సులభసాధ్యములును బూర్ణ ఫలప్రదము లుగా నున్నవి. ఉపనిషత్తు మనస్సును బ్రహ్మముగా నుపా సింపుమన్నది. జ్ఞానలాభమున కంతరాయమైన మనస్సు బ్రహ్మభావముతో నుపాసింపఁబడుటచే, ఆ మనస్సే మఱల బ్రహ్మసాక్షాత్కారమునకుఁ దోడ్పడును. ఇది పరీక్షిత సత్యము. ఈ మనసాపూజ నిష్కామభావముతో నుపాసింపఁ బడునేని యపూర్వమైన యాధ్యాత్మికఫలము లభించును. మఱి సకామభావముతోనైనను నీపూజ బహు ఫలప్రదము. సర్పభీతి తొలఁగి, అనేక కష్టసాధ్య వ్యాధులు శాంతించును ధనరత్నాది లాభమగును. పార్థివభోగవాసనల చరితార్థత గలుగును. ధీమంతులైన పాఠకులు మనసా దేవీస్వరూపము నెఱింగి శ్రద్ధాభక్తులతో బూజించునపుడు, తమ సంకల్పశక్తి నిశ్చయముగా దృఢముగా విశుద్ధమగుచున్నదని సులభముగా నెఱుంగఁగలరు. మనుజుఁడు విశుద్ధసంకల్పుఁడయ్యెనేని, వాని వాసనలెన్నఁడు నపూర్ణములుగా నుండిపోవు.

వేదాన్తదర్శనమందుఁ గానవచ్చు ప్రసిద్ధదృష్టాన్తము రజ్జు సర్పవిషయము ఇచట స్మరింపఁదగినది. బ్రహ్మస్థానీయ రజ్జువునందు మనఃస్థానీయ సర్పభ్రాంతియే మన జీవత్వము. ఆత్మ మనోమయమగునపుడే యాజీవుఁడు బద్ధుఁడు, భ్రాంతుఁడు నగును. ఆత్మయందు సంకల్పాదులేవియు లేవు. మనస్సనెడి యుపాధివశముచేత నాత్మయందే సర్వధర్మములును ప్రతిఫలించును. ఈ దృష్టితో నయితము మనస్సు కుటిలగతిగల సర్పజననిగా జెప్పఁబడెను. ఈ మనసునకు మఱియొక పేరే మాయాకుటిలత. మాయను బ్రహ్మరూపముగా దర్శించుట చేతనే మాయయొక్క మాయాత్వము తొలఁగిపోవును. బ్రహ్మభావము వెలయఁజొచ్చును. ఈ మనస్సును బ్రహ్మరూపముగా నుపాసించుట, అనఁగా మనసాపూజ నిష్కామ సాధకుల విషయమున విహితమే.

వానకాలమందు వాయుప్రకోప మధికమగును, గావునఁ జిత్తము స్వభావముచే విక్షిప్తమగుచుండును. గనుకనే వార్షిక మాసమైన శ్రావణమందు మనసాపూజ విహితమైనది. సాధువులు సన్న్యాసులు నీ సమయమున జాతుర్మాస్యవ్రతమును బరిపాలింతురు. ఋతుస్వాభావికమైన శక్తిప్రభావముచేతనే యీ సమయమందు సాధనభజనము లుత్తమరీతిని సాగవు. ఇది సర్వసాధారణనియమము. ఉచ్చస్తరసాధకుల పక్షమునఁ బన్నెండుమాసములును సమానములే. ఏమయినను, సర్పభీతి నివారణమునకై మానసపూజ చేయువారి పక్షమందును వర్షర్తువే భూతపూజకు శ్రేష్ఠకాలము. ఈ సమయమందే సర్పవృద్ధి యధికము. ఏ తిథియందీ పూజయొక్క ప్రథమ ప్రకాశమయ్యెనో యా తిథిపేరే నాగపంచమి. కావునఁ బ్రతి

సంవత్సరము నీ దినమందు మనసాదేవి విశేషించి పూజింపఁబడును. మన దేశమందు సర్పపూజ, నాగచతుర్థి, నాగుల చవితి యను పేర నాశ్వయుజ కృష్ణచతుర్థినాఁడు జరుపుదురు. మనస్సును బ్రహ్మరూపముగా నుపాసించిన యొక మహర్షి కా యనుభవ మానాఁడయియుండును. లోకానుగ్రహ కాంక్షతో నాతఁడు ప్రచలింపఁజేసిన యీసత్యము నాదరణీయమే. దాని నాధారముచేసికొనియే యీనాఁడు (నాగచతుర్థినాఁడు) విశేషించి పూజలగుచున్నవి. ఏమయినను ఋషుల సత్యోపలబ్ధి యాదరణీయమే. యథార్థ నిష్కామభావములతో నీ సర్పపూజయుఁ గర్తవ్యమే. పరమేశ్వరుని క్రియాశీలమైన సంకల్ప శక్తి సర్పాకారముగా నే భావింపఁబడినదనుటకే శివ శక్తి గణేశాదుల మూర్తులందగు సర్పాభరణములు జ్ఞాపికలుగా నున్నవి కావున మాయపేరి బ్రహ్మశక్తి సర్పమూర్తితో నెల్లరకును బూజ్యయే.

ఈ బ్రహ్మశక్తిని సుబ్రహ్మణ్యదేవనామముతో మంత్ర సహాయమున నుపాసించి స్వాధీనముచేసికొన్న సాధకవరేణ్యులు, సర్పదష్టులైన ప్రాణులకుఁ జేయుచున్న యుపకార మింతంతకాదని యనేకు లెఱుంగుదురు. వారిలోఁ బూర్ణ సిద్ధి నొందినవారు, మనుజులనుగఱచిన యాపాములనే పిలిచి, వానిచేతనే యా విషమును నిగ్రహింపఁజేయునంతటి సమర్థులు నేఁటికిని మన దేశమందున్నారనుట మఱువరానిమాట.

## జన్మాష్టమి

శ్రావణమాసము క్షితితత్త్వముయొక్క పూర్ణ జడత్వము విశేషించి ప్రకటమగుకాలము. ఆకసమును గప్పు

మేఘములు, తెంపులేని వర్ష ధారలును వెలయు కాలము. కృష్ణపక్షమందలి యష్టమీతిథి. బాహ్యప్రకృతియందిది గొప్ప దుర్దినము. ఇప్పు డాంతర రాజ్యమందుఁజూడ, మనస్సుయొక్క అరలయావస్థ యహంకారమనెడి కంసుని యత్యాచారముచే దేవతాబృందము అనఁగా నింద్రియాధిష్ఠిత చైతన్యవర్గము మిగుల నుత్పీడింపఁబడును. శుద్ధసత్త్వగుణమనెడి వసుదేవుఁడును, ఆత్మాభిముఖమైన యిచ్ఛాశక్తి (అనఁగా దైవీప్రకృతి) యనెడి దేవకియుఁ గంసునిచేఁ గారాగారమందు, అనఁగా నహంకార సంకీర్ణత యనెడి చిక్కునందు బంధింపఁబడిరి. కావున నంతఃప్రకృతియందు గూఁడ నిది గొప్ప దుర్దినమే. ఈ దుర్దినమందే శ్రీకృష్ణుని యావిర్భావము. అనఁగా నానంద పరమాత్మయొక్క యించుకంత యభివ్యక్తి; అనఁగా మెల్ల మెల్లఁగా నగు నాత్మప్రకాశము. ఈ తత్త్వమును జక్కఁగా మనసున కెక్కించుకొనుటకే జన్మాష్టమీవ్రతము విహితమైనది.

పగలంతయు నిర్జలోపవాసముచేసి, యింద్రియముల కట్టుబాటులేని స్పందనమును గష్టపడి సమతకుఁదెచ్చి, మధ్య రాత్రివేళ నిఃస్తబ్ధతయందు శ్రీకృష్ణుని జన్మమును గూర్చిన చింత చేయఁబడును. ఆనందఘనపరమాత్మయొక్క యుపలబ్ధి కైన ప్రయత్నము చేయఁబడును. ఈనాఁటి యుపవాసము, పూజాద్యనుష్ఠానము సర్వమును శ్రీకృష్ణుని జన్మచింతనము నకుఁ దోడుపడునవియే. కంసుని యత్యాచారమును (అహంకార సంకీర్ణతను) విశేషించి యనుభవించినవారి కాతర ప్రార్థనములచే నిశ్చయముగాఁ గరుణామయుఁడైన భగవంతుని యావిర్భావమగును. ఆ యానందమయు నొడిలోనే వారు పరివర్ధితులగుదురు. కర్మమయమును నశ్వరమునైన విశ్వ

మందు విచరింపఁగా విచరింపఁగా రవ్వంత యానందాభివ్యక్తి కానవచ్చినచో నందనందనుని ప్రకాశము విశేషించి లక్షింపఁబడును. ఈ విధమునఁ గ్రమముగా శ్రీకృష్ణుని బాల్యము, కైశోరము, యౌవనము నందైన లీలల ననుస్మరించి, కంసుని పాటును, అనఁగా నహంకారనాశము ననుభవించుట యగును. ఇటులు చేయఁగల్గునపుడే జీవుని మిథ్యాహంకారము లోపించి యానందఘనసత్త యుదయించును. కనుక నే వ్రతము చేసిన మఱునాఁడు నందోత్సవము చేయుదురు. పరమప్రేమమయుఁడును బరమానందస్వరూపుఁడు నైన శ్రీకృష్ణుని ప్రేమస్పర్శ లాభము నొందుటచే నెల్లర జీవనములు నానందమయము లగును. జన్మాష్టమి వ్రతమువలన నగు నానందలాభమిదియే. దీనివలన వ్యావహారికలాభమును గలదు. ఈ విధముగా నిర్జలోపవాసరాత్రి జాగరణముల ఫలముగా శరీరమందలి రసధాతువు చక్కఁగా బరిపక్వమగును రసధాతు పరిపాకము వలన సర్వధాతు పోషణమగును. కావున దీని తరువాతిదగు శరత్కాలమందుఁ దప్పక రాగల యాగంతుక జ్వరాది వ్యాధులు తొలఁగునను నెడి యాశయుండును. శ్రావణకృష్ణాష్టమి నాఁడు జన్మాష్టమీవ్రతము కాఁగాఁ దరువాత వచ్చు సప్తమి మొదలు మూఁడుదినములు వరుసగా లలితాసప్తమి, దూర్వాష్టమి, తాళనవమి యనెడి వ్రతములును, భాద్రపద శుద్ధ చతుర్దశినాఁడు అనంతవ్రతమును జేయఁబడును. శరత్కాలమున వచ్చు శ్రీ దేవీపూజలకు ముందుగా నొక మాసము నుండియు యీవిధమైన మహాపూజల సూచనమగును. ఆనందమయి యైన యమ్మయొక్క శ్రీఘుశుభాగమనమును దెలియఁ జెప్పుటకే ముందుగా నీ వ్రతముల నాచరించుట శాస్త్ర

విహితమైనది. ఈ వ్రతములందన్నింటను లక్ష్మీనారాయణులయు, సుమామహేశ్వరులయు నర్చనము జరుపఁబడును. నిశ్చయముగా సాధకులు, పూజకులు, నుపాసకులు నైనవారి హృదయమం దిప్పుడే శ్రీ మాత్రాగమనమును గూర్చిన యుల్లాసము విశేషించి వెలయఁజొచ్చును.

# శ్రీ దేవి (దుర్గా) పూజ

ఇది శరత్కాలము. క్షితితత్త్వము (జడత్వము) చక్కఁగా వెలసి తెలియఁబడు కాలము. కనుక నింద్రియాధిష్ఠాన చైతన్యమనెడి దేవతాబృందము ప్రకృతి నియామముచే జడత్వమోహముచేఁ గప్పివేయఁబడును. అనఁగా దేవశక్తులన్నియు సుప్తములగును; అనఁగా నాత్మానుసంధానమందుఁ బ్రయత్నహీనము లగును. ఇపుడొక్కసారి చైతన్యమయియు నానందైశ్వర్యమయియు నైన మహాశక్తి ననుసంధానించుట మిగులఁ బ్రయోజనకారి. జలతత్త్వము వెలయు వానకాలున మెల్లమెల్లఁగా జడత్వ మభివ్యక్తమైనది. ఇపుడీ శరదృతువునందు అనఁగా క్షితితత్త్వము ప్రకటమగువేళ జడత్వము సంపూర్ణమగును. ఇట్టివేళ మనుష్యమాత్రుఁడు చైతన్యసత్త్వమం దుద్బుద్ధుఁడగుటకై విశేష ప్రయత్నము చేయకున్నచో జడత్వమోహము సులభముగాఁ దొలఁగదు. బాహ్యజగత్తునందేయనుము; అంతర ప్రకృతియందే యనుము; జడత్వ విశేషప్రభావము గానఁబడునపుడే యథాశక్తిగాఁ జైతన్యసత్తయందుఁ బ్రబుద్ధుఁడగుటకై ప్రయత్నించు టెంతో ప్రయోజనకారి. కనుక నీ యుద్దేశ్యముతోనే శరత్కాల

గనుందు నానావిధములైన దేవపూజలు చెప్పఁబడినవి. అందు శ్రీదేవీపూజయే ప్రధానము.

ఇచట శ్రీదుర్గా కాలీ లక్ష్మి సరస్వతీ త్రిపురసుందరి మున్నగు నామములతో వెలయు చైతన్యమయి యానంద మయి చిచ్ఛక్తియే, అమ్మయే పరమాత్మశక్తియే యుద్దిష్ట. కావున నా యభీష్టనామములతోఁ బూజింపఁబడునది బ్రహ్మ సమ్మితయు నక్షరయు వరదయు నగు గాయత్రీదేవియే.

ఈ నామముల పరమార్థమును సంక్షేపముగా వివరిం చుట యప్రాసంగికము కాదు. దుర్గ పదమునకు దైత్య మహా విఘ్న రోగ శోక దుఃఖ నరక భయ సంసార బంధములని యర్థము. దుర్గ + ఆ = దుర్గా; ఆకారము హంతృవాచకము. ఈ యన్నింటిని బోగొట్టునది యని యర్థము. ద్ + ఉ + ర్ + గ్ + ఆ = దుర్గా; వరుసగా దైత్య విఘ్న రోగ పాప భయ శత్రువులను నశింపఁజేయునది యని యర్థము. దుఃఖేన గమ్యతే ఇతి దుర్గా; అతికష్టముచేఁ బొందఁబడునది యనుట. తక్కిన కాల్యాదినామముల వివరణమునకై నా వ్రాసిన “శ్రీ సత్య నారాయణ శర్మ సాధన”మనెడి గ్రంథమునఁ జూడఁదగును.

ఈ పూజాకాలమున ముందుగా బిల్వవృక్షమున దేవీ బోధనమనెడి విధాన మొకటి జరుపుదురు. బోధనము మేలు కొలుపు. అమ్మ నిద్రించుచున్నదట. ఇంతలోనే కాఁబోవు పూజకై యమ్మను మేలుకొలుపుటే యీ బోధనోద్దేశ్యము. బిల్వవిశిష్టత యేమనఁగా — “మహాలక్ష్మీకరాజ్జాతో బిల్వః” త్రిశక్తులకును మూలమైన శక్తియే మహాలక్ష్మి. ఆమె కిర ణము వలన (తేజస్సు వలన) బుట్టినది బిల్వము. కనుకనే శ్రీసూక్తమందు —

"ఆదిత్యవర్ణే తపసోఽధిజాతో వనస్పతిస్తవ వృక్షోఽథ బిల్వః।
తస్య ఫలాని తపసా నుదంతు మాయాంతరా యాశ్చ బాహ్యా అలక్ష్మీః"

అని బిల్వఫలమహిమ ముగ్గడింపఁబడినది. ఈ మంత్రవివరణమును నా "శ్రీసూక్త రహస్యార్థ"మందుఁ జూచునది. అది యుండనిండు.

అటువంటి మన యమ్మ చైతన్యమయి చిరజాగరణమయి కదా; ఆమెకు నిద్ర, యజ్ఞానము మున్నగునవి సంభవములా? అయినను అమ్మను లేపుచున్నారు. ఎంత గొప్ప చక్కని నియమము! శారదీయ దేవీపూజా సందర్భమున నీబోధన కార్యమందొక సత్యతత్త్వ మిమిడియున్నది. దేవాలయములందును, ఆస్తికుల యిండ్లయందును దెలవాఱుజామున దేవుని మేల్కొలుపు పాటలు సనాతనముగా విన వచ్చుచున్న హేతువు నెవ్వరే నూహించియున్నచో, నీబోధన తత్త్వము వారికి క్రమముగా హృదయంగమ మగును. అంతర బాహిరముల నానసమయమునం దావరించిన జడత్వము తొలఁగి చైతన్యవికాసమును గలిగించుటకై భగవంతుని ప్రార్థించుటే యది యని తెలియును. ఒక వస్తువుయొక్కగాని, యొక భావము యొక్కగాని, గుణాభావము మనకుఁ దోఁచినపుడు, పూర్ణస్వరూప చైతన్యమయి యమ్మయందు, ఆ గుణాభావమును గల్పించుకొని (ఆరోపసహాయముతో) ఆమె యథార్థ స్వరూపము నుద్బోధించుటకై ప్రయాసపడుదుము. ఇట్టి కౌశలము ఫలముగా మన యనుభావములెల్లఁ దొలఁగును. "నేను నిద్రించుచున్నాను; నా యింద్రియాధిష్ఠిత చైతన్య వర్గము జడత్వమోహముచేఁ గప్పఁబడినది. నాల్గువైపుల జడత్వవికాసము ఘనీభూతమైనది. ఈ యవస్థనుండి చైతన్య

రాజ్యమును జేరుటకై నేను మేలుకొనవలయును. ఇందులకై సరళప్రాణముతో, అమ్మనే నిదురించినదానినిగా నెంచితిని. నేను నిద్రించితిని; అమ్మయు నిద్రించినదనుకొందును. అమ్మ మేలుకొన్నచో నామె సంతానముకూడ నిజముగా మేలుకొనును. గనుక నే నేదేనుపాయముచే నమ్మను మేలుకొల్ప వలయును." అమ్మా! "మేలుకొనవే జగను తల్లి! మేలుకో శ్రితకల్పవల్లీ! మేలుకొను పాపసృగ భిల్లీ! మేలుకో తల్లీ!" యనుచు దీనముగాఁ బ్రార్థింపవలయును. దీని ఫలముగా మన సుషుప్తియే విడిపోవును. మనమే జడత్వవిముక్తులమై లేతుము. ఇది ప్రత్యక్షము కదా. ముందుగా మన యభావములను (వెల్తులను) బూర్ణముగాఁ బరమేశ్వరునియందే యారోపించి, యారోపితాభావములను దొలఁగించుటకై దీనముగాఁ బ్రార్థింపఁ గల్గినచో మన యభావములే తొలఁగును.

ఇటులేల యగునని యడుగుము. అమ్మయే యాత్మ; ఆత్మయే యమ్మ. అమ్మ సత్తను మీఱి మనకెట్టి సత్తయు లేదు. అద్దములోఁ గనఁబడు నీడకుఁ (బ్రతిబింబమునకు) బూదండ వేసినయెడల బింబమునకే దండ వేయుటగును. మనము ప్రతిబింబమాత్రులము, గానఁ బ్రతిబింబస్వరూపము తన వెలితిని దొలఁగించుకొనుచో, బింబరూపమైన యాత్మ యందు (అమ్మయందు) ఆ వెల్తికే వెల్తి కానఁబడును. ఇదె రహస్యము.

"ఈ దేవీపూజ కలియుగాశ్వమేధము" అని పెద్దల మాట. అది యమూలకము కాదు. ఈ యశ్వమేధ శబ్దము నకును నాధ్యాత్మికార్థమున్నది. ఇంద్రియము లశ్వములు;

ఖండ ఖండ విషయజ్ఞానము నఖండజ్యోతియందు ప్రవేశ్పచే యశ్వమేధ యాగము. ఉండనిండు.

మన భారతదేశమందుఁ దఱచుగా సర్వత్ర శరత్కాల మందేదో విధముగా దేవీపూజలు జరుగుచుండును. కొన్ని ప్రదేశములవారు రామలీలోత్సవములు చేయుచు, నందును దేవిని నిల్పి పూజింతురు వంగదేశమందు దేవి విశిష్టమూర్తు లను శిల్పులచే రచింపఁజేసి పూజోత్సవములనేక విధము లుగాఁ జేయుదురు. పలుతావులందు శారదామూర్తులను బెట్టియు, శ్రీచక్రప్రతీకమందు మహాత్రిపురసుందరిని (అమ్మను) ప్రతిష్ఠించియుఁ బూజింతురు. ఎన్నివిధములుగా నీయుత్సవ ములు సంపన్నము లగుచున్నను, ముఖ్యమైన దుర్గా సరస్వతీ మూర్తుల తత్త్వమును దెల్పుట యప్రాసంగికము కాదు.

దుర్గామూర్తి:— దశభుజదుర్గ, దశదిక్కులందువ్యాపించి యున్న చిన్మయ మహాశక్తియైన మన యమ్మ ప్రతిరూపమే దశభుజ దుర్గామూర్తి. అదె తన చిన్మయత్వము దశదిక్కు- లందు వ్యాపించి యున్నదని తెలుపును. త్రికాల దర్శిత్వ మును దెలుపుటకే యమ్మకు ముక్కనులు. కాలమును సూచించు సూర్యచంద్రాదుల తేజస్సు లమ్మవే యనియు, అమ్మయే కాలస్వరూపయుఁ గాలాతీతయు ననియు నామె ముక్కనులు తెలుపును. దశేంద్రియ మార్గములందు విచరించి సాధకుని బాధించు నాసురిక సంస్కారముల విదళించునది యమ్మయే యని తెలుపునవియే దశభుజములందుఁ దాల్చిన యస్త్రశస్త్ర విశేషములు. దేవి తాల్చిన యాయుధముల పర మార్థములను గొన్నిటిని దెలుపుదును. చక్రము — సృష్టిచక్ర

పరిభ్రమణ స్వాధీనత; శంఖము – నాదస్వరూపత; గదా – శాసన చిహ్నము; ఖడ్గము – దేహాత్మ జ్ఞాన ఛేదనము; ధనుస్సు – మనోరూపత; బాణములు – తన్మాత్రలు; ఘంటా – ప్రణవస్వరూపత; త్రిశూలము – త్రిపుటీస్వరూపత; పరశు – భవారణ్యచ్ఛేదనము; పాశము – కామము; అంకుశము – క్రోధము; అక్షమాలా – తపస్సిద్ధిప్రదానలక్షణము; దండము – నియమనశక్తి; ఛిన్నశిరము – అహంకారచ్ఛేదనశక్తి; పాన పాత్రము – ఆనందామృత స్వరూపము; అగ్నిపాత్ర – ప్రలయంకర శక్తి; కమలము – సంపత్ప్రదాన చిహ్నము; ముండ మాల – పంచాశద్వర్ణ రూపము; కశా – ఇంద్రియాశ్వచోదన నియమనము; (ఇంకను జేవిధ్యు సర్వవస్తు పరమార్థము నా చండీ పాఠాధ్యాత్మిక వివరణమందు వ్రాయఁబడినవి అముద్రితము.)

చైతన్యరూపిణియైన యమ్మ యావిర్భావముతో సిద్ధి శక్తులు విత్త జ్ఞానములు నావిర్భవించును గనుక సిద్ధి ప్రతి రూపముగా గణేశుఁడును, శక్తి ప్రతిరూపముగాఁ గార్తికే యుఁడును, విత్త ప్రతిరూపముగా లక్ష్మియు, జ్ఞాన ప్రతి రూపముగా సరస్వతియు మాతృమూర్తి పార్శ్వములందు శోభింతురు.

అమ్మ పదములకడ సింహము. జీవుఁడు తన జీవభావ మును జంపుటకై యమ్మ యడుగుల నాశ్రయించును. అనఁగా జీవత్వమును హింసింపఁగల భాగ్యము పట్టిన జీవశ్రేష్ఠుఁడే సింహము. చిన్మయీశక్తి యట్టి జీవుని హృదయమందే యాత్మప్రకాశము చేయును. కనుక నే యమ్మ సింహవాహన. అహంభావ మను నెడి దుర్దమనీయాసురుఁడును, వాని పరివార

మైన మహిషాద్యసుర భావములును జీవసింహముచే మర్దితములై, దేవి యస్త్రములచే క్షతవిక్షతములైనను, మఱియు నెదుర్కొనును. అహంకారము చచ్చియుఁ జచ్చుచుఁజచ్చుచుఁ జావనొల్లదు. దేవి యెడమకాలి బొట్టనవ్రేలిచే నసుఁడుఁ డడఁచి వేయఁబడెను. అమ్మ ధరించినది యసుర రూపము కాదా? ఈ విధముగానా, అమ్మ ప్రకాశించుట? అవును; ఆసురిక శక్తులను సైతము నమ్మ తనలోఁ జేర్చివేసికొనును. అందులకే యిట్టి రూపమును దాల్చుట.

అమ్మ కుడియెడమల నొప్పు గణేశాది మూర్తులయు వారి వాహనాయుధాదులయు వివరణము వ్రాసినచో గ్రంథ కళేబరము పెరిగిపోవును, గాన విడిచితిని.

దుర్గాపూజయం దేడుకల్పములున్నవి. ఎన్ని యున్నను మన దేశమందుఁ దఱచుగా సప్తమ్యాదిగాను, అష్టమ్యాదిగాను, కేవల మహాష్టమిని, కేవల మహానవమిని జేయుదురు. సప్తమినాఁ డమ్మ యావాహనము. అష్టమినాఁడు విశేష పూజ; అష్టమీ నవమీ సంధివేళఁ జాముండాపూజ. నవమినాఁడు పూజకుల యభీష్ట ప్రార్థనములు, కామక్రోధాది శత్రుబలిదానము చేయఁబడును. దశమి విజయాతిథి. విజయకు మఱొక పేరు నిరంజనము. మనోవాగగోచరమై భావాతీతమైన యే నిరంజన సత్తనుండి యీ మహాశక్తి యభివ్యక్తమైనదో, యీ నిరంజనసత్తయందు మఱల మహాశక్తి విలీనమైపోవుటే విజయము. సర్వైశ్వర్య సమన్వితమై విశిష్ట భావరంజన మొంది (పలువిధముల శోభించి) వెలసినది యీ దుర్గామూర్తి. భావరంజనామయి యమ్మ మఱల నిరంజన స్వరూపమున నిల్చుటే విజయము, నిరంజనము.

అపుడే యమ్మ విజయా నిరంజనా నామములది. సాధకుడు శరదాదిని నవరాత్రములు చిన్మయీ మహాశక్తిని బూజించి జడత్వము తొలఁగి, తన కామక్రోధాది శత్రులను బలియిచ్చి విజయ మొందినట్లు భావించును, గాన విజయదశమి యనఁ బడును. నాఁడు రాజులు విజయయాత్రకై వెడలుటయు, (దశాహర్—దశరాత్ర శబ్దభవము దసరా) ఆ దినములందు బడిపిల్లలు విల్లమ్ములతో నూరేగుటయు మున్నగు వాని తత్త్వము ఆధ్యాత్మికమునకు సంబంధించినది కాదు, కావున నది విడుచుచున్నాను.

మూఁడుదినము లమ్మను భక్తితోఁ గొలిచిన పూజకుఁడు సర్వత్ర చైతన్యమయ మహాసత్త నను భవింప సమర్థుఁడగును. గాన దశమినాఁడు, పిన్న పెద్దయను భేదజ్ఞానమును మఱచి, హింసాద్వేషములను మఱచి విజయాదినమున నెల్లరు నొండొరులఁ గాగిలించుకొను దృశ్య మపూర్వము. ఆనందమయము గదా. (తత్త్వము తెలియమిచే నీ యాచారము మన యాంధ్రదేశమున లేదు. కాని సన్నిహిత బంధుమిత్ర వర్గము చేరుకొని యానాఁడు భక్ష్యభోజ్యములతోను నూతన వస్త్రధారణాదులతోను నానందింతురు.)

వర్తమానమున నిట్టి తత్త్వజ్ఞానముతోఁ గూడిన పూజలును, వాని యథోక్తఫలములును గానరావు, గాన దసరా పూజలు నిష్ప్రయోజనములని కొందఱందురు. అయ్యో! ఇట్లనువారు దూరదృష్టులు కారు. ఇప్పుడును దత్త్వజ్ఞానయుతమైన పూజ యసంభవము కాదు. వారి మాట నిజమే యైనను, దసరా పూజలు వేష భాషా మోసములతోఁ జేసినను, మనుజుఁడు కొన్నాళ్లకు శుద్ధబుద్ధియుఁ

బుణ్యాపూతుఁ డగు సత్యలాభమార్గమందు ముందంజవేయు శక్తినొందును.

ముఖ్యముగా మన యాంధ్రమందు ఆస్తికులెల్లరు నీశారద నవరాత్రములందుఁ దొమ్మిది దినములో, మూఁడు దినములో, ఒక్క దశమినాఁడో శారదామూర్తిని(సరస్వతిని) నిల్పియో, పుస్తకరూపిణినిగా భావించియో పూజింతురు. ఆ సరస్వతీపూజా రహస్యమును లక్షింపుఁడు.

## శ్రీ సరస్వతీ పూజ

ఇపుడు శరత్కాలాదిని దేవీపూజయను పేరితో నగుచున్న విధానము వేఱు; శాస్త్రవిధానము వేఱు. రుచిని బట్టి, భక్తినిబట్టి ముగురమ్మలకు మూలమైన (త్రిగుణసామ్యయైన) యమ్మనే పూజించువారు కొందఱు. అమ్మ ప్రలయంకర మహాశక్తిని "కాళీ" యనుపేరఁ బూజించువారు కొందఱు మనుజుఁ డెప్పుడును బరమేశ్వరుని ప్రలయంకర శక్తితత్త్వము ననుశీలించునపుడే వడిగా జ్ఞానవైరాగ్యవిశిష్టుఁ డగును. శ్రీగురుఁడు కృష్ణభగవానుఁడును, అధికారి శిష్యుడైన యర్జునునకు బోధింపవలసినంత బోధించి, తుదకుఁ దన ప్రలయంకరమూర్తిని జూపినపుడే, సంశయగ్రంథు లన్నియు విడిపోయి మఱి ప్రశ్నముపుట్టని జ్ఞానలాభము నొందెను.

స్థితిశక్తి లక్ష్మీనామక; జాగతికముగా శరీరముండు నంతదాఁక మనుజుఁడు విత్తరూపశక్తి నాశ్రయింపక తప్పదు గాన భక్తులను గృపతో లక్షించు నమ్మను లక్ష్మిని గొల్తురు.

అన్నిటికంటె ముఖ్యమైనది మనుజుఁ డపేక్షింప రాసిన జ్ఞానము. అదిగో మహాచితిశక్తియొక్క జ్ఞానప్రద

స్వరూపమే సరస్వతి. సరస్సులు గలది సరస్వతినది. తాఁ బుట్టిన చోటినుండి పాఱివచ్చునపుడు పెక్కు సరస్సులయందుఁ గలియుచు శబ్దించుచునే పోయిపోయి శబ్దమయు రసమయ సముద్రమందుఁ జేరునటులే, యీ మానుషపిండమందును "పరా" వాక్ స్వరూపముతో మూలాధారమందుండి, పశ్యంతీ మధ్యమా వైఖరీ రూపములతో నుచ్చరించునపుడు (మీఁదికి నడుచునపుడు) స్వాధిష్ఠానాద్యనేక చక్రములను గలిసి మీఁఱిపోవు నాదబ్రహ్మస్వరూపిణి నదిగా రూపింపఁబడి "సరస్వతి" యనఁబరఁగెను. బహుత్వసంకల్పము కలుగఁ గానే నామరూపప్రపంచమును బిండాండమందు నాదరూప ప్రపంచమును సృష్టించునది బ్రహ్మశక్తియే, సరస్వతియే. సృష్టికర్తయైన నలువ చెలువఁగాఁ దలఁపఁబడెను. వాణీ భాషా భారతీత్యాది నామములతో వ్యవహరింపఁబడు నామె స్వరూపము "అ" మొదలు "క్ష" వఱకునైన వర్ణమాలయే. అదె యక్షమాల. సారస్వతి మనఁబడు జ్ఞానమంతయు నీ యక్షరమాలయందే యున్నది. అదె లిపిరూప మొంది పుస్తక మనఁబడును. కావున వాగ్దేవికిఁ బ్రతీకముగాఁ బుస్తకమును నిల్పి పూజింతురు. ఈ శరదాదిని బూజింపఁబడునది పుస్తక రూపిణి సరస్వతి. కనుకనే నేలఁబెట్టియుఁ, గాలఁదాకియు నగౌరవింపము. పుస్తకము వాణీమూర్తి.

న్యాయముగా సరస్వతీపూజకు శాస్త్రమేర్పఱచిన కాలము శరదృతువు నంతము. అనఁగా వ్యోమతత్త్వము నభివ్యక్తి యగాఁగి, వసంతకాలారంభమున వాయుతత్త్వము వెలయు కాలమును జ్ఞానదాయినీ సరస్వతీపూజా విధానము నకై ఋషులు నిర్ణయించిరి. భౌతికతత్త్వములందాకాశ

తత్త్వమే నిర్మలమును సూక్ష్మమును వ్యాపకము నైనది. విశ్వప్రకృతియం దీ తత్త్వము వెలయునపుడు మనకుఁ దెలిసియో తెలియకో మన యంతఃప్రకృతియు సూక్ష్మమును వ్యాపకభావము నొందునదియు నై యుండును. కనుక సూక్ష్మాతిసూక్ష్మయు జ్ఞానమయియునైన మూర్తియొక్క ధారణోపలబ్ధులకై శాస్త్రమందు విహితమైన కాలమిదియే, యధికోపయోగి. కనుక నీ సరస్వతీపూజకై విధింపఁబడిన తిథి "వాసంతీపంచమీ, శ్రీపంచమీ" యనఁబరఁగినది. ఈ పంచమి నుండియే వసంతర్తులక్షణము వెలయ నారంభించును. శ్రీశబ్దము లక్ష్మికిని సరస్వతికిని జెల్లును. ఎల్లరచే నాశ్రయింపఁబడునది కావున శ్రీ=లక్ష్మి, విత్తాది సంపద్రూప. ఇఁక, శ్+ర్+ఈ=శ్రీ; శ వర్ణము ఆనందవాచి. రేఫము తేజో (జ్ఞాన) వాచకము. ఈ కారము శక్తివాచకము. కావున శాక్షరము బ్రహ్మశక్తిసారము. ఇదే గుప్తమగు సారస్వత బీజము. కాఁగా జ్ఞానానందస్వరూప పరాశక్తి, వాగ్దేవి, సరస్వతి. ఇవి శాస్త్రసమ్మత వ్యుత్పత్త్యర్థములు. వాసంతీపంచమీ తిథి కధిదేవత సరస్వతి. తొలుత నేనాఁడు ఋషిహృదయమం దీజ్ఞానదాయినీమూర్తి యావిర్భవించినదో, యా శుక్లపంచమినే శాస్త్రకారులు సరస్వతీపూజకై విధించిరి. ఈ సరస్వతీపూజయే కాదు, దేవదేవీపూజలం దధికభాగము విశిష్టతతోఁ గూడిన యాధ్యాత్మికోత్సవములే. కావున నే తిథియందే మూర్తి ప్రథమావిర్భావమయ్యెనో, ఆ తిథియందా మూర్తి పూజనే శాస్త్రకారులు విధించిరి. రహస్యమేమనఁగా, ఆ యావిర్భావ తిథినాఁటికి మన బాహ్యాభ్యంతరప్రకృతులు అట్టి భావమునే పొందియుండును. అనఁగా నట్టి దేవశక్తి యావిర్భవించుటకు

గడు ననుకూలములనుట. అనుభూతిసంపన్నులైన సాధకులు మాత్రమే యిమ్మాటయందలి సత్యము నెఱుంగఁగలరు,

సరస్వతియే బ్రహ్మవిద్య. బుద్ధితత్త్వము మిగుల నిర్మలమైనపుడే, అనఁగా సత్త్వగుణము రజస్తమస్సుల నణఁచి వేసినపుడే బ్రహ్మవిద్య ప్రకాశించును (ఆవిర్భవించును). గనుక జ్ఞానదాయిని మన యమ్మ సరస్వతి సర్వశుక్ల; అనఁగాఁ దెల్లనిదిగా నెన్నఁబడినది. నాదము (శబ్దము) నవలంబించియే జగత్సృష్టియైనది. ఈ విశ్వము శబ్దమయము. విశుద్ధ జ్ఞాన స్వరూపిణి యమ్మ (ఆత్మ) శబ్దరూపముతోఁ దాను నెలసి నపుడే, యీ జగత్ప్రపంచరచనమగును, గనుక నాదశక్తికిఁ బ్రతిభూరూపముగా (నాదశక్తిని దెలుపు చిహ్నముగా, వీణా యంత్రము బ్రహ్మవిద్యా స్వరూపిణియైన యమ్మ కుడిచేత శోభించును. మఱియు నెడమచేతియందు సమస్తజ్ఞాన విజ్ఞానములకు నేకమాత్రాధారమైన వేదమునకు (జ్ఞానశక్తికి) ప్రతిభూస్వరూపముగాఁ బుస్తకము శోభిల్లును. అమ్మ మూఁడవ చేతియం దక్షమాల, అనఁగా జపమాల. ఇది 'అ' మొదలు 'క్ష' వఱకు నైన యక్షరములయందే తన సారస్వతస్వరూప మున్నదనియు, నిర్దిష్టమంత్రముతోఁ దన్నుపాసించువారికి జప ఫలరూప జ్ఞానమును బ్రసాదించుననియుఁ దెలుపుటకే. నాలవచేతియం దమృతకలశమును ధరించినది. తన్నుపాసించు భక్తులకు జ్ఞానమూలకమైన యమృతమును మోక్షమును బ్రసాదింతునని తెలుపుటకే కలశధారణము.

మన యమ్మ వాహనము హంసము. హంసము నీరుకలిసిన పాలనుండి నీటినివిడిచి పాలనుమాత్రమే గ్రహించుశక్తి కలది. అటులే మనుజుఁడును ఈ నశ్వరజగత్తుతో నభిన్నముగానున్న

నిత్యజ్ఞానసత్తను జగత్తుకంటె వేఱుగాఁ గ్రహింపఁగల్గునపుడే యాతఁడు హంసధర్మము గలవాఁడగును. ఇట్టివాఁడే బ్రహ్మ విద్యా లాభముతోఁ గృతార్థుఁడగును. శుద్ధసత్త్వము వెల యుటచేత నాతఁడు తెల్లనిహంసముగా నిరూపింపఁబడెను. అనఁగా శుద్ధసత్త్వగుణాత్మక జీవత్వమునకుఁ బ్రతీకము. బ్రహ్మ విద్యా స్వరూపిణి మన యమ్మ సరస్వతి యట్టి జీవు నాదరించును, అభిమానించును గాన మన యమ్మ హంసవాహనగా నెన్నఁబడినది.

ఈ హంస సంబంధమున మఱియొక రహస్యమున్నది. మనము జీవత్వస్వరూపమును బర్యాలోచించినపుడు స్థూల దృష్టితో జీవనామకుఁడు శ్వాసప్రశ్వాసముల సమష్టికి వ్యతీతుఁడే కాని, మఱేమియుంగాదని తెలియును. శ్వాస ప్రశ్వాసములకు మఱియొక పేరు 'అజపా - హంస'. సాధారణముగా జీవుఁడు రేవగళ్లు మొత్తము 21600 హంసమంత్ర మనెడి యజను జపించుచుండును. జపించుట యనెడి ప్రయత్నము లేకయే తనంతట జరిగిపోవు జపమునకే అజప యందురు. శ్వాసమందు 'హం' బీజమును, ప్రశ్వాసమందు 'సః' బీజమును నడుచుచుండగా 'హంసః' అగును. ఆ బీజములు వ్యత్యస్తము గాఁగా 'సోఽహం' అగును. అనఁగా 'వాఁడే నేను'— 'అహం బ్రహ్మాస్మి' యనెడి మహావాక్యార్థము జీవునకుఁ దెలియకయే శ్వాసక్రియా రూపముగా మననమగుచుండును. మనుజుఁడు తనజీవనమందు ఇట్టి శ్వాసప్రశ్వాసస్వరూపమును స్వతంత్రముగా ననుభవింపఁగల్గెనేని, దివారాత్రము లీ యజపా జప స్వరూపమును గుర్తింపఁగల్గెనేని అతనిచెంత నీ బ్రహ్మ విద్య ప్రతిభాసించును. కనుకనే బ్రహ్మవిద్యాస్వరూపిణి మన

యమ్మ హంసవాహనమైనది. ఉపనిషత్తులందు బ్రహ్మవిద్య 'పరా - అపరా' యని రెండువిధములుగా వర్ణింపఁబడినది. సాక్షాద్ బ్రహ్మవిద్య పేరే పరావిద్య. దీనికంటె వేఱయిన విద్యలెల్ల 'అపరా' విద్యపేరఁ బఱచితములు వేదవేదాంగ, ఆయుర్వేద ధనుర్వేదాదులెల్లను ఆధునికములైన యర్థకర విద్యలును, శిల్ప సంగీతాది చతుష్షష్టికళల పర్యంతము నీ యపరావిద్యలోనివే. ఈ జగత్తునందు విద్యయనుపేరఁ బరఁగు వానికెల్ల నీసరస్వతియే యధిష్ఠాత్రి. కనుక మనుజుఁడెట్టి విద్య నొందుటకుఁ బ్రయాసపడినను, వాఁడు తెలిసియో తెలియకో సరస్వతీదేవికి శరణాగతుఁడు కావలసినదే. యథార్థస్వరూపము నెఱింగికొని భక్తితో జ్ఞానదాయిని సరస్వతీదేవిని బూజించి, యుపాసించువారు తమ యభీష్టవిద్యాలాభము నొంది, తప్పక కృతార్థులగుదురు. తొలుత మూర్ఖులుగా నుండిన కాళిదాసాదులకును నపూర్వ కవిచక్రవర్తిత్వమును బ్రసాదించినది యీసరస్వతియే. కాళీదేవి వేఱు, సరస్వతీదేవి వేఱు అనుకొనవలదు. దుర్గావతారమునందు మొదటిదైన మహాకాళియే, అనఁగాఁ బ్రలయంకర శక్తియే విద్యాప్రదాయిని. ఈరహస్యము దుర్గానవాక్షరమంత్ర పరమార్థము నెఱింగినవారికే తెలియును ఆ మంత్రమందలి మొదటి 'ఐం' వర్ణము సర్వవిద్యాప్రదమగు వాగ్భవబీజము. ఇది శక్తిత్రయమందు మొదటిశక్తియైన మహాకాళికిఁ జెందినదే. మహాకాళి సర్వవిద్యాప్రదాయిని, జ్ఞానప్రదాయిని కనుకనే 'కాళీ విద్య - కాళీవిద్య' యని వాగ్భవబీజముతో నుపాసించి సిద్ధినొందెను గానసే కాళిదాసుఁడయ్యెను ఇది రహస్యము. మేధావులు కానివారును, శాస్త్రార్థగ్రహణసమర్థులు కానివారును శ్రద్ధా

భక్తి విశ్వాసములతో నమ్మను సరస్వతీదేవిని యథాశక్తి యథావిధి నుపాసించినపుడు దీని ఫలప్రదగుణము నెఱుంగఁగలరు. కనుక నే లోకానుగ్రహాకాంక్షతో నా కాళిదాసుఁడే తన 'దేవీపంచస్తవి' యనెడి గ్రంథమందుఁ దొలుతనే, వాగ్భవ బీజమంత్ర జపక్రమమును విపులముగా నుగ్గడించెను. (నా యనువదించిన 'దేవీపంచస్తవి' సి జూచునది.) కాళియే వాక్ఛక్తి వాగ్మిత్వాప్రద. ఇవి జనులను లోభపెట్టు మాటలు కావు; పరీక్షిత సత్యములు భ్రమప్రమాదములు లేని సత్యదర్శిఋషుల సదుపదేశములు. వేదములందును వేదమూలక వాక్యములందును శ్రద్ధలేనివారిమాట వేఱు. గురుశాస్త్ర వాక్యములందు శ్రద్ధావంతులగువారు తప్పక యాశానురూప ఫలము నొందఁగలరు. వాక్కు—వేదము అనఁగా నాదము—జ్ఞానము అను నీరెండింటికి నధిష్ఠాత్రి సరస్వతియే. ఈ రెండు రూపములతోనే యమ్మ వెలయును. వాక్కు నవలంబించియే జ్ఞానము వెలయును. వేదమువల్లనే (జ్ఞానమువల్లనే) వాక్కు (నాదము) అభివ్యక్తమగును. ఇమ్మాటనే యమ్మ యొక చేతి వీణయు, రెండవచేతి పుస్తకమును దెలియఁజెప్పును. వాక్యజ్ఞానములే యీవిశ్వము. శబ్ద జ్ఞానముల యనుభూతిని మించి విశ్వమను పేర వేఱేమియుఁ గానరాదు. కానఁ జక్షుష్మంతుల కీ విశ్వము సరస్వతీ స్వరూపమే.

ఇపుడు మనము "విశ్వరూపే విశాలాక్షి విద్యాం దేహి నమోఽస్తు తే" యనుచు నమ్మ సరస్వతి యడుగులందు బడి ధన్యత నొందుదము. ఓం తత్ సత్.

# అన్నపూర్ణా పూజ

ఇదే మన యాంధ్రదేశమందు "గౌరమ్మ పండుగ" యను పేర సాగుచున్నది. జీవికను నిర్వహించుకొనుట కుపయోగించు ధాన్యము మున్నగు సస్యములను బొలమునుండి యిండ్లకుఁ దెచ్చికొని సంరక్షించుకొని యేడాది పొడుగునను జీవనధారణోపయుక్తముగా సంగ్రహించుకొను టారంభమగు సమయమందు ఈ సనాతనజాతి అమ్మయొక్క, అన్నపూర్ణామూర్తివైపొక్కసారి చూడకుండఁజాలదు. ఏ మహాశక్తి సస్యరూపముతో, అన్నరూపముతో వెలసి మన యన్నమయకోశమును, అనఁగా స్థూలదేహమును బోషించి రక్షించునో! యదియే యన్నదాయిని, అన్నపూర్ణ, గౌరమ్మ. కేవల మీ జీవనమందే కాదు, జన్మ జన్మాంతరములనుండి యే యమ్మ మనకన్నదానము చేయుచు వచ్చుచున్నదో, మాతృస్తన్యముతో మొదలిడి చచ్చువఱకు నన్నరూపముతో, నాహార్యరూపముతోఁ దన్ను వెలయించుకొనుచున్నదో యామెయొక్క యయాచితావ్యాజకరుణను, ఏడాది కొక్కసారియైనను స్మరించి, ఒక్కనాఁడైన నామె చరణములందుఁ బత్ర పుష్ప ఫల జలాదికము నర్పించు కోరిక పుట్టకుండునా? ఈవిధముగా నన్నమయకోశమునకైన యాహారమునే కాదు, మన ప్రాణమయ మనోమయ విజ్ఞానమయానందమయ కోశములకుఁగూడ నామెయే తగినంత యాహారము నిచ్చుచున్నది. ఏకోశమును బోషించుటకే యాహారము యథార్థముగా జాలియుండునో, యా కోశమునకా యాహారము నిచ్చునది యన్నపూర్ణమ్మయే. "ఆహారము

నిచ్చునది" యను మాటచే సాధారణముగా మనము, ఆఁకలి గొన్న వ్యక్తి కెట్లు తినుబండములు నిచ్చునో యట్లే యన్నపూర్ణాదేవి మన కన్నదానము చేయుచున్న దనుకొందుము. వాస్తవముగా నది కాదు. ఆమె నిత్యము నన్నరూపముతోనే, ఖాద్యరూపముతోనే వెలసి, మనల ననాది కాలమునుండియుఁ బట్టుకొని పీడించుచున్న యాఁకలి రాకాసిని దొలఁగించుచున్నది. అమ్మ నిజముగా నింద్రియ భోగ్యవిషయ రూపముతో నెలసి, మన యనాదిజన్మములనుండి యున్న యింద్రియ లాలసను జరితార్థము చేయుచున్నది. ఈవిధముగాఁ గేవల స్థూలదేహములకైన యాఁకటినే గాక మన సూక్ష్మకారణ దేహముల యాఁకటిని గూడఁ జైతన్యమయ మహాశక్తి స్వరూపిణి యన్నపూర్ణమ్మయే చక్కఁగా నివారించుచున్నది. ఆమెయే అన్నదాయినిరూపముతోను, అన్నరూపముతోను నున్నది. ఇదే మాతృత్వము. ఇదే మాతృస్నేహముయొక్క చరమాభివ్యక్తి. ఏశక్తి వస్తువును మనము జడమనుచుఁ గూర్చున్నామో, యది చైతన్యమయి యనెడి ధారణ చేయఁ జాలినవారు ఈ సనాతన వైదికధర్మముల సర్వరహస్యములను నిపు చక్కఁగా ధరింపఁగలరని తోఁచెడు.

మనము శక్తిని జిన్మయి యని యెఱుంగవలయును. ఎప్పుడు నేని, ఏవిధమైన యొక విశేష వికాసమును లక్షింపఁ గల్గుదుమో, యపుడే యా వికాసమును శక్తిరూపిణియైన యమ్మ లీలఁగాఁ బ్రత్యక్ష దేవతారూపముగాఁ గనఁ బ్రయత్నింపవలయును. ఈ విధముగా మన మెల్లప్పుడును జేయు ప్రయత్నము ఫలముగా శక్తి చిన్మయి, శక్తి యాత్మ యనెడి సత్యము నెఱుంగఁగల యోగ్యత లభించును. ఉండని.

ఆహారము లేక పంచకోశముల పోషణము జరుగనప్పుడే జీవరూపి శివుఁడు, అన్నపూర్ణాదేవి గుమ్మముకడ నిత్యముఁ బ్రతిక్షణమును అన్నభిక్ష చేయును. ఏమనఁ బంచకోశములకును నాహారప్రయోజనమున్నది. మఱియు సర్వభూతమహేశ్వరుఁడును విజ్ఞానమయశివుఁడౌను, అనఁగాఁ దాను గురుఁడయ్యును విశ్వాసులైన సర్వజీవుల మంగళముకొఱకు అజ్ఞానమును దొలఁగించుటకై, ముక్తికై యెల్లప్పుడును జ్ఞానభిక్ష చేయుచుండును గావుననే యన్నప్రదాననిరతయు, మూర్తిమతియు, స్నేహస్వరూపయు స్తనభరనమ్రయు నైన యన్నపూర్ణమ్మయెదుట బికారివేషముతో శివుఁడు నిలుచున్నాఁడు. ఆహా! ఈ మూర్తి యపూర్వము. ఔరా! ఆశ్వినపూర్ణిమా తిథియందు మహాశక్తిరూపిణి నమ్మను, అన్నదాయినీ మూర్తిఁగాఁగన్న యా మహర్షులే ధన్యులు. అన్నప్రదాననిరత, మహాశక్తిరూపిణి యమ్మ రజోగుణాత్మిక కనుకనే, యన్నపూర్ణ రక్తవర్ణ. శ్రీ కాశీక్షేత్రమందు సువర్ణమయమైన యన్నపూర్ణామూర్తి ప్రతిష్ఠింపఁబడినది. అచట లక్ష్మీదేవియు భూదేవియు నా యన్నపూర్ణకు నిరువంకల నుండుట కనుగొందుము. ధీమంతులైన పాఠకులు దీని రహస్యమును సుగమముగా నెఱుంగఁగల్గుదురు. ధనధాన్యాదిరూపముతో నీ లక్ష్మీదేవియు, సస్యరూపముతో నీ భూదేవియు నను నిరువురిని బట్టియే మన యమ్మ యన్నదాయినీ మూర్తిప్రకాశము. ఈ యిరువురి మూర్తులను విడిచినచో నన్నపూర్ణాదేవీస్వరూపము బోధపడదు.

సాధకుఁడా! నీవును యథార్థముగా దీనుఁడవై పుష్పాంజలి చేతఁబట్టుకొని —

"అన్నపూర్ణే సదాపూర్ణే శంకర ప్రాణవల్లభే।
జ్ఞానవైరాగ్య సిద్ధ్యర్థం భిక్షాం మే దేహి పార్వతి !"

అని మాటిమాటికి స్తుతించుచు దర్శింపుము. ఈ జగత్తు అన్నమయము. నీలోపల, వెలి నంతయు నన్న మేయున్నది. అన్నము విడిచి వెచ్చట నేమియు లేదు. ఇది చూడు లోపలం బ్రాణరూపమైన యన్నము. వెలుపల భోగ్యవిషయరూపమైన యన్నము. అన్నమే ప్రాణము. అన్నమే బ్రహ్మము. అన్నమే యాత్మ—బ్రహ్మాది స్తంబపర్యంతము నంతయు నన్నమే. "అహమన్న మహమన్న మహమన్నమ్, అహమన్నాదో అహమన్నాదో అహమన్నాదః" శ్రుతిచూడుము. మనయమ్మ అన్నపూర్ణామూర్తితో సంతట వెలయుచున్నది. శబ్ద స్పర్శ రూప రస గంధములు ప్రతిపరమాణువు నెడనైన చింత ప్రత్యేకస్పందనము. సర్వత్ర మనయమ్మ అన్నపూర్ణామూర్తితో విరాజిల్లుచున్నది—అని చూచిచూచి నీవు అన్నమవు, అన్నాదుఁడవునై పొమ్ము. "జ్ఞానవైరాగ్య సిద్ధ్యర్థం భిక్షాం మే దేహి పార్వతి" అని యీ విధముగా ననగలిగినపుడే నీ పూజ సార్థకమగును. పూజించి పూర్ణపరితృప్తిని బొందగలవు. ఈ అన్నపూర్ణా పూజవలన నాధ్యాత్మిక ఫలమేమనగా విజ్ఞానమయ గురుని కృప గడించుటే. ఆతని కృప గడించినపుడే మోక్షలాభము సునిశ్చితము. ఇంతేకాక యీపూజవలని యాధిభౌతిక ఫలవిశేషమేమనగా నీమూర్తి రహస్యము నెఱింగికొని భక్తితో బూజించువారికి మనుగడయం దెన్నడును నన్నాభావ ముండదు.

# శ్రీ లక్ష్మీ పూజ

మన దేశమందు దీపపూజ ఆశ్వయుజ కృష్ణామావాస్య, దీపావళి పండుగనాఁడు జరుపుదురు. ఆశ్వీజ పూర్ణిమనాఁడు గౌరీపూజ యనుపేర ధాన్యాది సస్యరూప లక్ష్మీపూజ చేయుదురు. దానిగూర్చి వ్రాసియుంటిని. ఇపుడు సమన్వయించుక గుర్తించినచో శాస్త్రకారులు శరదృతువునందే బహువిధ పూజల వ్యవస్థచేసిరని తెలియవచ్చును. లలితాసప్తమీ వ్రతము మొదలు రాసలీలాపూజవఱకు నన్నిపూజ లీసమయమందే చేయఁబడును. కార్తికము శరదృతువునందే యని మున్ను జెప్పితిని. ఈశరత్ ప్రథమ పక్షమందు లలితాసప్తమ్యాది వ్రతములును, పిదప పితృపక్షమందుఁ బితృదేవతా తర్పణములును, దేవీపక్షమందు దుర్గాలక్ష్మీపూజలును, ఆతరువాతి పక్షమందు దీపావళీ శ్యామా పూజాదులును ప్రధానములు. శ్రీకృష్ణజన్మాష్టమి మొదలు రాసలీలా పర్యంతము పలుపూజలు శరదృతువునందే సంపన్నములగును. మన యాంధ్రప్రదేశమందీ నా వ్రాసినవి కొన్ని ప్రచలితములు కాకున్నను, వాని ప్రామాణ్యమును శాస్త్రకారుల యుదారాభిప్రాయములను దెల్పుటకే వ్రాసి నిబంధించితిని. పలుపూజలును శరత్తునందే విహితములు చేసిన యుద్దేశ్యమేమనఁగా, నపుడు శక్తితత్త్వప్రాకట్యము విశేషించి తెలియఁబడును గనుక మనోమయ క్షేత్రమందు సముచితము జనోత్సాహము తప్పకగును. ఇటులు లోను వెలిని బూర్ణ జడత్వాధికారము కానఁబడు నీ సమయమందు, ఎంతవఱకుఁ చైతన్యసత్తయొక్క విశేషోద్బోధము చేయఁబడునో యంతగా

మనుష్యుఁడు మంగళమునకు మార్గమందు - సత్యమార్గమందు ముందంజ వేయఁగల్గును. ఏమయినను మనమిచ్చట లక్ష్మీ పూజాప్రస్తావము నారంభించితిమి. లక్ష్మీ - శ్రీ. మనుష్యుఁడు జీవించి యున్నంతవఱకు నతనిపేరికి ముందు, ప్రాణముతో నున్నాఁడని సూచించు శ్రీ శబ్దము చేర్పఁబడును. శ్రీ శబ్దము ప్రాణమునకే నున్నతియొక్క పేరు. కనుక లక్ష్మీపూజ యనఁగానే ప్రాణపూజయే యని తెలియవలయును. సమస్తపూజలును ప్రాణపూజలే యని చెప్పవచ్చునుగాని, యీ పూజయొక్క విశేషత్వమేనఁగాఁ - పార్థివములైన ధనైశ్వర్యములందుఁ బ్రబలకాంతిగలవార లీ లక్ష్మీమూర్తిని బూజించి - ధన ధాన్యముల కధిష్ఠానదేవినిపూజించి యథాశానురూపముగా ధన ధాన్యాదులను నొందుచున్నారు. ధనకామియైన వ్యక్తి సత్య ప్రతిష్ఠితుఁడై, రాత్రియంతయు జాగరణముచేసి యీలక్ష్మిని బూజింపఁగల్గుటచే నాతఁడు ధనవంతుఁడగును. ఇది స్తవము కాదు; వాస్తవము. పూర్వకాలమున ధనకాముకులైన వారలీ సంపదధిష్ఠాత్రీదేవి నారాధించి, యామె కృపచే వాణిజ్యా దులయందు దాశానురూప ధనలాభము నొందఁగల్గుచుండెడి వారు. ఈ దేశమందిప్పుడును వణిక్సంప్రదాయముతోఁ బూజించి ధనవంతులగుట యీ లక్ష్మీపూజా ఫలమే. ఇదెవ్వరును గాదనరు

చైతన్యమయి మహాశక్తి ధాన్యాది సస్యరూపముతో వెలసి జీవులకుఁ బ్రాణరక్షా కారణమగుచున్నది. ఆమెయే లక్ష్మి. కనుకనే ధాన్యాదిసస్యములను సువర్ణాది ధనమును లక్ష్మికిఁ బ్రతీకముగానవలంబించి పూజించుచున్నారు. వేదము లందుఁ బ్రాణులకుఁ బ్రాణరూపముగా నన్నమే వర్ణింపఁబడినది.

కావున అన్నము అనఁగా ధాన్యాదిసస్యములే. నిస్సంశయముగాఁ బ్రాణరూపిణియైన లక్ష్మీదేవియొక్క సర్వశ్రేష్ఠప్రతీకము.

లక్ష్మీవాహనము గుడ్లగూబ. ఇది దివాంధప్రాణి దివా శబ్దార్థము ప్రకాశము. అనఁగా జ్ఞానము. ప్రకాశస్వరూప వస్తువునందు అనఁగా జ్ఞానమునందు అంధులైనవారే దివాంధధర్ములు. అనఁగా పగలు కానలేని గుడ్లగూబధర్మము పట్టినవారు. అమృతస్వరూపమైన జ్ఞానరత్నముకంటె పార్థివ ధనరత్నాదులయందు విశేషలాలాయితులైనవారే దివాంధప్రాణులు. వారే గుడ్లగూబలు. ధనాధిష్ఠాత్రి దేవి యిట్టి జీవుల పైనే యధిష్ఠించును. కనుకనే లక్ష్మీదేవి ఉలూకవాహన.

వేదములందు లక్ష్మీదేవి హిరణ్యవర్ణగా జెప్పఁబడెను. లక్ష్మీధ్యాన మంత్రమందును నీమె గౌరవర్ణగాను, సురూపగానుఁ జెప్పఁబడినది హిరణ్యమునకు నధిష్ఠాత్రియైనది హిరణ్యమగుటయే యుచితము శాస్త్రోక్తమైన యీ పూర్ణిమాతిథి మనస్సు పూర్ణముగా వికసించు సమయము. దేశాంతరపక్షమున అమావాస్యగానే కైకొన్నచో మనస్సు పూర్ణముగా లయించు సమయము. ఎట్లైనను రాత్రి జాగరణపూర్వకముగా లక్ష్మీదేవిపూజ జరుగుచుండును. తపస్సు నతిక్రమించి యనఁగాఁ గష్టసాధ్యధర్మమును విడిచి యభీష్టలాభముఁగో ధన్యుఁడైనవాఁడెవ్వఁడు? ఇపుడొక ప్రశ్నము — ఎట్టి పార్థివ ధనరత్నాదులను గాంక్షింపనివారీ లక్ష్మీపూజ చేయుచున్నారా? లేదా? యని దీనికుత్తరమేమనఁగా నిష్కాములైనవారే యీ ధనాధిష్ఠాత్రిదేవినిఁ బూజింపఁగల్గుచున్నారు. ఆవశ్యకము గనుక చెప్పెడిదేమనఁగా అప్పుడు వారు ధనశబ్దమునకు సాధారణార్థము గైకొనక ప్రేమధనమనియే

యర్థము చేసికొందురు. మఱియు యథార్థముగా మనము మన ప్రాణదేవతవలన ననురాగము నొందఁజాలము. ప్రాణ ప్రేమమందు ముగ్ధులము కాఁజాలము. కావున నీ పూజలు మాటిమాటికిఁ జేయుట తప్పదు. ప్రాణరూపిణి లక్ష్మీదేవి యెదుట ప్రాణధనభిక్ష చేయుట యగును. ఈమె దయచేసి యొక్కసారి ప్రాణమునుఁ బరమప్రేమమయుని యథార్థ స్వరూపముగాఁ దెలియఁజేసినపుడే నిక్కముగా మనము ప్రేమధనలాభము నొంది ధన్యులము కాగలము. అపుడే మన మనుగడయందలి నిర్ధనతాదారిద్ర్యములు దొలఁగిపోవును.

హిరణ్యవర్ణా శబ్దమునకు యర్థమేమనగా —

“హిరణ్యం విష్ణురాఖ్యాతం తస్య వర్ణస్తు వైష్ణవీ।
తతో హిరణ్యవర్ణేతి లక్ష్మీర్గీయతే.........”

హిరణ్యమనఁగా విష్ణువు. అతని వర్ణమనఁగా శక్తి. ఆమెయే వైష్ణవి. సర్వవ్యాపియు, స్థితికర్తయునైన విష్ణుని శక్తియే హిరణ్యవర్ణలక్ష్మి. ఈమె జీవులస్థితి లాభమునకగు విష్ణుశక్తి. లక్ష్మియనగా భక్తులను లక్షించునది. కృపతోఁ గనునది. కాగా లక్ష్మి (నా వ్రాసిన శ్రీసూక్తరహస్యార్థమందు హిరణ్యవర్ణలక్ష్మిని గూర్చి వ్రాసిన యాధ్యాత్మిక యౌగికార్థ వివరణమునుఁ జూచునది.) ప్రాణులస్థితి కుపయోగించు ధనధాన్యాది రూపమున నామెయే యుండి పూజింపఁబడుచున్నది. చెప్పెడి దేమనఁగా పార్థివధనవిషయమున దరిద్రులుకాకున్నను ప్రేమ జ్ఞాన ధనవిషయమున దరిద్రులైనవారు నిస్సంశయచిత్తముతో నీ ప్రాణరూపిణి ధనాధిష్ఠాత్రి దేవినిఁ బూజింపవలయును.

# శ్యామా (కాళీ) పూజ

కార్తీకమాసామావాస్య. ఘోరనిశీధిని, భయంకరతామసి, మధ్యరాత్రి, గంభీరనిస్తబ్ధత; ఇట్టి లక్షణములతో బాహ్య ప్రకృతియందుఁ బ్రలయప్రకాశమగును. అంతఃప్రకృతియందును నిట్టులే యగును. మనస్సంబంధమైన సంకల్ప వికల్పములు స్వాభావిక నియమముచే స్తంభించును మృత్యువు నడుమ నమృతసంధానముకొఱకు ఖండఖండజ్ఞానముల యాధిపత్యము నుండి విముక్తఁబడి, అనఁగా విషయాకర్షణమునుండి తప్పుకొని విశుద్ధపూర్ణజ్ఞానమందుఁ బ్రతిష్ఠితుఁడగుటకై యీ విధమైన ప్రలయము నడుమనున్న మనుష్యుఁడు సత్యచిన్మయసత్తను బట్టుకొని యనుభవించుట యగును. ఇట్టి దినమందు, ఇట్టి యనుకూల ప్రకృతివిలాసమందుఁ గాలీపూజ చేయుదురు. కావున నీ పూజాప్రారంభమందు శ్మశానచింతనము, ప్రలయధ్యానము చేయఁబడును. యౌగికముగా దీనిభావమేమనఁగా- శ్మశానమనఁగా సుషుమ్నామార్గము; సుషుమ్నామార్గమందలి చక్రములయందు మూలాధారాదిగాఁ గ్రమముగా బ్రహ్మ విష్ణు రుద్ర మహేశ్వర సదాశివులు పరాశక్తి శ్యామాదేవి శక్తివల్లనే శక్తిమంతులగుచున్నారు. కావున వారు ప్రేతలనఁబడిరి. అందులకే దేవీ నామావళియందు "పంచప్రేతమంచాధిశాయినీ" అనునది యొకటి. మూలాధారమునుండి బ్రహ్మరంధ్రపర్యంతమై శ్మశానమందు (ప్రేతలుండు తావులందు) సుషుమ్నయందు సంచరించునది కనుకనే కాల (శివ) శక్తియైన కాళి శ్మశానసంచారిణి యనఁబడినది చంద్రస్వరూప మానసికకళలు పాడ్యమి మొదలుగా నొక్కొక్కటి

౦యమొందుచు నమావాస్యనాటి కన్నియు లయమొందుటే ప్రలయము. అట్టియపుడే సంకల్పవికల్పములు స్తంభించిపోవుట. అప్పుడే పరాశ్యామా శక్తిని ధ్యానించి జీవుఁడు శక్తిసాయుజ్యముతో శివస్థానమందు శివసాయుజ్యము నొందుట. ఇదె యీనాఁటి సాధకకర్తవ్యము. అది యుండనిండు.

కృష్ణవర్ణమందు సర్వవర్ణములును లోపించును శుక్లవర్ణమందు సర్వవర్ణములు సమన్వయించును గనుకనే వెండికొండనుబోలి శుద్ధసత్త్వ గుణరూపియైన విజ్ఞానమయ మహేశ్వరుని పైనే సర్వాభావ ప్రలయంకరియు, మహాశక్తి రూపిణియునైన కాళికాదేవి ప్రతిష్ఠిత యైనది. వెలికిలఁ బండుకొనియున్న యా తెల్లని శివమూర్తిపై నడుగుపెట్టి నిల్చియున్నటులు నల్లని కాళికాదేవి చిత్రింపఁబడిన చిత్రపటములు, ఈ చెప్పిన విషయమునకు జ్ఞాపికలే. జీవమాత్రుఁడు తెలిసియో తెలియకో యాత్మబలి నిచ్చుటకే—ప్రలయమునకై కాలమహాశక్తి యంకమున వడిగాఁ బరుగెత్తుచున్నాఁడు. కావుననే కాళి కాలశక్తి. మూఁడవది. కాళీ చిత్రము. ఆమె కేవల ప్రలయంకర ఖడ్గముండధారిణి కాదు. అనఁగా నొకచేత ఖడ్గము, నొకచేత నరముండముఁ దాల్చు ప్రలయంకర మూర్తియే కాదు. తక్కు రెండు చేతులందును వరాభయ ముద్రలుఁగల స్నేహకరుణామయి—కాలాతీత సత్తయందు నిలుచుటకై—మృత్యువును జయించుటకై, అనఁగా నమృత లాభమునకై, యీ కాళికాదేవికే శరణాపన్నులగుచున్నారు. అమ్మ శ్యామాదేవి. ఒకవంకఁజూచిన బహుత్వమును బ్రలయమును జేయు కాళి; మఱియొక వంకఁజూచిన, ముక్తిదాయిని, అమృతమయి, స్నేహమయియునైన శ్యామా

దేవిగా నున్నది. ప్రళయము తరువాతి సత్తను దెలుపుటకే అమ్మ చేతిలో నరముండము వ్రేలాడుచున్నది. అమ్మ యొంటి ముండమాల. ఆ పుఱ్ఱెలు మాతృకావర్ణముల కేబదింటికిఁ బ్రతిరూపము ఈ విశ్వము కొన్ని భావముల సమష్టికంటె మఱేమియుంగాదు భావములు వర్ణసమష్టి మాత్రములే. భావము (వర్ణసమష్టి) వర్ణమును – శబ్దమును మీఱి మఱియొక విధముగా నభివ్యక్తము కాదు. అమ్మ దయఁదలఁచి సర్వభావములను విలయమొనర్పఁ బూను నపుడే మఱి వర్ణసమూహము శబ్దమయమై భావము లుబుకఁజాలవు. ఆ సమయమందలి శవము నకర్మణ్యములై పడియుండును. అపుడు వర్ణసమూహము కాలిన విత్తులవలె, మొలకెత్త శక్తిలేకుండును. ఇవే యేబది ముండముల దండగా నమ్మ కంఠమున వెలయుచున్నవి. ఈ ముండమాలా ధారణము బుద్ధిశాలురచే మఱియొక విధముగా వర్ణింపఁబడి నది. అమ్మ తనను సహస్రారమందు నిలిపి, యనుసంధానించిన సాధక భక్తుల తలపుఱ్ఱెలను విడువలేక, యవియే తన కలం కారములని దండగాఁగూర్చి ధరించినదనిరి. మఱియు నమ్మ కటిభూషణము శవహస్తమాల తనను బిల్వతులసీ పుష్ప కుంకుమాదులతోఁ బూజించిన భక్తులచేతులను దండగాఁ గూర్చి కటిభూషణముగాఁదాల్చి ప్రేమించుచున్నదనిరి. అమ్మ రెండుశవములను రెండు చెవులకుఁ గమ్మలుగాఁ జేసికొన్నది, కర్ణాభరణ రూపముగానున్న యీ (భక్త) శవములే యమ్మ పాదములందుఁ బూర్ణముగా నాత్మార్పణము చేసిన భక్తుల ప్రతిరూపములు ఈ చమత్కార కల్పనమును శ్లాఘ్యమే. అమ్మ దిగంబర. దిక్కులే వస్త్రములుగాఁ గలది. అపుడు

దిఙ్మండల మధ్యమందలి చరాచర రూప జగత్త్రితయము నామె విరాట్ఛరీరమే యని తలపించునదే యీ వర్ణనము. మూలల నుండి రక్తము కారుచు లంబమాన లలజ్జిహ్వాతోఁగూడిన, యమ్మ పంచవక్త్రము (తెఁచిన నోరు) తనచే విస్పష్టమైన సర్వజగత్తును (దానే) కబళించు ప్రలయంకర శక్తి తానే యని చెప్పుట కనిరి. అమ్మవి ముక్కన్నులు. అవి చంద్ర సూర్యాగ్నులు. ఇమ్మూఁడును గాలసూచక ప్రకాశమాన వస్తువులు. ఇవి యమ్మ యవయవ మాత్రములే యైనపుడు, అమ్మయే కాలస్వరూపిణియుఁ గాలాతీతయునని వేఱ చెప్ప నేల? ఇది తెలుపుటకే యీ వర్ణనము. ఈ త్రివిధ ప్రకాశ మాన వస్తువులు భూతవర్తమాన భవిష్యద్ జ్ఞానములను సూచించును. అమ్మ యఖండ జ్ఞానస్వరూపయే, యీ త్రివిధ జ్ఞానరూపమునఁ బ్రకాశించుచున్నదనుట యుక్తమేకదా. మఱి కొందఱు మనః ప్రాణవాక్కులు, అనఁగాఁ జంద్రసూర్యా గ్నులు — అనెడి మూఁడు రూపములతోనే యమ్మ విశిష్ట ప్రకాశమని తెలుపుటకే మనోరూపచంద్రుఁడు, ప్రాణరూప సూర్యుఁడు, వాగ్రూపవహ్నియు నమ్మ ముక్కన్నులుగా వర్ణింపఁబడినవి. త్రిణేత్రయుతముగా, నే దేవదేవీమూర్తి వర్ణింపఁబడినను సమన్వయ మిదియే. సర్వభావాతీతయైన యమ్మ పాదపీఠము నిర్మలబుద్ధి సత్త్వము. కావుననే పీఠ పూజయందు ధర్మాధర్మములు, జ్ఞానాజ్ఞానములు, వైరాగ్యా వైరాగ్యములు, ఐశ్వర్యా నైశ్వర్యములు నను యెనిమిది బుద్ధిధర్మముల పూజ విహితమైనది.

జీవుఁడు వడిగా విశుద్ధ సత్త్వమందుఁ బ్రతిష్ఠితుఁడై విశుద్ధ జ్ఞానసత్తయందు నిల్చి కడతేఱుటకై పరమాత్మ

యొక్క ప్రలయంకరిశక్తి ననుశీలించి యారాధింపవలయును. ఇంత వేగముగాఁ దప్పక జీవునిఁ గృతార్థునిజేయు సాధన మార్గము మఱియొకటి లేదు. కావుననే యెన్నివిధముల బోధించినను గడతేఱినట్లు కానరాక ప్రశ్నముపై ప్రశ్నము వేయుచుండిన శిష్యు నర్జునుని గృతార్థునిజేయుటకై తుట్టతుద యుపాయముగా గీతాగురుఁడు తన ప్రలయంకర మూర్తినే విశ్వరూపమనుపేర సందర్శింపఁజేసెను.

కార్తికామావాస్యా తిథియందే, యీ కాళీశక్తి మొట్టమొదట స్థూలమూర్తితో వెలయుట. కావున జన్మాష్టమీ పూజవలెనే యీ తిథియందు శ్యామాపూజ జరుపఁబడును. ఇదిగాక యీ తిథివిషయమునందు మఱియొక్క విశేషత్వమున్నది. ప్రలయభావము నుద్బోధించు పక్షమున నిది కడు ననుకూలించును. ఇది యపూర్వపూజలలో నొకటి. ఈ పూజను యథార్థజ్ఞానముతోఁ జేయునపుడు సాధకున కుత్తమాధ్యాత్మికాధికారము లభించును.

# శివరాత్రి

మనదేశము మాఘమాసీయ కృష్ణచతుర్దశినాఁడు, గోరెడు నీరైనను గ్రోలని నిర్జలోపవాసము చేయుచు విజ్ఞానమయ పురుషుఁడైన సర్వభూతమహేశ్వరుని శివుని బూజించు నాచారము అనాది యనుట నిర్వివాదము. ఈ శివచతుర్దశీ తిథికి సంబంధించిన శివరాత్రివ్రతకథా ప్రసంగమున వర్ణింపఁబడిన యా వ్యాధుని యుపాఖ్యానమే విశేషించి యుక్తముగా నున్నది. అది యంతయు నిట వ్రాసినచో గ్రంథకళేబరము

పెరిగిపోవును గాన మన మాధ్యాత్మిక తత్త్వమును గూర్చియే యాలోచింతము.

ఈపూజ రాత్రి నాలుగు జాములందు నాలుగుసారులు జరుపవలయును. ఇంక దీని తత్త్వము. కృష్ణచతుర్దశీ తిథి యందుం జంద్రముని పదునాలుగు కళలు లయమయి, యొక్క కళమాత్రమే మిగిలియుండును. మనస్సున కధిపతి చంద్రుడు. బాహ్యప్రకృతి యందలి చంద్రకళాలయ వికాసములను బట్టియే యాంతరప్రకృతి యందు మనోలయ వికాసములుండును. కావున నీనాడు మనస్సు ప్రలయమును సమీపించి యుండును. నిత్యసంధ్యావందనాది కర్మముల యాదిని గాల సంకీర్తనము చేయు నియమము, ప్రతిదిన మనోలయవికాసముల యనుభవము చేయుటకే యేర్పరచిరి గాని - దేవునకుం బంచాంగశ్రవణము చేయుటకుంగాని, కాల పరిచ్ఛిన్నతా స్మరణమునకుం గాని కాదు. కృష్ణపక్షమందెంత మనోలయమగుచున్నదో, శుక్లపక్షమందెంత వికాసమగుచున్నదో యనుభవమందుంచుకొనుటకే సాధకజీవులయెడ నీనియమము శాసింపంబడినది. ఈ విషయము గ్రంథమందలి 'సంకల్పము' అను శీర్షిక క్రింద విపులముగా వ్రాయంబడినది. అది యుండనిండు. "ప్రయోజన మనుద్దిశ్య న మందోఽపి ప్రవర్తతే" ప్రయోజనములేని పనులెవ్వియు ఋషిసంతానముచే మనకుపదేశింపం బడలేదు. తత్త్వము నెఱుంగం బ్రయత్నింపని లోటు మనదే.

విశుద్ధజ్ఞాన సత్తయందే మనస్సు పూర్తిగా లయించును. తఱచుగా విజ్ఞానసత్తావికాస విషయమున నీతిథియే విశేషోపయోగి. ముముక్షువులే యీ పూజ కధికారులు. శివుడు

మంగళస్వరూపుఁడు, మంగళప్రదాత. జ్ఞానోపలబ్ధి మూలముగా మోక్షలాభమునకంటె మంగళమేమున్నది? వశియే శివుఁడు; పశ్యకుఁడే కశ్యపుఁడనునట్లుగా, వ్యాకరణానుశాసనమునకైన వర్ణవ్యత్యాసముచే 'వశి' యన్నదే 'శివ' యై, యింద్రియవశీకరణ మొనర్చువాఁడను నర్థమిచ్చును. భారతదేశమందుఁ బలుతావుల నీనాఁడు శివార్చనము చేయుదురు. పూజాసాధన తత్త్వరహస్యమును వెనుకటి పరిచ్ఛేదములందుఁ జదివియే యున్నారుగదా.

అజ్ఞులనేకులు శివలింగ విషయమునఁ బలువిధములఁ గుత్సా (నిందా) పూర్ణమైన యుపాఖ్యానము చేయుచు, నసభ్యవర్ణనములను జేయుదురు. అవి యిచట వ్రాయఁదగినవి కావు. శివలింగము, గౌరీపీఠమున నెడి రెండిటిచేరికతో ఘటితమైన మూర్తియిది. శివలింగము నిల్చిన త్రికోణాకారము గల పీఠము వంటిదే గౌరీపీఠము, శక్తి పీఠము. బిందురూప శివుని శక్తి వికాసము తొల్తఁ ద్రికోణాకారముననే యైనదనుట, శ్రీ చక్రాదుల తత్త్వము ననుశీలించు శాక్తబంధువులే యెఱుఁగుదురు. ఈ రెండును గలిసియున్న మూర్తినే ప్రాణాట్ట మందురు. ఉచ్చారణ సౌష్ఠవము లేనివారు 'పానవట్టము — పానుగొట్టము' అనుచు నపభ్రంశముగాఁ బలుకుదురు. ప్రాణ=చిచ్ఛక్తి; అట్టమ్=శివుఁడు; రెండునుం జేరియున్న మూర్తియే ప్రాణాట్టము. ప్ర – ఉపసర్గమును దీసివేసి, ఆనాట్టమ్ అనియు వ్యవహరింతురు. చెప్పెడి దేమనఁగా శక్తి విశిష్టశివుఁడని యర్థము. వీరశైవులకీ మూర్తియే పూజ్యము. శక్తి విశిష్టశివుఁడే యుపాస్యుఁడు. కనుకనే వీరశైవము విశిష్టాద్వైతము. ఆనాట్టములు రెండును గ్రమముగా శక్తిని, అది వికసించిన

బ్రహ్మమును దెలుపునవియే. యంత్రములందును శివుని దెలుపునదే బిందువు; అదియే అట్టమ్ అనెడి లింగము; తద్వికసిత శక్తిని దెలుపునదే త్రికోణము, అదే గౌరీపీఠము. 'జన్మాద్యస్య యతః' అనెడి బ్రహ్మలక్షణమును దెలుపునదే యీమూర్తి. దార్శనిక తత్త్వము నాలోచింపఁగలవారే, యీ వైచిత్ర్యమయ విశ్వము దేనివలనఁ బుట్టినదో, యదే సత్త్వరజస్తమోమయి యైన యవ్యక్తప్రకృతి యని తెలియఁగలరు. మూడు గుణముల సామ్యావస్థయనెడి యీ ప్రకృతియే యీ జగత్తునకు సూక్ష్మతమ కారణము. పురుషుని (చైతన్యముయొక్క) సాన్నిధ్యవశమునఁ బ్రకృతి పరిణామశీల యగును. తత్ఫలముగా నీజగత్ప్రపంచము విరచింపఁబడును. ఈపురుషప్రకృతి సంయోగభావ మెట్టిదో యుద్బుద్ధము చేయుటకే లింగపీఠాత్మకమైన యీ శివమూర్తి వెలయుచున్నది.

జగత్కారణమును బట్టుకొన్నచో, జీవుఁడు దుఃఖమయమును బరివర్తనశీలమునైన యీ జగద్భావము పట్టునుండి తప్పుకొనఁగలఁడు. కనుకఁ బ్రకృతిపురుషుల ప్రథమ సంయోగరూపమైన సృజనోన్ముఖావస్థను యథాసంభవముగాఁ దలపించుటకే శివలింగమనెడి ప్రతీకమును అవలంబించి, జగత్కారణ సర్వభూతమహేశ్వరునిపూజ చేయఁబడుచున్నది. అచట, సృష్టికున్ముఖమైన యీ ప్రథమావస్థయందుఁ గరచరణాదులైన యెట్టి యవయవములును లేవు. ఉండఁజాలవు. కావుననే త్రిగుణాత్మకప్రకృతికిఁ బ్రతీకముగాఁ ద్రికోణాత్మక గౌరీపీఠమును, దానిపైని బురుషుని సాన్నిధ్యమును దలపించుటకే లింగమూర్తియుఁ బ్రతిష్ఠింపఁబడును.

ప్రకృతి పురుషుల ప్రథమ సంయోగమువల్లనే మహత్తత్త్వము (బుద్ధితత్త్వము) అభివ్యక్తమగును. గీతయందు భగవంతుని మాట:—

"మమ యోనిర్మహద్ బ్రహ్మ తస్మిన్గర్భం దధామ్యహమ్।
సంభవః సర్వభూతానాం తతో భవతి భారత!"

"ఓయి, భారత! (భాయాం రతః భారతః – పరమాత్మ తేజస్సును=శక్తిని, ఉపాసించు నాసక్తి కలవాడా!) (మహద్బ్రహ్మము – మహదాత్మ, మహత్తత్త్వము) నా యోని – గర్భస్థానము. దానియందు నేను గర్భాధానము చేయుదును; అనగా జగత్ప్రకాశమునకుఁ గారణమైన చిత్ప్రతిబింబము నుంతును. దానివలననే సర్వభూతసృష్టియు నగును."

శివుని యీ లింగమూర్తియందు ఎట్టి స్థూలావయవ స్థూలభావముల సంస్పర్శ మించుకంతయు లేదనుట ధీమంతులకుఁ దెలుపనక్కఱలేదు. మొత్తమున జెప్పెడి దేమనగా, చిత్ప్రతిబింబముతోఁగూడిన మహత్తత్త్వము నెటులో తెలుపుటకే లింగమూర్తి నవలంబించి శివపూజావిధాన మేర్పడినది. శివలింగము చిదాభాససమన్వితమైన మహత్తత్త్వము యొక్క స్థూలప్రతీకమే. ఇదే విశ్వముయొక్క ఆద్యవస్థ; ఇదే విశ్వమునకు బీజము. ఈ స్వరూపము నెఱుంగగలిగినపుడే, సంసారభయము తొలఁగిపోవును. కనుకనే శివధ్యాన మంత్రమందు "విశ్వాద్యం విశ్వబీజం నిఖిలభయహరమ్ లింగరూపం నమామి" యని వర్ణింపఁబడినది.

లింగమనఁగా – చిహ్నము (గుఱుతు). ఏ చిహ్నము వలన జగత్కారణ ప్రకృతి పురుష విషయకమైన జ్ఞానము

కలుగునో యదె శివలింగము. లింగమనఁగా లయస్థానము. ఈ జగత్ప్రపంచమనెడి కార్యము మఱల నే యవ్యక్త కారణ మందు లయ మొందునో యదే లింగము. "లీయతే గమ్యతే యత్ర జగదితిలింగమ్."

ఈ లింగమూర్తి నవలంబించియే పంచవక్త్ర, త్రినేత్ర, వ్యాఘ్రచర్మపరిహిత, రజతగిరినిభ మున్నగు నామములతో ధ్యానము చేయఁబడుచున్నది. అయినను, దానివలన హాని లేదు సరిగదా- స్వరూపజ్ఞానవిషయమున నిట్టిధ్యాన మెంతో యుపకారి. మఱొకమాట — లింగమూర్తి నవలంబించి మహాత్తత్త్వము ననుస్మరించువేళ, ఆ తత్త్వ మాకాశము వలె, నొక జడపదార్థముగాఁ బ్రతీతి గోచరము కాకుండుటకై యీ పంచవక్త్ర త్రినేత్రాది విభిన్నావయవముల వర్ణన మావశ్యకము. అది యొక తత్త్వమాత్రము కాదు. దానికి వ్యక్తిత్వమున్నది. అది నిగ్రహానుగ్రహసమర్థ జగద్గురుఁడు; అదే విజ్ఞానమయ పురుషుడు; అనెడి మాటను జక్కఁగా సులభముగా మనసునఁ బట్టించుటకే శాస్త్రమం దీ విధమైన యవయవ విశిష్టధ్యానవిధానము చెప్పఁబడినది. దాని పారమ్య మహిమాదుల ననుసంధానించుకొనుటకై యింతకంటె మంచి యుపాయము మఱిలేదు.

అయిదువిధములుగా జ్ఞానము ప్రకాశించును. చక్షుః కర్ణాదులైన పంచజ్ఞానేంద్రియముల దారిని జ్ఞాన మైదు విధముల వెలయుటను నిత్యము మన మనుభవించుచున్నాము. ఇవే విజ్ఞానమయ పురుషుని పంచముఖములు. పంచవక్త్రుఁడు- అనఁగా విరివిగాఁ దెఱచిన నోరు గలవాఁడు. వామదేవుఁడై జగద్సృజనము (సృష్టి) చేయునపుడు పంచవక్త్రుఁడు. మఱి

దానిని దనలో నిముడ్చుకొనునపుడును బంచవక్త్రుఁడే కావల యును. అనఁగా జగత్సృష్టివిలయములనొనర్చువాఁడు శివుఁడే యనుట.

త్రినేత్ర శబ్దము త్రికాలదర్శిత్వ సూచకము. భూత భవిష్యద్వర్తమానము లనెడి కాలత్రయము నొక్కసారిగా విజ్ఞానమునకు నేత్రములుగా నుద్భాసింపఁజేయువాఁ డనుట. కావున మహేశ్వరుఁడు త్రినేత్రుఁడు. మఱియుఁ గాలసూచకు లగు సూర్యచంద్రాగ్నులు శివుని నేత్రరూపావయవములుగాఁ జెప్పఁబడుట యాతఁడు కాలస్వరూపుఁడును, గాలాతీతుఁడు నని బోధించుటకే.

వ్యాఘ్రచర్మాంబరధారి యనుట యీ విజ్ఞానమయ పురుషుని యంగమందే విచిత్రములైన యనాది వాసనాబీజ ములు సంచితములని తాత్పర్యము. పసుపు, నలుపు, ఎఱుపు, తెలుపు రంగులతో విచిత్రమైన యీపులితోలు అనాది వాసనారాశియొక్క వైచిత్ర్యమునుఁ దెలుపును.

శుద్ధ సత్వగుణము చేతనే యీ జ్ఞానమయ పురుషుని యనుసంధానము సాధ్యము. విక్షేపావరణము లనెడి యెట్టి మాలిన్యము లచట లేవు. కనుకనే శుద్ధ స్ఫటికాభుఁడుగా వర్ణింపఁబడెను. సర్వజీవులకును జ్ఞానదాతయైన గురుఁడు కృపాపరవశుఁడై యాత్మస్వరూపప్రకాశము చేయునపుడే జీవుఁడు యథార్థ సద్గురులాభముచే ధన్యుఁడగును. ఇట్టి యీ శివమూర్తి విశేషణములవలన నెన్నియో రహస్యముల నెఱుంగఁగలము.

ఇపుడు మనము ధ్యానమంత్రమందు వర్ణింపఁబడిన 'చారుచంద్రావతంస, రత్నాకల్పోజ్జ్వలాంగ' యను మాటల

తాత్పర్యము నెఱుంగఁ బ్రయత్నింతము. శివునికిఁ దలపూవుగా మనోహరమైన చంద్రకళ శోభించుననిరి. చంద్రమునివి పదునారు కళలని యెల్లరును విన్నవే. అందుఁ బదునేను కళలు ప్రతిపదాది పూర్ణిమాంత కళలుగా వెలయుచున్నవి. తక్కునొక్క కళ పదునారవది శివుని శిరోభూషణముగా శోభిల్లుననిరి. ఇక్కళకు 'అమాకళ' యని పేరిడిరి. తక్కిన పదునేను కళలును సూత్రమందు మణులవలె నీయమాకళయందు ననుస్యూతములై యున్నవి. దీనికే మఱియొక పేరు మాయా— 'మాతృత్వం యాతీతి మాయా' తల్లితనమును బొందినది కాగా మాయా. దీనినుండియే ప్రతిపదాదులైన పదునేను నిత్యాకళ లేర్పడినవి. కనుక నిది మాయా. మాయా, మహావైసర్గికీ యను పేర నొప్పును. అన్నిటినివిసర్జించునది, సృష్టించునది యని యర్థము. పరివర్తనము లేక సదా యుండునది. కనుక 'సాదా' యని మఱియొక పేరు. దీనికే శక్తియనియు పేరు. అఘటన ఘటన పటీయసియైన మహాశక్తిస్వరూపిణి మహామాయ. ఏ శక్తిప్రభావముచే విశుద్ధబోధస్వరూపుఁడు మహేశ్వరుఁడు బహురూపములతో నీ విశ్వరూపముతోఁ బ్రకాశింప శాధ్యుఁడయ్యెనో యా శక్తియే శివుని శిరోభూషణమై యమాకళారూపముతో నున్నది. యథార్థ మేమనఁగా గౌరీపీఠ రూపమునఁ బ్రకృతి రూపమున (ప్రకృష్టములైన సృష్టి స్థితి లయ తిరోధానానుగ్రహము లనెడి కృతులు గలది గాన ప్రకృతి) లింగమూర్తి శివునితో నవినాభావసంబంధముగల యదియే పంచవక్త్రుఁడును, త్రినేత్రుఁడునైన శివుని లలాటమందవతంసముగా నిల్చియున్నది.

లింగమూర్తికి మారుగా నిట్టి పంచవక్త్రుం, త్రినేత్రుం డను మున్నగు నామములతో యథోక్త ధ్యానానురూప శుభ్రశివమూర్తి నవలంబించి పూజలు చేయునపుడు ఎట్టి దోషారోపమునుం జేయనక్కఱ లేదు.

శివుని వాహనము వృషభము. ఎద్దు. వృషమనగా ధర్మమని యర్థము. ధర్మమే మహేశ్వరుని వాహనము. ధృతి, క్షమ, దమము, అస్తేయము, శౌచము, ఇంద్రియ నిగ్రహము, ధీ, విద్య, సత్యము, అక్రోధము—అనెడి పది ధర్మలక్షణములతోం గూడిన జీవుండే (ధార్మికవ్యక్తియే) మహేశ్వరుని స్వరూపము నవధరింప సమర్థుండు. అట్టి వ్యక్తికే మహేశ్వరుండు తన స్వరూపజ్ఞానము కలిగించి యాతని నాదరించును. కావున నట్టి జీవుండే శివునివాహనమని వర్ణించిన తాత్పర్యము.

శివపూజయందు శివుని యష్టమూర్తి పూజావిధాన మున్నది. పృథివి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము, సూర్యుండు, చంద్రుండు, యజమానుండు (ఆత్మ) అను నెనిమిదియు శివుని యష్టమూర్తులు. అనంగా భూతపంచకము, ప్రాణమనస్సులు (ప్రాణము సూర్యుండు, మనస్సు చంద్రుండు), జీవుండు అను నీవిధమున విజ్ఞానమయపురుషుండు, మహాదేవుండు ఆత్మప్రకాశము చేసికొనెను. "సర్వాయ క్షితిమూర్తయే నమః" యనుచు శివుని బూజించువేళం బూజకుండు విజ్ఞానమయ పురుషుండు మహాదేవుండే యీ సర్వరూపములతో నంతటను వ్యాపించి నిండియున్నాండని ధరింపంగలండు. సులభముగాం జెప్పంగల్గినచో, క్షితితత్త్వాత్మక బోధముయొక్క సర్వవ్యాపక భావమును లక్షించి, యనుభవించి, తెలిసి పుష్పం

జలి నర్పింపఁగల్గినపుడే సర్వరూపశక్తిమూర్తియైన శివునిపూజ సార్థకము. ఇటులే 'భవాయ జలమూర్తయే నమః' యను మ బోధస్వరూపుని జలతత్త్వాత్మక సర్వవ్యాపిత్వము నెఱింగికొని పుష్పాంజలిని మనఃపుష్పముతోఁ గూర్చి యిడఁగల్గునపుడే భవస్వరూపజలమూర్తియైన శివుని సార్థకపూజయైనటు లెన్నఁ దగును. తక్కినమూర్తుల సంబంధమందు నిటులే యెఱుఁగునది. పరమేశ్వరుని విశ్వరూపిత్వము నెఱింగి యుపాసించుట సాయుజ్య ముక్తి సాధనమని యాచార్యులు ప్రవచించిరి.

సాలోక్యం శివ పూజనే, శివమహాదేవేతి సంకీర్తనే।
సామీప్యం శివభక్తిధుర్యజనతా సాంగత్య సంభాషణే।
సారూప్యంచ చరాచరాత్మక తనుధ్యానే భవానీపతేః।
సాయుజ్యం మమ చిత్రమత్ర భవతి స్వామిన్ కృతార్థోస్మ్యహమ్॥

ఆవాహనాద్యుపచారములతోఁ బరమేశ్వరునిఁ బూజించు భక్తుఁడు అతని కృపాలోకమందుండును శివమహా దేవాది నామముల పరమార్థము నెఱింగి కీర్తించు భక్తుఁడు శివతత్త్వసాధనమందుఁ బ్రవేశింప నర్హత గడించును. అదే శివసామీప్యముక్తి. శివభక్తినిరతులైనవారితోఁగూడి నిరతము శివతత్త్వవిచారసంభాషణములు చేయు భక్తుఁడు పరమేశ్వర స్వరూపమైన జ్ఞానానందముల యాభాసము నొందును. ఆ యవస్థావిశేషమే సారూప్య ముక్తి. ఇఁక నాలవముక్తి 'శివోఽహ'మ్మనెడి మహావాక్యార్థ బోధము ననుభవమనెడి యుత్తమావస్థయే సాయుజ్యముక్తి. అది పరమశివుని యష్టమూర్తిత్వజ్ఞానము గలిగి 'ఈశావాస్యమిదం సర్వమ్' అనెడి శ్రుత్యర్థమున ననుభవించు భక్తునకే కలుగుననిరి కావున శివుని యష్టమూర్తిత్వజ్ఞానము పరమపురుషార్థదాయకము

శివుఁడు జగద్గురుఁడు; ఆశుతోషి; ఇంతలో సంతో షించును. ఆతని పూజకై విశేషాడంబరము లేదు. అతి సామాన్యమైన మృత్తికతోనే సులభముగా నెట్టివారును లింగ మూర్తిని నిర్మింపఁగలరు. అనాయాసముగా సంపాదింపఁగల జలము, బిల్వదళములు నాతనిపూజయందుఁ బ్రధానోపాదేయ ములు. అప్రయత్నలభ్యమైన గానవాద్యములతోనే శివుఁడు పరమ సంతుష్టుఁడగును అట్టి ... సులభసాధ్య పూజాఫల ముగా నతిదుర్లభమైన ముక్తి లభించును.

ఈ శివపూజవలన నాధ్యాత్మికలాభ మటుండ, ఆధి భౌతికజగత్తునందు సైతము విశేషఫలము గలదు. సౌరమాన మును బట్టి వసంతర్తు ప్రారంభవేళ యిది. కనుక జీవజంతు వులు తరులతాదులు నన్నియు నత్యధికరస సమన్వితములై యుండును గానఁ బూర్వదినమందుఁ జేసిన సంయమమును మఱునాటిపారణముతో, శివరాత్రినాఁటి నిర్జలోపవాసపూర్వ కముగా రాత్రిజాగరణమును, యథాశక్తి శివపూజయు జరు గును. రాఁబోవు నాదానకాలవశమున జంతుశరీరమందలి రసధాతువు క్షీణింపఁజొచ్చును. ఈ వ్రతము ఫలముగాఁ బర మేశ్వర కృపచే వసంతరోగములు గలుగునను భయము తొలఁగును. ఇందన్యథా వాద మేదను వినఁబడదు.

అన్నిటికంటెను ముఖ్యముగా ధరింపఁదగిన సత్యవిష యము — బాహ్యప్రకృతి పరివర్తనముతోనే మన యంతః ప్రకృతి పరివర్తనము సైతము వ్యక్తిభేదమునుబట్టి యింతయో యంతయో యగుచుండును. కొంత యనుభవముండి యను సంధానించువారలకే యీ పరివర్తన లక్షణము తెలియఁ బడును అమావాస్యా పూర్ణిమలందును వాని సమీప తిథు

లందును, అంతఃప్రకృతియందింతో యంతో పరివర్తనమును బుద్ధిశాలురు గుర్తించుచునే యుందురు. తత్త్వములవైపు చూచుచుఁ బోయినను, గ్రీష్మకాలమందుఁ దేజస్తత్త్వము యొక్కయు, వర్షాకాలమున జలతత్త్వము యొక్కయు, శరత్కాలమున క్షితితత్త్వము యొక్కయు, శిశిరమునందు మహాతత్త్వముయొక్కయుఁ బ్రభావము వృద్ధినొందుచుండు నని చక్కఁగా దెలియును. శివరాత్రి వచ్చు శిశిరము మహాతత్త్వవిశిష్టము.

ఏ మాసమున; ఏ పక్షమున, ఏ తిథియందు, ఎట్టివేళ వెలిని లోనఁ బ్రకృతియందు స్వాభావికములైన యెట్టి పరివర్తనములు గలుగునో, దానియందు విశేషలక్ష్యముంచియే పూజ్యపాదులైన మన ఋషులు పూజాది వైధకార్యముల విధానముల నుపదేశించిరనుటను బూర్తిగా విశ్వసించినం జాలును. జీవనయాత్రయందగ్రసరులై సుఖించును. మనః ప్రాణముల స్వాభావిక పరివర్తనముయొక్క యనుకూలతను గుర్తించి నడచుచున్నచోఁ మన యాధ్యాత్మిక మార్గమం దగ్రగతి సంపన్నమగును. దాని విశేషవిచారము చేసియే యార్యులు విధి నిషేధాదులను బ్రవర్తింపఁజేసిరి. ఒక సాధారణ దృష్టాంతమందు లక్ష్యముంచినచో దీని సత్యత బోధపడఁగలదు. మన దేశమున వైశాఖమాసమందు జల దానము, చందనయాత్ర, పుష్పడోలికా నియమసేవ, శివ నారాయణ విగ్రహముల జలధారా స్థాపనము, అశ్వత్థతులసీ వృక్షములకు జలదానము మున్నగున వెన్నో జరుపుదురు. ప్రాణదేవత లానసమయమందు సూర్యతేజస్తాప సంతప్తులగుదురు. దీనిని జక్కఁగా ననుభవించియే సర్వవిధముల స్నిగ్ధోప

చారములతోఁ బ్రాణదేవతాప్యాయన పూజాదులను విధిగాఁ జేయుదురు. ఇటులే విధ్యుక్తకర్మములం దన్నిఁటను బాహ్య ప్రకృతిని లక్షించియే వానిని బ్రవర్తింపఁ జేసిరి.

మన స్థూలశరీర స్వాస్థ్యము దేనిచేత సురక్షితమగునో, మన మనోమయ శరీరము దేనివలన ననుకూలాహారము నొంది పరిపుష్టమగునో, మన ప్రాణమయ శరీరము దేని సత్వగుణాత్మక శక్తిచే సంజీవితమగునో, మన విజ్ఞానమయ శరీరము ఏ పూజాది వైధకర్మములచే విశుద్ధజ్ఞాన మనెడి యాహారమును గొనఁగల్గునో, మన యానందమయ శరీరము ఏ సాత్వికానందముతో నెల్లప్పుడు నుత్ఫుల్లమగునో యివి యన్నియు బాగుగా లక్షించియే మనదేశమందు ఏడాది పొడుగున విధివిశేష పూజాదులు నడుచుచున్నవి. ఇంచుకంత ధీరచిత్తముతో గుర్తించినపుడు ఏ మాసమందు, ఏ పక్ష మందు, ఏ తిథియందు, ఎట్టివేళఁ బూజాదులను జేయుటచే, మన మనఃప్రాణములు స్వస్థములును బలసంపన్నములునై యుండునో, మన జడత్వాభిమానము పూర్తిగా సడలిపోవునో, అజ్ఞానము పూర్తిగా క్షీణించునో, ఆయాయి మాస పక్ష తిథ్యాదులం దట్టి పూజలనే పూర్వులు ప్రవర్తిల్లఁ జేసిరి. వేయేల? ప్రత్యేక విషయమును సూక్ష్మాతి సూక్ష్మముగా విమర్శించి సత్యద్రష్టలైన మహర్షులు ప్రవర్తిల్లఁ జేసిన విధాన ములకుఁ దలయొగ్గి తదనుసారముగాఁ గర్మముల నాచరింపఁ బూనినపుడు వాని ప్రత్యక్షఫల మెల్లరకుఁ గలుగును. మన దేశమందు జరుపఁబడు పూజాది వైధకర్మములు, భ్రమప్రమాద దూషితములైన యల్పజ్ఞమస్తిష్కముల నుండి పుట్టిన ఫల ములు కావు. అవి సర్వజ్ఞులును, సత్యదర్శులు నైన యార్య

షులు జగత్కల్యాణమునకై చేసిన విధానములు. శాస్త్రీయ విధినిషేధములు ప్రత్యక్ష వైజ్ఞానిక యుక్తిసిద్ధములై సత్యమందే ప్రవర్తితములును, సత్యమందే ప్రతిష్ఠితములు నైనవి.

పూజాసంకల్పము, కాలము — అను శీర్షిక క్రింద కొన్ని మాటలు పాఠకుల కిచట మఱల దలిపింపక తప్పదు. పరమేశ్వరుఁడొక్కడే. అతనిని వేర్వేఱు సమయములందు వేర్వేఱు రూపములతోఁ గాంచుచున్నాము. కారణ మేమనఁగా, బరివర్తన ప్రియత్వమే (మార్పునందలి యిష్టమే) జీవన ప్రధాన లక్షణము. మనము జీవులము. తెలిసియో తెలియకో సదా మార్పునే కోరుచుందుము. దానిచే మన యాంతర బాహ్య ప్రకృతి సదా పరివర్తిత మగును, గాన మన ప్రియతమప్రాణదేవత సదా యేకరూపుఁడేయయ్యును, మనప్రీతికై యాతఁడు వేర్వేఱు సమయములందు వేర్వేఱు భావములతో నాత్మప్రకాశము సేయుచుండును. దీనిచే లోపలనేకానీ వెలుపలనేకానీ యొకవిధమైన పరివర్తన మగునపుడే యొకవిధమైన పూజాదివిధి ప్రవర్తిల్లునని కనుగొందుము.

తిథులలో నుభయ పక్షములందలి యష్టమినాడును, తత్సమీప తిథులందును విశేష పరివర్తనము సూచితమగును. పూర్ణిమామావాస్యలందును తత్సమీప తిథులందును విశేష పరివర్తనముల పరిసమాప్తి యగును, గనుకనే యధికాంశ పూజలు ఈ తిథులయందే విహితములైయున్నవి. పరమేశ్వరుని యైశ్వర్యమయత్వము, ఆనందమయత్వము మున్నగు సగుణ భావోపలబ్ధికై విహితములైన పూజాదులలో నధిక భాగము శుక్లపక్షమందుఁ బగటివేళను, బూర్ణిమాష్టముల యందును, తత్సమీప తిథులందును జేయంబడును. ఇఁక

నిర్గుణస్వరూపము వంక నగ్రగతి కుపాయములైన పూజాదులలో నధిక భాగము కృష్ణపక్షమునం దమావాస్యాష్టములయందును, దత్సమీప తిథులందును రాత్రివేళఁ జేయఁబడును. ఈ సమయమునందు మనస్సు స్వాభావిక నియమవశమున క్షీణత నొందును. చంద్రముని క్షీణతతోనే మనస్సు క్షీణించుట తప్పదు. దానిచేతనే విషయలాలస క్షీణించును. ఇంకఁ బగటి భాగమునుబట్టి చూడ రాత్రిభాగమునం దింద్రియములు సహజముగానే యంతర్ముఖము లగును, గనుకఁ బైని జెప్పిన కాలము నిర్గుణోపలబ్ధి విషయమున విశేష సహకారి యగునని చెప్పఁ బనిలేదు.

ఇపుడీ శివరాత్రి పూజావిషయము నిర్గుణసత్తోపలబ్ధికి సంబంధించినదే. సాధకజీవుని మనస్సు శివరాత్రి సమీపించుచున్నకొలఁది శివునివైపు అజ్ఞేయముగాఁ బరుగెత్తుచుండును. ప్రకృతి నియమవశమునఁ జతుర్దశి నాఁటికిఁ బదునాలుగు కళలు క్షీణించి యుంటచే జాగతిక విషయలాలస క్షీణించి యుండును. ఋతుధర్మమును బట్టి యాకాశతత్త్వ విశిష్టతచే నిర్మలము నగును. అట్టివేళ మాఘమాసీయ చతుర్దశినాఁడు (శివరాత్రి) పగలంతయు నుపవసించి, పార్థివాది లింగరూప శివునిఁ బూజించి, ప్రదోషకాలాదిగా భావలింగార్చనమునకుఁ గడంగు సాధకునకు సగము రాత్రి యగుసరికిఁ బరమేశ్వరుని నిర్గుణోపలబ్ధి భాగ్యమబ్బి, హృదయమందుఁ దాదాత్మ్యము కలకొనును. అదియే లింగోద్భవము. ఆ కాలమునే లింగోద్భవ కాలమందురు. పరమాత్మతో జీవునకుఁ దాదాత్మ్యసిద్ధి యగుటకంటె శివము (మంగళము) మఱి యొండు లేదు. కనుకను నిది శివరాత్రి.

అనేకులు 'నేడు శివరాత్రి' యనుచు నిత్యాభ్యస్తములైన యాహారవస్తువులను విడిచి, రాఁబోవు శివరాత్రి పర్వదినమున నెట్టియాహారములతోఁ దృప్తినొందుటో-యది యూహించి, చిరాభీష్ట పదార్థాంతరములతోఁ బలుసారులు పొట్టనింపుకొనుచు, జాగతిక కార్యములనే చేయుచు, నెటులో తెలపిచేసికొని యొకసారి శివమందిరమున నొక టెంకాయతోఁ బోయి, యది నంబి కందిచ్చి, మఱల నాతఁడిచ్చిన నిర్మాల్యముతోఁ బరుగున నిల్లుసేరి, తరువాయి పనులను జక్కఁబెట్టుకొని, యింటికి మఱలు త్రోవనే క్రొత్త చీట్లపేకదస్తా కొని తెచ్చికొని, యభీష్టవస్తువుల నారగించి చీట్లాట వినోదముతోనే జాగరము చేయుదురు.

ఉపవాస జాగరణ తత్త్వమేమనఁగా — యథార్థ సాధకుఁడు శివరాత్రినాఁడు నిరంతర శివసాన్నిధ్యము కల్పించికొని, కొంతసేపు శివమంత్ర జపముతోను, గొంతసేపు శివపూజాభిషేకములతోను, శివపురాణ పఠనాదులతోను, శివనామ సంకీర్తనముతోను గడపునపు డాతనికి స్థూలశరీర పోషకములగు వస్తువులను గొను నిచ్ఛయే లేకయుండియు, నియతవేళ కించుకంత యాఁకలియైనను, ఆహారమును గొన్నచోఁ దృప్తములైన యింద్రియములకు మనస్సు లొంగిపోయి నిష్ఠాభంగ మగునని మానియు నాదినము నెట్టుటచే నతని యుపవాసము సార్థకమయ్యెడిది. ఇఁకఁ బ్రదోషకాలాదిగా భావలింగార్చనమందే నిమగ్నుఁడై, జ్ఞానస్వరూప శివునితోఁ దాదాత్మ్యానందము గంటగంటకు బలపడుచుండుటచే సత్త్వగుణవికాసము ప్రబలమై, తమోరూప నిద్రావస్థకుఁ బాలుగాక జ్ఞానవిరోధియైన నిద్రను గెలిచి జడనిద్ర లేని

యాయాసము నొందక, శివరాత్రి నిట్టి జాగరణముతోఁ బుచ్చి, శివకటణకుఁ బాత్రుఁడై, లింగోద్భవభాగ్యమబ్బి, యానందమయుఁడై తరించును.

కావునఁ బాఠకులు శివరాత్రినామక మహాపర్వ దివారాత్రముల నెట్లు నెట్టవలయునో యెఱింగి నెట్టి, గట్టు సేరుదురు గాక. ఇతి శివమ్.

## రథయాత్ర

"రథస్థం వామనందృష్ట్వా పునర్జన్మ న విద్యతే" రథమందున్న మాధవుని గనుటచే మోక్షమబ్బునని శాస్త్రములన్నవి. రథమే దేహమునకుఁ బ్రతిరూపము. ఉపనిషత్తునందు దేహమునకే రథరూపకల్పనము చేయఁబడినది. వామన శబ్దార్థము పరమాత్మ. ఉపనిషత్తు వామనశబ్దముచేఁ బరమాత్మనే లక్షించినది. ఎల్లప్పుడును దేహరథమందు వామనరూప పరమాత్మను దర్శించువారి మాట స్వాతంత్రము. అట్టి సౌభాగ్యము నొందనివారు ఏడాది కొకసారియైనను నీటులు దర్శింపఁ బ్రయత్నింపవలయును. ఆషాఢ శుద్ధ ద్వితీయ దానికి నిర్దిష్ట దినము. జలతత్త్వము తొలుత నభివ్యక్తమగు కాలము. అనఁగా బాహ్యప్రకృతియందు మెల్లమెల్లగా జలతత్త్వము తలసూపి క్రమముగా విశేషప్రకట మగునప్పుడు ఒక్కసారి యాత్మచైతన్యసంధానము నొందుటావశ్యకము. మనః శక్తి సంపూర్ణముగాఁ బరిక్షీణమైపోవు నమావాస్యాతిథి దాటిపోయినది. అప్పుడును మనఃక్షీణత విశేషించి కానవచ్చును గావున నీసమయమందు ఆషాఢశుక్ల ద్వితీయాతిథియందు ఒక్కరి చైతన్యసంధానము నొందుట యెల్లరకువాంఛనీయము.

వామన పరమాత్మ సచ్చిదానందస్వరూపుఁడు. అతఁడే సముద్రతటమున శ్రీ జగన్నాథుఁడనుపేర నొక విచిత్రవిగ్రహరూపమున విరాజిల్లుచున్నాఁడు. సత్ స్వరూపుఁడు జగన్నాథుఁడును, చిత్ స్వరూప సుభద్రాదేవియు, ఆనందస్వరూపుఁడు బలరామమూర్తియు మాయాజలధితీరమున నున్నారు. జ్ఞానముయొక్క సప్తభూమికల నారోహింపఁజాలనిచో, నీ సచ్చిదానందస్వరూపలాభము కాదు. కావున నమ్మాట దెలుపుటకే మందిరముయొక్క సప్తమద్వారమునందే యీ మూర్తి విరాజిల్లుచున్నది. ఈ మూఁడు మూర్తులును విస్ఫుటములు కాని యంగప్రత్యంగములతోనే వెలయుచున్నవి. ఇవి సర్వేంద్రియ వివర్జితములయినను సర్వేంద్రియధర్మములు గలవాఁడు జగన్నాథుఁడు. ఈవిగ్రహమునకు నేత్ర కర్ణ నాసికా హస్త పాదాదులైన యవయవముల యాభాసము మాత్రమే కలదు. ఈ సర్వాంగ ప్రత్యంగములు నుండవలసినట్లు లేవు. ఈ మూర్తి యపూర్వము. "అపాణిపాదో జవనో గృహీతా పశ్యత్యచక్షు స్స శృణోత్యకర్ణః" ఇటులు ఉపనిషత్ ప్రతిపాద్యమై, మాటలకును మనసునకు నందని స్వరూపమును స్థూలరూపముతో నింద్రియగ్రాహ్యరూపమునఁ బరికల్పింపవలయుననిన, నీజగన్నాథుని మూర్తిని మించిన మఱియొక్క విధమున సంభవము కాఁజాలదు. ఔరా! ఈ యపూర్వమూర్తికల్పనము చేసిన మహాపురుషులు సర్వలోకవంద్యులు. వామనుఁడై, అంగుష్ఠమాత్ర పురుషరూపముతో అనగా సూక్ష్మరూపముతో సమస్తజీవులలోను నిత్యము నిల్చియున్న పరమాత్మ చక్షుః శ్రోత్రాదులును హస్తపాదాదులును లేనియట్టి యంగ ప్రత్యంగములు లేనివాఁడయినను, దర్శన శ్రవణా

దులును గ్రహణగమనాదులునైన సర్వేంద్రియ ధర్మములును గలవాఁడై యీ దేహమనెడి రథమందు నిత్యమునున్నాఁడు. అట్టి యాతని స్వరూపము నెఱుంగఁగల్గెనేని జీవుని జనన మరణ యాతన పూర్తిగా లోపించి పోవును. కావుననే "రథస్థం వామనం (మాధవం) దృష్ట్వా పునర్జన్మ న విద్యతే" యనిరి. దేహాత్మ బోధమును దొలఁగించికొని చిదాత్మ బోధమునందుఁ బ్రతిష్ఠితు లగుటకై, యీ ప్రకారముగా రథస్థ వామనుని దర్శించుటయే ముఖ్య ప్రయోజనీయము. సంసార తాపములచే సుడికిపోయి, మాటి మాటికగు పుట్టు సావుల పట్టునుండి తప్పుకొన యథార్థముగా నభిలషించు వారి విషయమున నీ రథయాత్రాదర్శనమును, జగన్నాథుని పూజయు మాటిమాటికి ననుశీలించుట యుచితముకాదా!

ఇటు లనుశీలించి నిరంతరము దేహరథస్థ వామనుని గాంచుచుండు నున్నతాత్ములగు జీవులకు జాతిభేద జ్ఞానముండ దని తెలుపుటకే, యీ దివ్యక్షేత్రమందలి మహాప్రసాదము నే జాతివాఁడిచ్చినను నింద్యముగాక, భక్తితో స్వీకరింపఁబడు నాచారము సనాతనముగాఁ బ్రచలితమగుచున్నది. ఈ క్షేత్ర మునకు సంబంధించిన మహిమము లెన్నియో, యీ యవి శ్వాసి జ్ఞానహీన యుగమందు సైతము కానవచ్చుచున్నవి. అవి వ్రాయఁబూనినచోఁ బుస్తకశరీరము పెఱిగిపోవును.

ఆషాఢ శుక్ల ద్వితీయాతిథియందే యీ జగన్నాథ మూర్తి యావిర్భవించెను, గాన నెల్లరకు నీ విశిష్టతిథియందు రథయాత్రా దర్శనమును, శ్రీ జగన్నాథుని బూజించుటయు శాస్త్రవిహితమైనవి. విశేషమేమనఁగా—పరమాత్మసాక్షాత్కార

విషయమున ననుకూలించు మహిమ మీతిథికిఁగలదు. కావున మనము నిత్యమును "జగన్నాథస్వామీ నయనపథగామీ భవతు మే" యని ప్రార్థింతము.

## ఉపసంహారము

పూజాసంబంధమున ననేకవిషయముల నాలోచించితిమి. విసర్జనవిషయమున దుర్గాపూజా పరిచ్ఛేదమందు యథాసంభవముగాఁ జెప్పితిని, గనుక మఱి దాని యక్కఱ లేదు. గ్రంథకళేబరము పెఱిగిపోవునని సంకోచించి విడువఁబడిన విషయములు ధీమంతులైన పాఠకులకు సుఖబోధ్యములే యగును.

మా యాశ యేమనఁగా పూజ్యపాదులైన గురు పురోహితులును, గర్మకాండానుష్ఠానమున కధినాయకులైన బ్రాహ్మణులును ప్రాణహీనానుష్ఠానమైన కర్మకాండాభినయమునుండి విరమించి, సజీవ ప్రాణమయ కర్మయజ్ఞములనే చేసి చేయింతురు గాక. మఱియు జ్ఞాన భక్తి కర్మముల సమన్వయముతో నిండిన పూజాదులను జేసి, వారే మఱల నీ భారతదేశమందు సత్యధర్మ సనాతనధర్మ వైజయంతిని లేవనెత్తుటకై ప్రాణము లొడ్డి పనిచేయుదురుగాక. వారీ మాటలను దీవ్రధ్యానమందుంచుకొందురుగాక.

విధ్యుక్తకర్మము లెట్టివైన నవి పూర్తిగా జ్ఞానమందుఁ బ్రతిష్ఠింపఁబడవేసి, శాస్త్రవిహితము లేవైన నవి యాశానురూపఫలముల నిస్సంశయముగ నీఁజాలవు. నానాఁటికి శాస్త్రీయ కర్మకాండమందు లోకులు శ్రద్ధలేనివారగుచున్నారు. దానికి

గురుపురోహితగణమే కారణము. ఏభావముతోఁ గర్మకాండము నాచరించుటచే శిష్య యజమానులకు దానియెడ శ్రద్ధ తొలఁగదో యాభావముతో ననుష్ఠింపఁబడలేదు. కావుననే యీ యశ్రద్ధ, యీ యవిశ్వాసము వచ్చిపడినవి. కావునఁ గర్మకాండము నెడ నైన శ్రద్ధాహీనతకు శిష్య యజమానులు గాక – గురుపురోహితులే కారణమనుటకు వెనుదీయకున్నాము.

మఱియొకమాట – సంధ్యావందన పూజా హోమాదులు చేయు, చేయించు గురుపురోహితులో, యెట్టి బ్రాహ్మణులో తమ వ్యావహారిక జీవనమందు మును జెప్పిన ధృతి క్షమా దయాస్తేయాది ధర్మలక్షణములకు దూరులైనపుడే సాధారణలోకులకు అనఁగా వారి నాశ్రయించి కర్మకాండమును నెఱవేర్చుకొను లోకులకు, దానియెడ శ్రద్ధావిశ్వాసములు తొలఁగిపోవును. కావున భూదేవతాగణ చరణములకు సాష్టాంగప్రణతు లాచరించి, యట్టి లోపములకుఁ బ్రతీకార మొనర్చు భారము తమదేయని విన్నపించుచున్నాను.

క్రొత్తగా మఱేమియుం జేయనక్కఱలేదు. ఆవాహనము మొదలు సర్వముచేయుచున్నాము. ప్రతిదినము నొనర్చు సంధ్యావందనము మొదలు ఏడాదిపొడుగున నడుచు పూజా శ్రాద్ధ వ్రత నియమాదులను కేవల ప్రాణమయములను జేసి ప్రాణప్రతిష్ఠ చేసి యనుష్ఠింపవలయును. కేవల కర్మాభినయము కాదు, కేవల మంత్రపాఠము కాదు, కేవలానుష్ఠానమాత్రము కాదు, ఇది సత్యమయము ప్రాణమయము సఫలతామయము నైన సజీవానుష్ఠానముగా ననుభవము కావలయును కర్మకాండము నావిధముగాఁ జూడవలయును, చూపింపవలయును.

పూర్వకాలమందు దేవతలు యజ్ఞస్థలమునకు వచ్చి యాహుతుల నను గ్రహించి యజమానులకు యజ్ఞఫలము నిచ్చుచుండెడివారని పురాణములందు వర్ణింపఁబడెను. ఆమాటలు రవ్వంతయు నతిరంజితములు కావు. నిక్కముగాఁ బూజాదులందు దేవతావిర్భావమగుచుండెను. ఇక్కాలికాలమందును నగును. నేఁడును సత్యమందుఁ బ్రతిష్ఠితులై పూజించుటవల్ల నా పూజలు పూర్ణసఫలతామయము లగును. ఇపుడు (ఈ జన్మమందు) పూజాదులొనర్చినచోఁ గాలాంతరమందు వీనివలని ఫలలాభమగునని నెడివారి కిమ్మాటలు నచ్చవు. పూజాకాలమందే పూజాఫలలాభమగును. కాలాంతరాపేక్ష లేదనుట నిశ్చయము. ఏవో కొన్ని విశిష్టఫలములకై కాలాంతరాపేక్ష యుండును. పూజవలని సాధారణఫలముకైన దేవతా ప్రత్యక్షత, ఆత్మతృప్తి, అలౌకిక సంఘటనము మున్నగునవి యా పూజాకాలమందే ప్రాప్తములగును. సత్యమయ ప్రాణమయ పూజ కొన్నాళ్లు చేయుటచేతనే పూజకుని జీవనము ధర్మమయమగును. జీవనము ధర్మమయమగునపుడు దారిద్ర్యము, దుఃఖము, అశాంతి మున్నగునవి తొలఁగిపోయి బ్రతుకు శాంతిమయము నానందమయము నగును. కావుననే కర్మకాండమున కధినాయకులైన బ్రాహ్మణోత్తములు తామే యాదర్శస్వరూపులై, యిట్టి యాదర్శకర్మములను దాము చేసి, యితరులచేఁ జేయించినచో నచిరకాలమందే యీ యశ్రద్ధ, యీ యవిశ్వాసము మున్నగునవి తొలఁగిపోయి, నానాఁట సనాతనధర్మమునెడ లోకులందు శ్రద్ధావిశ్వాసములు నెలకొనునని విన్నవించుచున్నాను.

పాఠకులారా! శాశ్వతుఁడును ధర్మగోప్తయు నై ధర్మసంస్థాపనార్థము యుగయుగములందు నవతరించు తత్పురుషుని చరణములందుఁ బూర్తిగా నాత్మార్పణముచేసి ప్రార్థింతము రండు.

త్వమక్షరం పరమం వేదితవ్యం
త్వమస్య విశ్వస్య పరం నిదానం,
త్వమవ్యయః శాశ్వతధర్మగోప్తా
సనాతన స్త్వం పురుషోమతో మే.



ఇది
శ్రీకాపశీవాసి, హారితసగోత్రుఁడు, శ్రీ శ్రియానందనాథాపరనాముఁడు
ఈశ్వర సత్యనారాయణశర్మ వ్రాసిన
దేవపూజా రహస్యము.
శ్రీ పరదేవతా చరణారవిందార్పితము.

—*—

జానకిరాం ప్రెస్, తెనాలి.

# శ్రీ ఈశ్వర సత్యనారాయణశర్మగారి రచనలు

బాలాంబికా శతకము

అమ్మతో ముచ్చటలు

శ్రీ సూక్తరహస్యార్థము

సౌందర్యలహరి (ఆంధ్ర పద్యానువాదము విశేషవివరణసహితము)

కాళిదాసదేవీపంచస్తవి (ఆంధ్ర పద్యానువాదము)

మహాసౌరమంత్రపాఠానువాదము

భీమేశ్వరనుతి (శివాష్టోత్తరశతనామ పరమార్థబోధకము)

వాసవికన్యకాంబాస్తుతి

శ్రీదేవీసూక్తపరమార్థము - సోఽహం సమాధి

శ్రీసత్యనారాయణశర్మసాధనము

జీవానందనాటకము (ఆనందరాయమఖికృతి కనువాదము)

పుత్రవతీహితోపదేశములు

అరసవల్లీక్షేత్రమాహాత్మ్యము

శిశువ్యాధులు

ఆంధ్రీకృతశార్ఙ్గధరత్రిశతి

# వెలువడనున్నవి.

1 అమ్మతో ముచ్చటలు (ద్వితీయ ముద్రణ ఈంకారిణీ సమీక్షా సహితము)

2 శ్రీసిద్ధాంతశిఖామణి వివరణ (వీరశైవగ్రంథరాజము)

3 శ్రీవిద్యాంధ్రభాష్యము

4 శాస్త్రిసాధనము

5 సప్తశతీ (చండీపాఠ) తత్త్వసారము

6 సప్తశతీ (చండీపాఠ) విపులాధ్యాత్మికావివరణము

7 సౌందర్యలహరీ సంప్లావనములు ఆనందలహర్యాప్లావనములు

8 రుద్రకోటీశ్వరశతకము

9 హ్రీంకారశతకము

ప్రతులకు:— సాధన గ్రంథ మండలి, తెనాలి.

# సాధన గ్రంథ మండలి ప్రచురణలు

| | |
|---|---|
| భగవత్ప్రాప్తి-ఉపాయములు | 0-4-0 |
| నామసంకీర్తనలు | 0-10-0 |
| హరి నామ మహిమా శతకము | 0-4-0 |
| సప్త మహావ్రతములు | 0-6-0 |
| ఈశ్వర సాక్షాత్కారము | 0-3-0 |
| శ్రీ సీతా రామశతకము | 0-2-0 |
| గీతా ప్రతిభ | 0-12-0 |
| భాగవతకథ 1,2,3,4,5,భా | 2-0-0 |
| ,, 6వ భాగం | 2-8-0 |
| శ్రీ త్రిపురాంతకేశ్వరశతకము | 0-4-0 |
| శ్రీ త్యాగరాజచరిత్ర | 0-4-0 |
| పరమసాధన | 0-12-0 |
| కాళహస్తీశ్వరశతకము | 0-8-0 |
| ఆశ్వినమాహాత్మ్యము | 2-0-0 |
| భారతీయతత్త్వశాస్త్రము | 2-0-0 |
| శ్రీ రామపూజా విధానము | 0-4-0 |
| బదరీయాత్ర | 1-0-0 |
| కల్యాణకుంజము | 1-4-0 |
| సిద్ధాంతకల్పవల్లి | 1-0-0 |
| మానవధర్మము | 1-0-0 |
| అష్టాదశశ్లోకగీత | 0-12-0 |
| భక్తితత్త్వము | 0-12-0 |
| ముక్తిగీత | 0-6-0 |
| గురుశిష్యులు | 1-0-0 |
| సంకీర్తన మీమాంస | 1-0-0 |
| పరమార్థతత్త్వము | 0-12-0 |
| శ్రీ శుకుడు | 0-12-0 |
| శ్రీరామనామప్రభావము | 0-6-0 |
| హిందూకోడ్ బిల్లు సమీక్ష | 1-0-0 |
| రాధారహస్యము | 1-4-0 |
| జడభరతుడు | 0-12-0 |
| పద్మపురాణం బ్రహ్మఖండం | 1-0-0 |
| ,, ఆదిమఖండము | 1-8-0 |
| ,, భూమిఖండము | 2-0-0 |
| మహాత్మ ఉపాసనీబాబా | 1-8-0 |
| అర్థపంచకము | 0-12-0 |
| గోవింద దామోదరస్తోత్రం | 0-8-0 |
| భక్తి రసాయనము | 2-0-0 |
| గీతాకదంబము 1 భా | 1-4-0 |
| ,, 2 భా | 1-4-0 |
| శంకర గ్రంథరత్నావళి | 3-0-0 |
| భారతీయదర్శనము | 1-8-0 |
| *సుందర భారతయాత్ర (770 పైగా పేజీలు 280 చిత్రములు) | 4-0-0 |
| తులసీగోపూజ | 0-3-0 |
| ధ్యానపద్ధతి | 0-8-0 |
| ఉపన్యాసరామాయణము | 0-4-0 |
| శివతాండవము | 1-0-0 |
| శ్రీ తులసీమహామృతము | 1-8-0 |
| శ్రీ కనకదుర్గానందలహరి | 0-4-0 |
| భగవద్గీతమూలం | 0-6-0 |
| భగవన్నామసంకీర్తన | 0-4-0 |
| అష్టాదశశ్లోకగీత (మూలం) | 0-2-0 |
| నేపాలయాత్ర (సచిత్రము మ్యాప్) | 1-4-0 |
| భీమేశ్వరనుతి | 0-8-0 |
| శ్రీ దేవీసూక్తపరమార్థము | 0-12-0 |

* ఇది గాక మిగతా గ్రంథములన్నియు సెట్టుగా తీసికొనిన సగముధరకు ఇవ్వబడును. ముందుగా రు 10/- అడ్వాన్సు పంపవలెను.